*Issued on 12-10-1957*

VOL. V
No. 5



*23rd July, 1957*
*(Tuesday)*

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES
# OFFICIAL REPORT

## Part II—PROCEEDINGS OTHER THAN QUESTIONS AND ANSWERS

---

CONTENTS



NOTE: *At the commencement of the speech denotes confirmation from the Member not received in time.

---

PRINTED BY AJANTA PRINTERS, SECUNDERABAD
FOR THE DIRECTOR, GOVERNMENT PRINTING PRESS
ANDHRA PRADESH, HYDERABAD.

1957

# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Thirty-seventh Day of the Fifth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Tuesday, the 23rd July,* 1957.

The House met at Half Past Eight of the Clock

[*Mr. Speaker in the Chair*]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## ABNORMAL INCREASE OF HOUSE TAXES IN MUNICIPAL AREAS.

మిస్టర్ స్పీకర్ : శ్రీ బి. శ్రీరామమూర్తిగారు adjournment motion అని యిచ్చారు. అది adjournment motion కాదనుకోండి. రెండుమాటలు చెపుతారు. మంత్రిగారుకూడా ఏదో explanation చెపుతామన్నారు.

శ్రీ బి. శ్రీరామమూర్తి (విజయనగరం) : అధ్యక్షా ! ఆంధ్రప్రదేశ్‌లో యున్న మునిసిపాలిటీలలో ఇండ్లపన్నులు ఈమధ్య దారుణంగా పెరిగాయి. నాలుగయిదు రెట్లుకూడ పెరిగిన పరిస్థితియున్నది. ఇదిచాలా అన్యాయంగా యున్నది. Rent Control Act అమలులోవున్న రోజులలో 1940 ఏప్రిల్ 1 తేదీకి 12 మాసములకు ముందుఉన్న అద్దెమాత్రమే fair rent గా నిర్ణయించబడుతోంది కాబట్టి rental value పెరిగిందని భావించుటకు అవకాశంలేదని ప్రభుత్వానికి తమద్వారా విజ్ఞప్తి చేస్తున్నాను. ఇదేరకంగా ఇంటియజమానులు నివశించు యిండ్లగురించి, యిదివరకు Composite Madras State లో ఒక

ఆర్డరు యిచ్చియున్నారు. Government of Madras, Development Department Memorandum No. 78085, No. 454, 22 April, 48, ప్రకారం రెంటుకంట్రోలు ఆర్డరు దృష్టిలో పెట్టుకొంటూ, యింటిపన్ను పెంచిన అధికారి తన discretion సమానంగా వినియోగించారని చెప్పటానికి వీలులేదని అంటూ, ఇంటియజమాని నివసించునటువంటి యింటిపన్ను పెంచి కట్టడానికి వీలులేదని స్పష్టంగా ఆర్డరు జారీచేసియున్నారు. అందుచేత ఈ రెండు సందర్భాలలో పన్ను పెంచటానికి వీలులేదని ప్రభుత్వానికి తమద్వారా మనవి చేస్తున్నాను. ఏరకంగానైనా పెంచవలసిన పరిస్థితి ఏర్పడితే uniform గా నూటికి 10, 15 వంతులు అన్ని ఇండ్లకు (కొన్ని exceptions ఉంటే ఉండవచ్చును) పెంచవచ్చును. అవకాశంఉన్నది. Municipal assessment book లో rental value, 1940 సం॥నకు 12 మాసాలముందు ఉన్నటువంటి 25 రూ. లు అద్దెఉన్న యింటికి 8⅓% పెంచుటకు అవకాశం, అధికారికి ఉన్నదికాబట్టి, ఆరకంగా పెంచితే పెంచవచ్చును. కాని అంతకుమించి పెంచుటకు వీలులేదని విజ్ఞప్తిచేస్తున్నాను.

స్థానిక పరిపాలనామంత్రి (శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి) : అధ్యక్షులు శెలవిచ్చినట్లు యిది adjournment motion కాదు. ఇది ఒక ఊరి సంగతికాదు, general గా raise చేశారు. మొత్తం రాష్ట్రం అంతా పన్నులు పెరిగినవని, ఇంటి యజమానులు అద్దెపెంచుకొనుటకు వీలులేకుండా యున్నదనిచెప్పారు. మనకు ఒక Valuation Department ఉన్నది. అది Taxation Enquiry Commission వారి సిఫార్సుననుసరించి, assessment చేయుటకు, ప్రత్యేకంగా "central pool of officers with special knowledge" గల వారిని పెట్టారు. ఈపని యిదివరకు కమిషనర్సు చేస్తున్నారు. వారుమ్యునిసిపల్ అధ్యక్షులకుగాని, మ్యునిసిపల్ సంఘాలకుగాని లోబడి, యిష్టమువచ్చినట్లు ఒకరికి పెంచుట, ఒకరికి తగ్గించుట, discrimination ఉపయోగించి చేస్తున్నారని, ఒకసిద్ధాంతం పెట్టారు. అందువలన, రెండుమూడు సంవత్సరముల క్రిందట ఒక Valuation Department పెట్టుకున్నాము. దానిలో కమీషనర్సు కాకుండా, వేరే 'people with special knowledge' వారికి intensive training ఇచ్చి, వారిచేత యీ assessment జరుపబడుతున్నది. ఈ Valuation పని, కేవలం పన్నులుపెంచుటకు కాదు. ప్రతి మునిసిపాలిటీలోను అయిదు సంవత్సరములకొకసారి జనరల్ రివిజన్ వచ్చినప్పుడు, rationalisation పద్ధతిప్రకారం ఆలోచించి, పన్ను ఎక్కువగాయుంటే తగ్గించి, తక్కువగాయుంటే హెచ్చించి, చేయాలని ప్రభుత్వ ఉత్తర్వులు జారీచేయబడినవి. అట్లాగే చాలాచోట్ల చేస్తున్నారు. ఈపని ఎక్కడో కూర్చుని చేసేదికాదు. ఆఫీసర్లు door to door తిరిగి assess చేస్తారు. దానిలో చాలా checks ఉన్నవి. మొదట ఒక Valuation Officer (2nd Grade

Commissioner) రు. 350 – 400 జీతం తీసుకునేవారు వెళ్ళి assessment చేస్తారు. తరువాత దానిని revise చేయుటకు యింకొక Valuation Officer ను పంపిస్తాము. పన్ను enhance అయినదంటేగాని, యింకేమైనా యిబ్బందులు వున్నాయంటేగాని, ఆయన check చేస్తాడు. ఇదిగాక, యెక్కడైనా complaints వస్తే Chief Valuation Officer వెళ్ళి at random గా తనిఖీచేసి ఎక్కువతక్కువలుంటే సరిచేస్తారు. ఇదిఅంతా అయినతరువాతకూడ, అక్కడ స్థానికంగాయున్న Municipal Council కు, effect అయినవారు appeal చేసికొనవచ్చును. Municipal Council చేసేనిర్ణయం final decision అవుతుంది. గవర్నమెంటుకు ఏమాత్రం దీనిలో జోక్యంలేదని మనవిచేస్తున్నాను.

గౌ॥ సభ్యులు Rent Control Act సంగతిచెప్పారు. నాకు తెలిసినంత వరకు Madras Building Rent Control Act క్రింద, ఈ హైదరాబాదులో యుండే శాసనముక్రిందకూడ, rents అధికముచేసుకొనుటకు, అధికముగా యుంటే తగ్గించుకొనుటకు—యీ రెండు provisions ఉన్నవి. ఆ Act ప్రకారం చర్యతీసుకుంటే అది వేరేచర్య అవుతుందని మనవిచేస్తున్నాను.

*Mr. Speaker*: This is disallowed in view of the explanation given by the hon. Minister.

## BUDGET — DEMANDS FOR GRANTS

*DEMAND No. VIII — Irrigation* — *Rs.* 1,95,39,100

*DEMAND No. XXXVII — Capital outlay on Irrigation — Rs.* 4,40,40,000

*DEMAND No. XLI — Capital outlay on Multipurpose River Schemes — Rs.* 7,78,25,000

*Mr. Speaker*: The hon. Minister for Irrigation will now move Demands Nos. VIII, XXXVII, XLI.

*The Minister for Irriagation & Power (Sri J. V. Narsing Rao)* Sir, On the recommendation of the Governor, I beg to move:

"That the Government be granted a sum not exceeding Rs. 1,95,39,100 under Demand No. VIII - Irrigation."

"That the Government be granted a sum not exceeding Rs. 4,40,40,000 under Demand No. XXXVII - Capital outlay on Irrigation."

"That the Government be granted a sum not exceeding Rs 7,78,25,000 under Demand No. XLI Capital outlay on Multi-purpose River Schemes."

*Mr. Speaker*: Motions moved.

శ్రీ జె. వి. నరసింగరావు : అధ్యక్షా, ప్రభుత్వానికి 8వ పద్దుక్రింద రు. 1,95,39,100లు నీటిపారుదలకు, 37వ పద్దుక్రింద రు. 4,40,40,000 నీటిపారుదలపై పెట్టుబడి ఖర్చుకు, 41వ పద్దుక్రింద రు. 7,78,25,000 లు బహుళార్థసాధక నీటి స్కీములకు (మల్టీపర్పస్‌స్కీమ్స్) మంజూరుచేయవలెనని కోరుతున్నాను.

8వ పద్దు:- ఈ పద్దు నీటిపారుదల నిర్మాణాలను విస్తరింప జేయటానికి అభివృద్ధులు చేయడానికీ, మరమ్మతు చేయడానికీ, నిర్వహించడానికీ అయ్యే ఖర్చుల నిమిత్తం ప్రస్తుత రాబడులనుండి తీసుకోడానికి సంబంధించినట్టిది.

37వ పద్దు:- నీటిపారుదలపై అయ్యే ఖర్చులో అధిక భాగం ఈ పద్దు క్రిందికివస్తుంది. మల్టీపర్పస్ (బహుళార్థసాధకనదీ) ప్రాజెక్టులకు సంబంధించిన ఖర్చు ఈ పద్దులో నుండి మినహాయించబడినది. ఈ పద్దుక్రింద యీ దిగువ వాటిపై ఖర్చుపెట్టబడుతుంది.

క్రొత్త ఉత్పాదక ప్రాజెక్టులు ప్రస్తుత ప్రాజెక్టుల విస్తరణ, బాగుచేత ఈ ప్రాజెక్టులు ప్రత్యేక నిర్మాణాలుగా భావించబడతాయి. ఇవీ ఉత్పాదక ప్రాజెక్టులే.

ఇప్పుడున్న ఉత్పాదక వ్యవస్థలకు సంబంధించి ఉండి, ఆ వ్యవస్థలోని భాగాలుగా భావించబడే నిర్మాణాలు.

క్రొత్త అనుత్పాదక ప్రాజెక్టులు.

ఇప్పుడున్న అనుత్పాదక వ్యవస్థలకు సంబంధించిన నిర్మానాలు.

41వ పద్దు:- బహుళార్థ సాధక నదీ స్కీములు అనగా నాగార్జునసాగర్ ప్రాజెక్టు, గోదావరి ఉత్తరపు కాలువ ప్రాజెక్టు - వీటికయ్యే ఖర్చు యీ పద్దుక్రింద చూపబడింది.

భారతదేశంలో మొత్తం 78 కోట్ల ఎకరాల భూమి ఉన్నది. ఇందులో వ్యవసాయయోగ్యమయినది 37 కోట్ల ఎకరాలు. సేద్యం చేయబడిన మొత్తం భూమి 23 కోట్ల, 6 లక్షల ఎకరాలు. ఇందులో 5 కోట్ల ఎకరాలకు మాత్రమే ప్రతి సంవత్సరం నీటిపారుదల లభిస్తున్నది. నీటిపారుదల లభించేభూమి వ్యవసాయయోగ్యమైన భూమిలో 13.5 పర్సెంటు.

ఆంధ్రప్రాంతంలో వ్యవసాయయోగ్యమైన భూమి రెండున్నరకోట్ల ఎకరాలు. ఇందులో 45 లక్షల ఎకరాలు సేద్యం చేయబడ్డది. అది వ్యవసాయ యోగ్యమైన భూమిలో 18.7 పర్సెంటు మాత్రమే. తెలంగాణా ప్రాంతం లోని వ్యవసాయయోగ్యమైన కోటిన్నర ఎకరాల మింజుమలె 14 లక్షల ఎక

రాలకు నీటి పారుదల జరిగింది. అది మొత్తం వ్యవసాయ యోగ్యమైన భూమిలో 10 పర్సెంటు మాత్రమే.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని నదీరాష్ట్రం (రివర్ స్టేట్) అనడం సబబుగానే ఉన్నది. దీనిలో పెద్ద నదులు, మధ్యరకపు నదులు, ఉపనదులు అనేకమైనవి ఉన్నవి. ఈ నదులు ప్రతి సంవత్సరం బంగాళాఖాతంలోకి 150 మిలియను ఎకరపుటడుగుల నీళ్ళను అంటే, ఒక్క బ్రహ్మపుత్రానది తప్ప మనదేశంలోని మిగతా నదులన్నింటిలోనూ గలనీటిలో 15 పర్సెంటు చేరవేస్తున్నాయి. ఆంధ్రలో ప్రవహించే నదులలోని మొత్తం 150 మిలియను ఎకరపుటడుగుల నీటిలో, సుమారు 50 మిలియను ఎకరపుటడుగుల నీటిని ఎగువ భాగంలో బొంబాయి, మైసూరు, మధ్యప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలలో ఉపయోగించుకొనవచ్చును. 20 మిలియను ఎకరపుటడుగుల గరిష్ట మొత్తం ఆంధ్రప్రాంతంలోని ప్రస్తుత నీటిపారుదలకు ఇప్పుడు ఉపయోగించుకోబడుతున్నది. సుమారు 80 మిలియనుల ఎకరపు టడుగులవరకు ఆంధ్రరాష్ట్రంలో మిగిలి ఉన్నవి.

ఈ కారణంగానే యీ రాష్ట్రపు రెండవ పంచవర్ష ప్రణాళికలో నీటి పారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులకు అన్నింటికన్నా ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో నీటిపారుదల ప్రాజెక్టుల కోసం ఆంధ్ర ప్రాంతానికి రు. 12·38 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రు. 3·96 లక్షలు కేటాయించబడ్డాయి. ఈ నాగార్జున సాగర్ ప్రాజెక్టు డాముకూ, కుడి ఎడమ కాల్వలకూ కేటాయించబడ్డ రు. 32·30 కోట్లు మొత్తంలో చేరవు. ఇదిగాక ఇటీవలి సంవత్సరాలలో ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న జమీందారీలలోని ఉపేక్షింపబడ్డ అనేక నీటిపారుదల చెరువులను తగుస్థాయికి తీసుకునివచ్చే నిమిత్తం కేటాయించబడ్డ రు. 70 లక్షలు కలుపుకొని, ఆంధ్రప్రాంతంలో చిన్న నీటి పారుదల స్కీముల నిమిత్తం రు. 242·90 లక్షలు ఏర్పాటు కలదు. అలాగే, గండ్లు పడ్డ అనేక చెరువులకు మరమ్మతు చేయడానికీ, చిన్న నీటిపారుదల స్కీములకూ తెలంగాణా ప్రాంతంయొక్క రెండవ పంచవర్ష ప్రణాళికలో రు. 201·02 లక్షల ఏర్పాటు కలదు.

ఆంధ్రప్రాంతపు మొదటి పంచవర్ష ప్రణాళికలో చేర్చబడ్డ ఆరు పెద్ద ప్రాజెక్టుల్లో, రొంపేరు ప్రాజెక్టూ, తుంగభద్ర దిగువమట్టం కాలువ, తుంగభద్రా లోలెవెల్ కెనాల్ ప్రాజెక్టూ పూర్తిఅయినవి. వీటివల్ల లాభాలు రాసాగినవి కూడ. రొంపేరు ప్రాజెక్టు 20,000 ఎకరాల భూమిని మునిగిపోకుండా చేసింది. ఈ ప్రాజెక్టు క్రింద దాదాపు 5,000 ఎకరాల భూమి కూడా క్రొత్తగా సాగులోకి తేబడింది. తుంగభద్ర దిగువ మట్టం కాలువక్రింద 1,30,000 ఎకరాల భూమి సాగు నిమిత్తం నీరు వదలబడి, 24,270 ఎక

రాల భూమి సాగుచేయబడింది. మిగిలిన నాలుగు ప్రాజెక్టుల మీద పని చురుకుగా సాగుతున్నది. త్వరలోనే అవి పూర్తికాగలవని ఆశిస్తున్నాము. కృష్ణా బ్యారేజి 1958 జూన్ నాటికి పూర్తిఅవుతుందని ఆశిస్తున్నాము. 1957-58 సంవత్సరానికిగాను ఈ ప్రాజెక్టుకోసం ఏర్పాటుచేయబడ్డ మొత్తము రు. 66.216 లక్షలు. భైరవునితిప్ప ప్రాజెక్టుకు రెగ్యులేటర్ నిర్మాణం, కుడి ఎడమ కాల్వల త్రవ్వకం, మట్టిడాము పునాది నిమిత్తం బావుల త్రవ్వకం—ఈ పనులు చురుకుగా సాగుతున్నవి. ఎగువ పెన్నారు ప్రాజెక్టుయొక్క హెడ్ వర్క్సు పూర్తిఅయినవి. గేట్లను కలుపుటమాత్రం కాలేదు. అవి వర్కుషాపులలో తయారు అవుతున్నవి. రాళ్ళపాడు ప్రాజెక్టుయొక్క రెగ్యులేటర్ భాగము దాదాపు పూర్తిఅయింది. షట్టర్లు పెట్టడం, ఇంకా కొన్ని చిన్నచిన్న పనులు మాత్రం కావలసియున్నది.

నాగార్జునసాగరు ప్రాజెక్టుయొక్క మూడు యూనిట్లపై డాము, కుడికాలువ, ఎడమకాలువలపై, పనిబాగా సాగుతున్నది. ప్రస్తుత సంవత్సరానికి 550 లక్షలు రూపాయలు కేటాయించినారు. ఈ సంవత్సరం బడ్జెటులో మాత్రం 650 లక్షల రూపాయలు ఏర్పాటు చేయబడినవి. ఈవిధంగా ఎక్కువ మొత్తము కేటాయింపుకు కారణము భారతప్రభుత్వముతో ఇంకా పని ఎక్కువ కాగలదనే ఆశయే కారణం.

తుంగభద్రా హైలెవెల్ ఛానల్ స్కీము రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడింది. ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలమధ్య యీ నీటిని పంచుకొనుటకై గత సంవత్సరం ఒప్పందం జరిగింది.

వంశధారా ప్రాజెక్టు విషయంలో కేంద్ర జలవిద్యుత్ కమీషను సిఫారసు రాష్ట్రంలోని గునుపూరు వద్దనున్న గుడారి ప్రాజెక్టుకు ప్రత్యామ్నాయ స్థలంగా సూచించింది. పరిశోధనలు వివరంగా జరుపవలసిందిగా కూడా సూచించింది. గుడారి స్థలాన్ని వివరంగా పరిశోధించుటకు నిశ్చయింపబడింది. పరిశోధన సిబ్బంది నిమిత్తమూ, అవసర పరికరాల నిమిత్తమూ 3 లక్షల రూపాయలు మంజూరుచేసే ప్రతిపాదన ఆలోచనలో ఉన్నది. ఒరిస్సారాష్ట్రపు హద్దులలోనికి వెళ్ళి అక్కడ లెవెల్సు పరిశోధన చేయుటకు ఆ రాష్ట్రప్రభుత్వం వారు అనుమతించినారు.

రాజోలిబండ మళ్లింపు స్కీము తాలూకు పని చాలా వరకు అయింది. ఈ స్కీములో దాదాపు లక్ష ఎకరాల భూమిని సాగుచేసేందుకు ఒక కాలువ రాజోలిబండనుండి తుంగభద్రవరకు ఉంటుంది. ఆనకట్ట, 27వ మైలువరకు ఈ కాలువ కూడ మైసూరు రాష్ట్రంలో ఉంటాయి. కాలువయొక్క మిగిలిన

భాగం 28వ మైలునుంచి 64వ మైలువరకు ఆంధ్రప్రదేశ రాష్ట్రంలో ఉంది. హెడ్‌వర్క్సు, కాలువయొక్క మొదటిభాగం మైసూరు రాష్ట్రంలో ఉండటంవల్ల ఈ వర్క్సు నిర్మాణంగురించి ప్రయోజనాల పంపకం గురించి మైసూరు ప్రభుత్వంతో సంప్రదింపులు జరుగుతున్నవి.

పోచంపాడు వద్ద గోదావరి నదిపై పెద్ద స్కీము యొక్క పరిశోధనను ప్రారంభించడానికి ప్రభుత్వము వారు ఉద్దేశించినారు. కేంద్రజలవిద్యుత్ కమీషను పంపిన ప్రతినిధి, మన ఇంజనీర్లు కలిసి ఆ స్థలాన్ని తనిఖీచేశారు. దీని పరిశోధన కోసం సిబ్బంది కూడా మంజూరైంది. ఈ ప్రాజెక్టు పరిశోధనకు ప్రభుత్వం అత్యంత ప్రాముఖ్యత ఇచ్చుచున్నది. త్వరలోనే ఈ పరిశోధన పూర్తి కాగలదని ప్రభుత్వం భావిస్తున్నది. దేశంలో తరచు క్షామం వచ్చే ప్రాంతాలలో శాశ్వత మైన అభివృద్ధులు చేయడానికి, ఉద్యోగ అవకాశాలను పెంచడానికి సంబం ధించిన కార్యక్రమంక్రింద కేంద్రసహాయం చేసిన 5 కోట్ల రూపాయలతో ఆంధ్ర ప్రాంతంలో 17 నీటిపారుదల ప్రాజెక్టులు ప్రారంభించబడ్డాయి. ఈ 17 ప్రాజెక్టులలో 4 ప్రాజెక్టులు యిదివరకే పూర్తి అయ్యాయి. తక్కినవాటి నిర్మాణం చురుకుగా సాగుతోంది. ఈ జరుగుతున్న సంవత్సరంలో అవి పూర్తి కావలసివుంది. ఈ ప్రాజెక్టుల కోసం 1957-58 బడ్జెటు అంచనాలలో 74.99 లక్షల రూపాయలు మొత్తం కేటాయించబడింది. మొదటి పంచవర్ష ప్రణాళికలో ప్రారంభించబడ్డ తెలంగాణా ప్రాంతంలోని 5 మధ్యరకపు ప్రాజెక్టుల నిర్మాణం కూడా చాలవరకు పూర్తికావచ్చింది. ఈ స్కీముల కోసం 1957 - 58 బడ్జెటు అంచెనాలలో 33.30 లక్షల రూపాయల మొత్తం కేటాయింపబడింది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి ఆంధ్రప్రాంతంలో క్రొత్తగా 13 మధ్యరకపు నీటిపారుదల ప్రాజెక్టులు సిఫారసు చేయబడ్డాయి. వీటికి వున్న కేటాయింపు రెండు కోట్ల రూపాయలు. ఈ మధ్యరకపు స్కీములను తీసు కోవడంలో పాటిస్తున్న ముఖ్య సూత్రమేమంటే ఇదివరకు ఏ పెద్ద నీటి ప్రాజెక్టుల వల్లను నీటిపారుద్దల సౌకర్యం పొందని ప్రాంతాలకు కనీసం మధ్య రకపు నీటిపారుదల ప్రాజెక్టు వల్లనైనా ప్రయోజనం కలుగజేయాలనేది. రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి తెలంగాణా ప్రాంతంలో క్రొత్తగా 11 మధ్యరకపు నీటిపారుదల స్కీములు ప్రతిపాదించబడ్డాయి. వీటికి వున్న కేటాయింపు 176.64 లక్షల రూపాయలు. అయినా ఆదాయపు లోటు వలన ఈ మధ్యరకపు స్కీములకోసం ప్రస్తుత సంవత్సరంలో కేటాయింపు ఏమీ చేయడానికి వీలుకాలేదు. వీటిలో కొన్నింటిని వచ్చే సంవత్సరం ప్రారం భించడానికి వీలుంటుందని భావిస్తున్నాం. చెరువుల అభివృద్ధి స్కీములలో చిన్న

చిన్న స్కీములకోసం 1957-58 బడ్జెటులో మొత్తం 31.19 లక్షల రూపాయలు కేటాయించబడ్డాయి. తెలంగాణా ప్రాంతంలో గండ్లుపడ్డ చెరువుల మరమ్మతు కొరకు క్రొత్తస్కీములకు ఈ బడ్జెటులో 31.53 లక్షల రూపాయలు మొత్తం ఏర్పాటు చేయబడింది. ఈ స్కీములు ఆ అధికాహారోత్పత్తి కార్యక్రమంక్రింద కేంద్ర ఋణసహాయాన్ని పొందడానికి తగిఉన్నవి. వీటికయ్యే ఖర్చు నీటిపారుదల మీద పెట్టుబడిఖర్చు, పద్దు నెంబరు 37 క్రింద భరించబడుతుంది.

1957-58 సంవత్సరానికి నీటిపారుదల పద్దు నెంబరు 8 క్రింద చిన్న నీటిపారుదల పనులకు 3,500 రూపాయలు నిర్వహణ, మరమ్మత్తులకు 34,02,000 రూపాయలు మొత్తం 34,05,500 రూపాయలు కేటాయించబడ్డాయి. ఈ కేటాయింపు, రెవిన్యూ శాఖవారి స్వాధీనంలోవుండే నీటిపారుదల పనులను జరపడానికి మాత్రమే ఉద్దేశింపబడింది. ఇది రెవిన్యూ ఖాతాలో ఖర్చు వ్రాయబడుతుంది. రెవిన్యూ బోర్డు, వాస్తవమైన అవసరాలను బట్టి రాష్ట్రంలో వివిధ జిల్లాలకు నిధులను పంచుతుంది. బోర్డుపనుల పురోగతిని, ఖర్చును ప్రతినెల సమీక్షిస్తుంది. ఇంతే కాకుండా, ఒక జిల్లాకు అవసరంలేని నిధులను, నిధులు కావలసిన ఇతర జిల్లాలకు కేటాయిస్తుంది.

ప్రస్తుత ప్రణాళికా సమయంలో భారత ప్రభుత్వంవారు, ఈ రాష్ట్రానికి వరద నిరోధక స్కీములకోసం 3.5కోట్ల రూపాయల మొత్తాన్ని ఇచ్చేటందుకు వాగ్దానం చేశారు. ఏది ముందుజరపాలో, ఏది తరుపరి జరపాలో తెలియజేస్తూ ఈ మొత్తం ఖర్చుకు కార్యక్రమాన్ని పంపవలసినదిగా మన ప్రభుత్వాన్ని భారత ప్రభుత్వంవారు కోరారు. ప్రస్తుత సంవత్సరానికి వరదనిరోధక పథకం క్రింద 48 లక్షల రూపాయలు కేటాయిస్తామని సూచించారు. వారికి పంపిన ఎనిమిది క్రొత్త వరద నిరోధక స్కీములు కూడా ఆమోదించబడ్డాయి. అవి త్వరలో మంజూరు చేయబడగలవు. బుడమేరు మళ్లింపు స్కీము ముఖ్యమైన వరద కంట్రోలుస్కీము. ఇది చురుకుగా సాగుతున్నది. నీటిపారుదల మీద ఖర్చు ఎక్కువగా కనబడుతున్నప్పటికి నీటిపారుదల అయ్యేప్రాంతం అంతగా వృద్ధిచెందలేదనే విమర్శ ఇటీవల కొన్ని మాసాలక్రిందట జరిగింది. ఈ విమర్శకు సమాధానం ఇవ్వడానికి ఈ అవకాశాన్ని వినియోగించదలచాను. మొదటి ప్రణాళిక కాలం ప్రారంభంలో ఆంధ్రరాష్ట్రంలోని 11 జిల్లాలలోను నీటిపారుదల జరగిన ప్రాంతం 44.33 లక్షల ఎకరాలని అంచనా వేయబడింది. ఆంధ్ర రాష్ట్రంలో మొదటి ప్రణాళిక కాలంచివరకు నీటిపారుదల అయిన ప్రదేశము 48.48 లక్షల ఎకరాలు. ఇందులో 4.15 లక్షల ఎకరాల పెరుగుదల కనబడుతుంది. అదే విధంగా ప్రణాళిక కాలం ప్రారంభంలో తెలంగాణాలో నీటి

పారుదల అయిన ప్రదేశము 14·50 లక్షల ఎకరాలు. మొదటి ప్రణాళిక కాలం చివరకు నీటిపారుదల అయిన ప్రదేశం 17·23 లక్షల ఎకరాలు. ఆంధ్ర తెలంగాణాల రెండింటిలోను నీటిపారుదల అయిన ప్రదేశములో చెప్పుకోతగ్గ పెరుగుదల కనబడుతున్నది. క్రొత్త ప్రాజెక్టుల క్రింద ఆయకట్టులో ఇంతకన్న త్వరితమైన అభివృద్ధి జరగాలనేమాట వాస్తవమైనదే. పైన తెలిపిన సంఖ్యలు చెప్పుకోదగ్గ పురోగతి సాధింపబడినట్లే సూచిస్తాయి. నీటిపారుదల ప్రయోజనాలను పూర్తిగా వినియోగించలేదనే విమర్శ సరియైనది కాదని నేను మనవిచేయదల్చుకున్నాను. ఈ డిమాండ్లను ఏకగ్రీవంగా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

*Sri P. Sundarayya (Gannavaram)* : Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100/- for
Irrigation by Rs. 100

(ప్రాజెక్టులు కట్టుతున్నప్పుడు దుర్వ్యయాన్ని అరికట్టలేనందుకు, కట్టుతున్న ప్రాజెక్టుల నీటిని వెనువెంటనే వినియోగించడానికి కావలసిన చిన్న కాలువలను, పంటకాలువలను త్రవ్వనందుకు.)

*Mr. Speaker*:- Motion moved.

*Sri B. Ratnasabhapathy* &
*Sri B. Sreeramamurthy:* Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To criticize Government for the failure to integrate Minor and Major Irrigation in one demand.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To criticize Government's failure to avoid wastage in the construction of Major projects.)

*Mr. Speaker:* Motions moved.

*Sri S. Vemayya (Buchireddipalem-Reserved)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకా కుప్పూరుపాడు గ్రామ చెరువు మరమ్మతు జాప్యము జరుగుచున్నందుకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

( నెల్లూరి జిల్లా కోవూరు తాలూకాలో ఉపయోగములేని వేగూరు చెరువును ఎత్తివేయనందున. )

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(లస్కర్లు ఎంతదూరమునుండియైనా వచ్చి ఆఫీసర్ల యిండ్లవద్ద పండు కొని పోవువారికి ప్రయాణ భత్యము యివ్వనందుకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా రామన్నపాలెం, రెడ్డిపాలెం మానే గుంటపాడు, రైతుల ఉపయోగార్థం మలిదేవికి ఆనకట్ట కట్టుటలో జాప్యము జరుగుచున్నందుకు.)

*Mr. Speaker*: Motions moved.

*Sri G. Ganga Reddi* (*Mudhole*): Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ముధోల్ తాలూకాలో కుచీర గ్రామములో ఉండబడిన మత్తడి తయారు చేయనందుకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ప్రభుత్వము ముధోల్ తాలూకాలో త్రాగేనీళ్ళ బావులు త్రవ్వించనందుకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ముధోల్ తాలూకాలో ఉండబడిన పాతచెరువుల మరమ్మత్ చేయించనందులకు.)

*Mr. Speaker*: Motions moved.

*Sri P. Narsimhapparao* (*Palakonda*): Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the Nandivada Project in Palakonda taluk, Srikakulam District.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the irrigable area under second crop in Palakonda taluk of Srikakulam District under the Thotapalli Regulator System of Nagavali River and also of irrigular supply of water under the above mentioned system.)

*Mr. Speaker*: Motions moved.

*Sri Vavilala Gopalakrishnayya* (*Sattenapalli*)*:* Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To know the details as was covered about the Ichampalle, Pochampadu Project on Godavari.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss about the policy of repairs of Irrigation Tanks in the taken-over estates in Vizag, Chittoor; East Godavari, Nellore and Cuddapah.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To impress upon the Government to undertake some Irrigation works to tide over the immediate food crisis.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To impress upon the Government to undertake Seeleru Scheme immediately as stores and skilled workers are available.)

*Mr. Speaker:* Motions moved.

*Sri* K. *L. Narasimha Rao (Yellandu-General)* : Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా బయ్యావరం చెరువుకు సక్రమంగా రిపేరు చేయనందుకు, దానిని ఇర్రిగేషన్ డిపార్టుమెంటుక్రిందికి తీసుకొని ప్రత్యేకంగా మేన్ టేన్ నెన్సు ఏర్పాటు చేయకపోవడం గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా చేతంపూడి గ్రామంలోని రాళ్లపాడుగండి చెరువు నిర్మాణమును ఇప్పటికిని జరుపకపోవడంగురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా చల్లసముద్రం గ్రామంలోని పెద్ద చెరువు మరియు రేలకాయాలపల్లి గ్రామంలోని పెద్దమ చెరువుల మరమ్మత్తు నేటికి పూర్తిచేయలేకపోవడంగురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా కొండాయిగూడెం (పండితాపురం) గ్రామంలో కొండారెడ్డిచెర్వు తప్పుడు సర్వే నాధారం చేసుకుని ఆయకట్టును తగ్గిస్తూ

చేస్తున్న మరమ్మత్తును గురించి ప్రజలు ఆందోళనను పెడచెవిని పెట్టుచున్న నిరంకుశ విధానమును గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా బయ్యావరంచెరువునుండి గార్ల గ్రామంలోని చెరువుకు వచ్చు ఎర్ర కాల్వకు మధ్యన గండ్లుపెట్టి నీటిని అపహరించుకొనిపోతున్న వారిని అరికట్టలేని ప్రభుత్వ అసమర్థతను గురించి.)

*Mr. Speaker*: Motions moved.

*Sri G. Yellamanda Reddi (Kanigiri)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నాగార్జునసాగరు ప్రాజెక్టు నిర్మాణమునకు తగినంత ధనము మంజూరు చేయలేదు గాన.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నాగార్జునసాగరు కుడికాలువను సాధ్యమైనంతవరకు పైగాలోను మెట్ట ప్రాంతాలకు సౌకర్యము కల్పించుటకుగాను.)

*Mr. Speaker*: Motions moved.

*Sri Md. Tahsil (Bhadrachalam–General)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs 1,95,39,100 for
Irrigation by Rs. 100

(భద్రాచలం తాలూకాలోని నల్లచెల్లి చెరువును మరమ్మత్తుచేసి గట్టును 1 అడుగు ఎత్తు పెంచనందులకు.)

*Mr. Speaker:* Motion moved.

*Sri V. Visweswara Rao (Mylavaram)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss the failure of the Government to improve the Paleru Channel Scheme in Jaggayapet taluq, Krishna District.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఉప్పుటేరు స్కీమును అమలు జరుపుటలో జరుగుచున్న జాప్యంను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఎగువ బుడమేరుకు వరద కట్టలను గురించి చర్యలు తీసుకోకపోవటం గురించి నందిగామనుండి కౌలూరు వరకు, విజయవాడ తాలూకా.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(విజయవాడ తాలూకా దాములూరు, జూపూడి గ్రామాలను కృష్ణా నదిలో విరిగి పడిపోకుండా రక్షించుటకు అవసరమైన చర్యలు తీసుకోవటంలో జరిగే జాగును గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నాగార్జున సాగరు నిర్మాణంలో పాల్గొను కూలీలకు తగు సౌకర్యములు కలుగచేయకపోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(విజయవాడ తాలూకాలోనున్న కోనాయిగండి, చింతలచెర్వులను 2 వ పంచవర్ష ప్రణాళికలో చేర్చకపోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(బుడమేరు ప్రాజెక్టు స్థలనిర్ణయం చేయకపోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(బుడమేరు లోయర్ రీచస్‌లో కరకట్టలు పోయుటకు వెంటనే చర్యలు తీసుకోకపోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(తిరువూరు తాలూకాలో యున్న ముత్తగూడెం రాకట్టును గురించి సత్వర చర్యలు తీసుకోకపోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(విజయవాడ తాలూకా నందిగామ దగ్గర బుడమేరు కరకట్టలు బలపర్చుటకు, గండ్లను పూడ్చుటకు సత్వర చర్యలు తీసుకోకపోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(తిరువూరు తాలూకా తుమ్మగూడెం, కూనపరాజు పర్వ విజయవాడ తాలూకా నందిగామ పెద్దచెరువు మరమ్మతులను వెంటనే కొనసాగించక పోవుటను గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

కృష్ణాబ్యారేజి స్కీముక్రింద అదనంగా సాగులోకివచ్చే భూమికి నీటి సౌకర్యం కలుగచేయుటకు అవసరమైన చర్యలు తీసుకోనందులకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(తమ్మిలేరు రిజర్వాయరు నిర్మాణమునకు పూనుకోకపోవటం గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ధవళేశ్వరం ఆనకట్టపై 3 అడుగుల తలుపులస్థానే 6 అడుగుల తలుపులు ఏర్పాటుచేయుటకు సత్వర చర్యలు తీసుకోకపోవటం గురించి.)

*Mr. Speaker:* Motions moved.

*Sri S. Kasi Reddi (Podili):* Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో 4 సం. ల క్రితమే ఎస్టేట్లు వేయబడిన దాదాపు 25 స్కీములలో కొన్నిటిని కూడా ఇంతవరకు తీసుకోకపోవటాన్ని గురించి చర్చించుటకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(గత సంవత్సరం అతివృష్టివల్ల పొదిలి, దర్శి తాలూకాలలో తెగిపోయిన చెరువులను కొన్నింటిని యింతవరకు పూర్తిచేయనందుకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా పొదిలి తాలూకాలో మూసి స్కీమును (వద్దిమడుగుదగ్గర) అమలుజరుపుటకు జరుగుతున్న జాప్యమును గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో మేకవేరు ప్రాజెక్టును గురించి చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో ముక్కుపాపయ్య చెరువు నిర్మాణాన్ని గురించి చర్యలు తీసుకోనందుకు.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో నాగులకుంట చెరువు నిర్మాణాన్ని గురించి చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా మెట్ట తాలూకాలలో కొలతలు వేయబడిన అనేక చెరువుల విషయంలో యింతవరకు చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(పొదిలి పెద్ద చెరువుకు కావలసిన కనీస రిపేర్లను గురించి చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నాగార్జునసాగరు కుడికాలవను ఒకేదశలో నిర్మించుటకు కేంద్రప్రభుత్వం చేత వప్పించుటకు తగిన చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

*Mr. Speaker :* Motions moved.

*Sri S. Vemayya :* Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకా చేజర్ల గ్రామ కొత్తకాల్వను 1949 నుండి పూర్తిచేయించనందులకు.)

*Mr. Speaker :* Motion moved.

*Sri S. Kasi Reddi* : Sir, I beg to move.

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs: 100

(నెల్లూరుజిల్లా అల్లూరువాడలో 5000 ఎకరముల భూమికి మురుగు నీటి కాల్వను మంజూరు చేయనందుకు.)

*Mr. Speaker*: Motion moved.

*Sri K. Ramachandra Reddi (Ramannapeta)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నల్లగొండజిల్లాలో రామన్నపేట తాలూకాలో మాసాంపల్లిలో తెగిన చెరువు మరమ్మతు, ఎన్నారం చెరువు మరమ్మతుచేయుటలో జాగును గురించి.)

*Mr. Speaker:* Motion moved.

*Sri Ch. Rajeswara Rao (Choppadam)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss the possibility of including the Anantaram Project in the mediumsized irrigatiou projects, Anantaram Project being situated in Sircilla taluk, Karimnagar District.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 1C0

(To discuss the possibility of constructing the Moola Vagu Project situated in Sircilla taluq, Karimnagar District.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss the problem of undertaking an immediate census of all breached tanks in Karımnagar district and take up the repairs and restoration works of a good number of the immediately with a view to promote more agricultural production.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss the undue delay in granting and to the Mannwada canal repairs despite the fact that the people have long back deposited their share of expenditdre in Sircilla taluq, Karimnagar district.)

*Mr. Speaker*: Motions moved.

*Sri G. Nageswara Rao (Razole-Reserved)*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(గోదావరి సెంట్రల్ డెల్టాలో రెండవపంటకాలములో తెరవబడకుండా వున్న మూతకాలువలను - పైపులను తెరిచే సమస్యను పరిష్కరించుటకు ప్రభుత్వం యింతవరకు పూనుకోకపోవడం గురించి.)

*Mr. Speaker*: Motion moved.

*Sri B. Sreeramamurthy* - Sir, I beg to move:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss Government's failure to construct a dam across river Champavathi in Vijayanagaram taluq near Ballavametta to provide water supply to Anandapuram alias Kothapet village.)

To reduce the allotment or Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss Government's failure to construct Gantikonda Project on Gostani river near village in order to increase the irrigation facilities in Vijayanagaram division.)

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss Government's failure to construct a Reservoir on the Budameru village near Nandigama village in Krishna District Bezwada taluq).

*Mr. Speaker :* Motions moved.

*DEMAND No. XXXVIII — Capital Outlay and Irrigation - Rs.* 4,40,40,000

*Sri Bhimareddi Narasimha Reddi (Suryapeta-General)* : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 4,40,40,000 for
Capital Outlay and Irrigation by Rs 100

(To discuss the failure of Government in construction the Musi Project in time.

*Mr. Speaker:* Motion moved.

*Sri Vavilala Gopalakrishnayya*: Sir, I beg to move:

To reduce the allotment of Rs. 4,40,40,000 for
Capital Outlay on Irrigation by Rs. 100

(To know the fuller details of the items of construction of Irrigation etc., works (non-commercial 68-A)

*Mr. Speaker:* Motion moved.

*DEMAND No. XLI — Capital Outlay on Multipurpose River Schemes.*

*Sri Vavilala Gopalakrishnayya:* Sir, I beg to move:

To reduce the allotment of Rs. 7,78,25,000 for
Capital Outlay on Multipurpose River Schemes by Rs. 100

(To impress upon the Govt. to request the Govt. of India to allot at least 10 Crores for the Nagarjuna Sagar Project to be sent in this year without any interruption of work for want of money.)

*Mr. Speaker*: Motion moved.

శ్రీ ఎ. వెంకటరామరాజు (రాజోలు-జనరల్) : అధ్యక్షా, నీటిపారుదల శాఖ మంత్రిగారు ఇరిగేషను డిమాండుక్రింద రు. 1,95,39,100 లను Capital outlay క్రింద రు. 4,40,40,000 లను ఆమోదించవలసిందని సభ వారిని కోరడం జరిగింది. వారు ఈ ఉపన్యాసంలో ఆంధ్రరాష్ట్రం ప్రధానంగా వ్యవసాయికరాష్ట్రంగా ఉన్నదని తెలియచేస్తూ, కేంద్రప్రభుత్వ దృష్టిలో ఆంధ్ర రాష్ట్రం ఎంత ప్రముఖస్థానాన్ని ఆక్రమించినదో చెప్పారు. వీరి వివరణను దృష్టిలో పెట్టుకుని కేంద్రప్రభుత్వం ఇస్తున్న సహాయాన్ని పరిశీలించవలసి ఉంటుంది. కేంద్రందగ్గరనుంచి తీసుకువచ్చిన సహాయాన్ని ఈ items క్రింద ఇవ్వడంలో ఏ రకమైన శ్రద్ధ మనము తీసుకుంటున్నామో పరిశీలించవలసి యున్నది. ఆంధ్రదేశంలోని వివిధ నదులలో గోదావరి నది ఎంతో ప్రముఖ మైన స్థానాన్ని వహిస్తున్నది అని కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం కూడా అభిప్రాయపడుతున్నాయని మంత్రిగారు వివరించారు. ఆ రకంగా గోదావరి నది ప్రాముఖ్యత గురించి వర్ణించడమేనా ? కార్యాచరణవిధానం ఎట్లా ఉన్నదో పరిశీలించవలసియున్నది. ఒక్క పోచంపాడు విషయంలో మాత్రం కేంద్ర ప్రభుత్వము, రాష్ట్ర ప్రభుత్వము ఒక స్పష్టమైన నిర్ణయానికి వచ్చినట్లు అక్కడ ప్రత్యేకమైన investigation ఏర్పాట్లు పూర్తిచేస్తున్నట్లు వారు చెప్పారు. అయితే ఈరోజున ఆంధ్రదేశంలోని నీటిపారుదల సౌకర్యాలను మనం వినియో గించడంలోను, లేక ఈనాడు మనం నిర్మిస్తున్న ప్రాజెక్టు కార్యక్రమాలను సాగించడంలోను ప్రభుత్వం చేస్తుండే లోపాలను పరిశీలించినట్లయితే ఈ డిమాండును ఏవిధంగానూ బలపరచడానికి వీలులేని పరిస్థితులున్నాయని నేను చెబుతున్నాను. కర్నూలు- కడప కాలువకు సంబంధించిన వార్తలు కొన్ని వస్తు న్నాయి. ఈ కాలువకు సుమారు 3కోట్ల రూపాయలను ఆంధ్రరాష్ట్రప్రభుత్వం కేటాయించినది. దాదాపు ఆ పని ముగిసిపోతున్నట్లే అనుకోవచ్చును. యీ కర్నూలు - కడప కాలువకు సంబంధించినంతవరకు దానికి ఖర్చుచేసిన ధనం సద్వినియోగంగురించికాని మనకు తెలుస్తున్న వార్తలనుచూస్తే అందులో ఎక్కువ మొత్తం దుర్వినియోగమైనదని తెలుస్తున్నది. దానికిచేసిన పని మనం అనుకున్నవిధంగాకాకుండా quality లో చాలా లోపభూయిష్టంగా ఉన్నదని, ఏ leakage లేకుండా కె. సి. కాలువలోని నీటిని సద్వినియోగంచేయాలని అను కున్నామో.ఆ leakage ఆగకుండాపోతున్నదనిslab crackఇస్తున్నదనిపత్రికలలో- వివిధసందర్భాలలో వార్తలువచ్చాయి. మూడుకోట్ల రూపాయలుఖర్చుచేసే ఈ కార్యక్రమంగురించి ప్రభుత్వం ఏ జాగ్రత్తలు తీసికొన్నదో మంత్రిగారు తెలియ చేయలేదు. అంతేకాదు. తుంగభద్రా ప్రాజెక్టు తీసుకుందాము. ఇదివరలో తుంగభద్ర నీటివిషయమై మైసూరు ప్రభుత్వానికి మనకు ఉన్న agreement ప్రకారం 65% మనకు, 35% మైసూరువారికి నీరుఉండాలి. కాని ఈరోజున ప్రాజెక్టులోని ఉద్యోగస్థులను నియమించడంలోను, బోర్డు నిర్వాహణలోను

1953 లో జరిగిన బోర్డుసమావేశంలో ఆంధ్రప్రాంతంవారు 50%, మైసూరు ప్రాంతంవారు 50% ఉద్యోగస్తులను ఏర్పాటుచేయాలని బోర్డు తీర్మానం జరిగినట్లు చెప్పబడినది. నీటివినియోగంవిషయంలో 65%, 35% నిష్పత్తిఉన్నపుడు, ఉద్యోగుల నియామకం విషయంలో 50%, 50% అని నిర్ణయిస్తూ తీర్మానం ఎందుకుచేయవలసివచ్చినదో ఈసందర్భంలో వివరించవలసియున్నది. ఆంధ్ర ప్రాంతంనుంచివెళ్ళి తుంగభద్ర ప్రాజెక్టులో పనిచేసిన కూలీలకు ఇవ్వవలసిన 10, 12 లక్షలరూపాయలు మూలపడిపోయింది. ఈ డబ్బును ఇంతవరకు ఇవ్వలేదు. ఈవిషయమై తుంగభద్రాబోర్డు ఏమాత్రం చర్యను తీసుకోకుండా ఎగవేసే పరిస్థితిలోఉన్నది అని వార్తలు వస్తున్నాయి. ఇటువంటి విపత్కరమైన లోపాలుజరుగుతున్నప్పటికి ప్రభుత్వం ఏమైనా శ్రద్ధచూపిస్తున్నదా అంటేలేదు. అలసత్వాన్నిమాత్రమే చూపిస్తున్నదనేది స్పష్టం. ఇరిగేషన్ డిపార్టుమెంటు లోని ఉద్యోగులవిషయం తీసుకుంటే retire అయిపోయిన ఉద్యోగులను అనేక మందిని తీసుకువచ్చి వారికి తిరిగి ఉద్యోగాలు ఇవ్వడమే కార్యక్రమంగా ఆంధ్ర ప్రభుత్వ హయాంలోను ఇపుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వహయాములోను జరుగు చున్నది. ప్రభుత్వంలో ప్రధానభాగంగా ఉంటున్న ఇరిగేషన్ శాఖలో retire అయిపోయిన ఉద్యోగులకు తిరిగి అవకాశాలు కల్పించి extend చేస్తుంటే ఉత్సాహవంతులైన ఇతర ఉద్యోగులలో తీవ్రమైన నిరుత్సాహంకలుగుచున్నది. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు లెవెలులో ఉన్నవారు ఈరోజున రాజీనామాలు ఇచ్చే పరిస్థితి ఆంధ్రప్రదేశ్‌లో ఎందుకు ఉద్భవిస్తున్నదో పరిశీలించవలసియున్నది. జాతీయదృష్టి, జాతీయ అభివృద్ధి ఉద్యోగులలోకూడా ప్రబలాలి, ప్రతిబింబించాలి అనేకోరికను వెల్లడిస్తున్న ఈ ప్రభుత్వంవారు retire అయినవారికి తిరిగి ఉద్యోగాలు ఇచ్చి extension ఇస్తూ ముందుకురావలసిన యువకులను అణచి వేసే కార్యక్రమం అవలంబించడంవల్ల ఏరకమైన ఫలితాన్ని ఇస్తున్నదో పరిశీలించవలసి యున్నది. Seniors, అనుభవజ్ఞులు అనేపేరుతో మద్రాసు మొదలైన ఇతర రాష్ట్రాలనుంచి agreement మీద తీసుకువచ్చిన ఉన్నతో ద్యోగులు ఇరిగేషన్ డిపార్టుమెంటులో ఉన్నారు. వారిని అదేవిధంగా కొనసాగిస్తూ దానిపై అనుభవజ్ఞులు మనకుకావాలని శ్రీ సంజీవరెడ్డిగారు పదే పదే చెబుతూ వచ్చారు.

అయితే అనుభవజ్ఞులు ఆంధ్రదేశంలో లేరని దాని అర్థం. సమర్థులు కావాలని మాట్లాడుతూవచ్చారు. అయితే ఆంధ్రులలో సమర్థులు లేరని దాని అర్థమా ? ఆంధ్రదేశానికి ఆయువుపట్టుగా వున్న ఇర్రిగేషన్ డిపార్టుమెంటులో ఈరకంగా ఉద్యోగస్తులను గురించి వారు సమర్థులుకారు, వారు అర్హులుకారని పదే పదే బాధ్యతగల ముఖ్యమంత్రి అంటూ ఆ ఉద్యోగస్తులలో నిరుత్సాహం, నిస్పృహ create చేస్తున్నారేమో పరిశీలించవలసివుంది.

గోదావరి ప్రాజెక్టుకు సంబంధించిన ఒక ముఖ్యవిషయాన్ని మీ ద్వారా మంత్రివర్గానికి మనవిచేయదలచుకొన్నాను. మనకు ఇచ్చిన information పుస్తకాల్లో రామపాదసాగర్ కు ఇదివరకు 1 కోటి రూపాయలవరకు ఖర్చుపెట్టామని తెలియజేశారు. అయినా 7, 8 ప్రాంతాలలో కృష్ణాపూల్ నుండి పోలవరం వరకు ఉన్న అనేక ప్రదేశాలలో ఏది ముఖ్యమైనది, ఏది ఉపయోగకరమైనది ? అని ప్రభుత్వములు తీవ్రంగా చర్చిస్తూనేవచ్చాయి. ఇప్పుడు పోచంపాడు అనేది select చేశారని చెబుతున్నారు. పోచంపాడు, ఇప్పూరు స్కీములు రెండింటిని రిజర్వాయర్స్ గాతీసుకొని పోలవరం,ఇంతకుముందేకట్టిన ధవళేశ్వరం స్కీములు రెంటిని రెగ్యులేటర్స్ గా తీసికొని, సాధ్యమైనంతవరకు ఎక్కువ జలాన్ని వినియోగించుకోవాలనే పథకాన్ని ఈ ప్రభుత్వం ఆలోచిస్తోంది. కాని రామపాదసాగర్ ను introduce చేసిన తరువాత వాటన్నింటిని వాయిదా వేసిన తరువాత ఒక కార్యక్రమాన్ని నిర్ణయించే పరిస్థితిలో ఈ ప్రభుత్వం వున్నట్లు కన్పించదు. ఉదాహరణకు ఒక చిన్న విషయం మనవిచేస్తాను. దాదాపు 11 లక్షల ఎకరాలు సాగౌతున్న ఎడ్జిసెంట్ డెల్టా ఏరియా వుంది. దాని పరిస్థితి నానాటికీ దిగజారుతున్నదనే విషయం ప్రభుత్వ దృష్టిలో వున్నదా ? గోదావరి 'బెడ్ లెవెల్' 'silt up' అయిపోతోందని 18 సంవత్సరాలనుండి చేస్తున్న గోడు ప్రభుత్వం ఆలకించిందా ? ఎడ్జిసెంట్ డెల్టా వున్నది వున్నట్లుగా కాపాడటానికి ప్రభుత్వము పూనుకొంటుందా ? 6 కోట్లు అడుగుచున్న item గురించి ప్రభుత్వం ఆలోచిస్తుందా అంటే లేదు. ఆంధ్రదేశంలో రాయలసీమ వెనుకబడినప్రాంతము, మంచినీళ్ళయినా దొరకవు. దానిని అభివృద్ధిప్రాంతంగా చేయాలనేదానితో మేము ఏకీభవిస్తాము. ఆంధ్రప్రదేశ్ వచ్చినతరువాత హైదరాబాదు రాష్ట్రానికి ఇచ్చిన 'ప్రిఫరెన్సెస్' ను జాగ్రత్తగా పరిశీలించవలసివుంది. యింతవరకు డెల్టా ఇర్రిగేషన్ లో వున్న ప్రాంతాలను కాపాడుకొంటూ ఈ అభివృద్ధి కార్యక్రమమును సాగించటమా లేక సాగౌతున్న ప్రాంతములు, కట్టబడిన కట్టడాలు నాశనమైపోతున్నా చూస్తూ ఊరుకొని, వెనుకబడిన ప్రాంతాలనే అభివృద్ధి చేయటమా అనేది ఆలోచించవలసివుంది.

ఉదాహరణకు ఉభయ గోదావరి జిల్లాల విషయం మన మంత్రివర్గ దృష్టికి, ప్రదేశ్ కాంగ్రెస్ సంఘ దృష్టికి తీసుకువచ్చాము. అప్పటనుండి ఎన్నికైన శాసనసభ్యులు ఆ విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చారు. ఒక్కటే ఒక విషయం. ధవళేశ్వరంలోని గోదావరిపై గల షట్టర్లు 3 అడుగులనుండి 6 అడుగులకు పెంచటం. ఒకప్పుడు 8 లక్షలు ఎస్టిమేటు చేయబడింది. తరువాత 12 లక్షలుచేశారు. ధరలుపెరిగిన తరువాత 18¾లక్షల రూ. వుంటే గోదావరి షట్టర్లు 6 అడుగులు పెంచటానికి అవకాశం వుంటుందన్నారు. దానిమీద టెక్నికల్ అభ్యంతరాలు వున్నాయని ఒకప్పుడు తెలియ

చేశారు. తరువాత ఆ అభ్యంతరాలు లేవని స్పష్టపరచటం జరిగింది. 18½లక్షల రూపాయలకు 11 లక్షల ఎకరాలు సాగుఅవుతున్న ప్రాంతానికి యిందులో ఏమీ allot చేయకుండా వాటిని ఆమోదించమని ఇరిగేషన్ మంత్రిగారు అడుగుతున్నారు. ఆంధ్రప్రాంతములో సస్యశ్యామలమునైన కృష్ణా, గోదావరి జిల్లాలున్నాయి. అక్కడ ఒకకోటిరూపాయలు కాజేయవచ్చునని గోపాలరెడ్డిగారు బడ్జెటు ప్రవేశపెట్టేటప్పుడు వ్యక్తంచేయటం ఈ పరిస్థితులలో పరిశీలించవలసి ఉన్నది. అశేషప్రజానీకాన్ని saving loans అడగాలని అనుకొంటున్నారు. అభివృద్ధి ప్రాంతాలనుకొనే ప్రదేశాలలోనివారు ఈ ఎడ్జిసెంట్ డెల్టా ఏరియాలలోని వారు పన్నులరూపంలో ఎన్నోకోట్ల రూపాయలు ఇస్తున్నారు. కనీసం ఈ 18½ లక్షలు ఇచ్చే స్కీమును ప్రవేశపెట్టకుండావున్నారు. 'గోదావరిడెల్టా, ఆంధ్రదేశంలో చాలా కీర్తివంతమైనది. ఆంధ్రదేశము భారతదేశములో కీర్తివంతమైనది' అనే మాటలు చాలా బాగావుంటాయి. ఈ డెల్టాకు సంబంధించిన మైనర్ వర్క్సుగాని, 18½ లక్షల రు.ల ఖర్చుచేసే వర్క్సును యోచించకుండా వుంటే ఉభయగోదావరిజిల్లాలలోను వచ్చే తీవ్రపరిస్థితులను, క్లిష్టపరిస్థితులను ఈ ప్రభుత్వము ఎదుర్కొనవలసి వుంటుందని మనవిచేస్తున్నాను. ఇప్పటికైనా సరే, మంత్రివర్గం కూర్చుని, ఆలోచించి, కనీసం ఈ షట్టర్సును ఏర్పాటు చేసే విషయమును అయినా పరిష్కరించాలని కోరుతున్నాను.

ఇక ఎడ్జిసెంట్ డెల్టా ఏరియాలో రెండు స్కీములున్నాయి. ఈ స్కీముల గురించి, 5, 6 సం.ల నుండి మంత్రివర్గదృష్టికి తీసుకువస్తున్నాము. లోకలైజేషన్ స్కీమును రివైజ్ చేయాలని చెప్పాము. 6 సం.లు అది extend చేయబడింది. 11 లక్షల ఎకరాలకు సంబంధించిన ఏరియాలలో ఇది అమలుచేయబడింది. 1949-1950 సంవత్సరంలో దానిని రివైజ్‌చేసి సెటిల్‌చేయాలనే స్కీమువుంది. ఆ కాలపరిమితిదాటి 7 సంవత్సరాలైనది. 10,000 రూ. ఖర్చుపెట్టి అయినా, యింకాస్టాఫ్ వేసి, నాలుగుమాసాలు పరిశీలిస్తే ఆసమస్య పరిష్కారమౌతుంది. రివైజ్ చేయకపోవటంవలన గోదావరి ఎడ్జిసెంట్ డెల్టా ఏరియాలో ఎవరు పెత్తనంచేస్తున్నారో, వాటర్‌ను ఎవరు ఉపయోగించుకొంటున్నారో తెలియదు. అక్కడ పలుకుబడివుండి, 100 ఎకరాలువున్న భూస్వాములు ఆ ఛానల్సునుcommand చేస్తున్నారనేది మనం గమనించవలసివుంది. రివైజ్‌చేయకపోవటంవల్ల గోదావరి నీటిని సద్వినియోగం చేసుకోవటంలో చాలా ఆటంకాలు కల్గుతున్నాయి. రమారమి 2 లక్షల ఎకరాల రెండవపంట వుంది. ఎడిషనల్ ఏరియాల 50,000 ఎకరాలను మూడు డెల్టాలలోనివారికి యిస్తూవుంటారు. రెండవపంట అడిగిన రైతాంగంయొక్క పరిస్థితిని బట్టి 50,000 ఎకరాలు ఏసూత్రాల ప్రకారం ఇవ్వబడుతున్నాయనే విషయాన్ని మంత్రివర్గం ఆలోచించినట్లయితే, అక్కడ చాలా దుర్భర పరిస్థితులున్నాయని తెలుస్తుంది.

కర్నూలులో ఆంధ్ర ప్రభుత్వం వున్నప్పుడు గోదావరి జిల్లా నుండి రైతులు వచ్చి నవంబరు చివరివారం నుండి జనవరి 20 తేదీవరకు కర్నూలుకు ఎగబడుతుండే వారు. ఇప్పుడు హైదరాబాద్‌కు ఎగబడుతున్నారు. ఈ 50,000 ఎకరాలు ఎవరు కాజేయాలనేదానికి సూత్రాలులేవు. ఎప్పుడైతే ఈ లోకలైజేషన్‌స్కీము రివైజ్‌చేయటంజరుగలేదో అది వ్యక్తుల పరమైనదనేవిషయం అందరికీ తెలుసును. అదే రెండు జిల్లాలలోవున్న రైతుల అభిప్రాయం. కర్నూలులో సంజీవరెడ్డిగారు ఇర్రిగేషన్ మంత్రిగా వున్నప్పుడు ఇటువంటి చిన్నవిషయాలను పరిశీలించమని 4, 5 సార్లు కోరటం జరిగింది. కాని వారు దానిని పెడచెవిని పెట్టారు.

రెండవది రిమోడలింగ్ స్కీము. ఈ రిమోడలింగ్ స్కీముకు కావలసిన లిట్రేచర్ తయారుచేసి, కృష్ణా గోదావరి డెల్టాలకు సంబంధించినంతవరకు ప్లాన్ సిద్ధంచేయబడింది. కాని ఈ స్కీమును రివైజుచేయటంలేదు. దానికి కావలసిన 'ఎడిషినల్ స్టాఫ్' ను వేయరు. ఆ స్కీమును తయారుచేయటానికి ఆంధ్రదేశంలో సమర్థులులేరని చెబితే అది వేరేవిషయం. ఈ స్కీమును తయారు చేయటానికి సమర్థులు లేరని మంత్రిగారు చెప్పరని నేను అనుకొంటున్నాను. ఈవేళ వున్నటువంటి ఈ రెండు స్కీములను వెంటనే రివైజుచేసి, దానిలో ఉద్భవించే అనేక పరిస్థితులను పరిష్కరించాలి. లేకపోతే చాలా తీవ్రమైన పరిస్థితులు ఏర్పడి, గోదావరి ఏరియాలో మంచి ఫలితాన్ని పొందలేమనేది గమనించాలి.

ఇకపోతే గోదావరి డెల్టా ఏరియాలో మనకు annual works ఉన్నవి. అయితే కృష్ణాడెల్టా ఏరియాలో గోదావరిడెల్టాలో ఉన్నవాటికంటే తక్కువే ఉన్నవని అనుకుంటాను. ఎందుకంటే అందులో సిల్టు తక్కువగ ఉన్నకారణము అని చెబుతున్నారు. ఈ works మీద లక్షలుకొలది డబ్బు ఖర్చుపెట్టి ప్రభుత్వము కృషిచేస్తున్నది. అయితే యీ annual works మీద ప్రభుత్వము ఖర్చు చేసే సొమ్ము సక్రమమైన పద్ధతిలో వినియోగపడుతున్నట్లు లేదు. అయితే యింతవరకు ప్రభుత్వము అనుసరిస్తున్న కంట్రాక్టర్ల పద్ధతినే యీనాడు కూడ అనుసరించడమువల్ల చాలా భాగము contractors కాజేస్తున్నారు. ఈ విధానము మార్చితేగాని పనులు ఖర్చుకుతగిన ఫలితములను పొందడములేదు. యీ పద్ధతిని తీసివేసి Co-operative basis మీద labourers నందరిని Co-operative Societies గా register చేయించి, వారిని ప్రోత్సహించి ఈ కార్యక్రమాలన్నీ నిర్వహించాలని, ఇందుకు తగిన policy ని ప్రభుత్వము అవలంబించాలని చెబుతున్నారు. అయితే యింతవరకు రిజిష్టరు అయిన Labour Contract Co-operative Societies ఉంటున్నప్పుడు వాటికి ప్రభుత్వము ఏలాంటి రక్షణలు కలిగించి ప్రోత్సహించడంలేదు. పదివేల రూపాయల estimates గల పనులన్నీ nominations ద్వారా ఈ సొసైటీలకు యివ్వవలసినట్లుగా ప్రభుత్వము ఒక G. O.

ప్యాను చేసింది. కాని కొంతమంది ఇంజనీర్లు యీ జి. ఒ. ను ignore చేస్తు న్నారు. ఇలాంటివి జరుగుతున్నప్పుడు ప్రభుత్వము కూడ పట్టించుకోవడంలేదు. ప్రభుత్వము issue చేసిన జి. ఒ. ను అమలుజరపకుండా ఉన్నవారిమీద, ఉల్లం ఘించినవారిమీద చర్య తీసుకోవడంలేదు. ఉదాహరణ చెప్పాలంటే ఇప్పటి వరకు ఉన్న Godavari Head Works Executive Engineer ఆవిధముగా చేసే వారు. వారు యిప్పుడు కృష్ణాడెల్టాలలో పని చేస్తున్నారు. ఆయన జరిపిన కార్యక్రమమంతయు ప్రభుత్వానికి నష్టదాయకమైనదిగా ఉన్నది. అలాంటి కార్యక్రమములు మూడు ఉన్నవి. ఆ విషయములో ప్రభుత్వము ఏవిధమైన చర్యలు తీసుకోకుండా ఉన్నప్పుడు, ఇతర ఉద్యోగస్థులుకూడ నిర్లక్ష్య స్వభావ మును కనబరిచే పరిస్థితులు ఉన్నవి. P. W. Department ప్రభుత్వానికి మొదటి శత్రువు అని మన గౌ॥ సభ్యుడు గోపాలకృష్ణయ్యగారు యీ డిమాండుమీద మాట్లాడుతూ చెప్పారు. అదే దృష్టి ప్రభుత్వానికికూడ ఉన్నదనే అనుకుంటు న్నాను. P. W. D. ఉద్యోగస్థులు ప్రభుత్వ కార్యక్రమాల ఎడల అంతటి నిర్లక్ష్య స్వభావమును కనబరుస్తున్నప్పుడు, దానిని అరికట్టటానికి ప్రభుత్వము తగిన చర్యలు తీసుకోకుండా ఉన్నప్పుడు, యీ భావము వారిలో రోజురోజుకు పెరిగిపోతున్నదేకాని తగ్గుతున్నట్లులేదు. ధవళేశ్వరములో ఒక Executive Engineer హయాములో డిపార్టుమెంటు ఉద్యోగస్థులకును, workers కున్నూ dispute వచ్చిన సందర్భములో డిపార్టుమెంటుకు సప్లయిచేయబడిన కొన్ని వస్తువులుపోయినట్లు ఆరోపణ చేయబడింది. కాని కొంత దర్యాప్తు జరిగిన తరువాత, ఆవస్తువులు అక్కడఉన్న workshop లోనే దొరికినవని తెలిసింది. ఆసందర్భములో తీవ్రమైన పరిస్థితులు, Lockouts, strikes కూడా జరిగినవి. ఈ Executive Engineer యొక్క బద్ధకమువల్లను, వస్తువులు ఎప్పటికప్పుడు check చేయకుండా ఉన్నందువల్లను, యీపరిస్థితులు వచ్చినవని ప్రభుత్వదృష్టికి తేబడింది. అలాంటి Executive Engineer మీద ప్రభుత్వము తీసుకున్న చర్య ఏమిటి ? అంతేకాకుండ రాజోలు తాలూకాలో 28 వేల రూపాయలవరకు కాలవలమరమ్మతులు చేసేవిషయంలో shutters పెట్టేటప్పుడు grove shutters మాత్రమే పెట్టండి అని చెబుతున్నప్పటికినీ వినిపించుకోకుండా ఆ డబ్బును దుర్వినియోగముచేస్తే, ఆవిషయము ప్రభుత్వముదృష్టికి తెచ్చాము. అలాంటి Executive Engineer మీద ప్రభుత్వము తీసుకున్న చర్య ఏమిటి ? Labour Contract Co-operative Societies కు యివ్వాలని జి. ఒ. ఉంటే దానిని తిరస్కరించినందుకు ఆ ఇంజనీరుమీద ప్రభుత్వము తీసుకున్న చర్య ఏమిటి ? ప్రభుత్వములో ఒక responsible Gazetted Officer ఈ రకముగ చేస్తున్నప్పుడు, దానికి ప్రభుత్వము చర్యతీసుకోకుండ ఉన్నప్పుడు, ఇతర ఉద్యోగస్థులకు ప్రభుత్వముయొక్క కార్యక్రమములయందు ఏ విధమైన లక్ష్యభావము ఉంటుందో గుర్తించాలి. ప్రభుత్వ డిపార్టుమెంట్లలోకల్లా

ప్రధానమైన డిపార్టుమెంటు యీ Irrigation Department అయి యున్నది. దీనిక్రింద లక్షలకొలది, కోట్లకొలది ప్రజలయొక్క సొమ్ము ఖర్చు అవుతున్నది. ఆ డిపార్టుమెంటులో జరిగే కార్యక్రమాలను సరిగాజరిపించటానికి ప్రభుత్వము తగిన చర్యలు తీసుకోలేదు. ప్రభుత్వోద్యోగస్థులయందున్న లోపములు ప్రభుత్వదృష్టికి తెచ్చినప్పుడు, వాటినిగురించి ప్రభుత్వము చర్య తీసుకోలేదు. ఈ సంవత్సరమునకు ప్రభుత్వము డబ్బు శాంక్షను చేయమని డిమాండును ప్రతిపాదించినది. ఇలాంటి పరిస్థితులలో యీ డిమాండును మేము బలపరచడము అసంభవమని తెలియజేస్తూ, సెలవుతీసుకుంటున్నాను.

శ్రీమతి మాసుమాబీగమ్: ఒక మెంబరు ఎన్ని cut motions యివ్వవచ్చును?

మిస్టర్ స్పీకర్ : ఎన్ని అయినా యివ్వవచ్చును.

*శ్రీ పి. గోపాలకృష్ణారెడ్డి (గూడూరు) : అధ్యక్షా, ఇరిగేషన్ శాఖామాత్యులు ప్రతిపాదించిన ఇరిగేషన్ డిమాండును నేను బలపరుస్తూ, కొన్ని సూచనలు ప్రభుత్వ దృష్టికి తేదలచుకున్నాను. ముఖ్యంగా నెల్లూరు జిల్లాలోని సుళ్లూరుపేట తాలూకాలో పాములకాలవ ప్రాజెక్టును చాలా సంవత్సరాలుగా పూర్తిచేయమని అక్కడి ప్రజలు ఆందోళనచేస్తున్నారు. ఈ ప్రాజెక్టు క్రింద ఆరువేల యకరాల భూమి ఉన్నది. ఈ ప్రాజెక్టు పూర్తిచేయక పోవడమువల్ల యిప్పటికి ఆరు, ఏడు సంవత్సరాలుగా దీని క్రింద భూమిలో పంటలు పండడములేదు. అంతేకాకుండా యీ ప్రాంతము అంతా యిదివరకు జమీందార్ల భూమి. ఆనాడు యీ ప్రాంతము చాలా neglect చేయబడింది. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి ప్రభుత్వము పూనుకుంటే యీ ఆరువేల ఎకరాలే కాకుండా, యింకా నాలుగువేల ఎకరాలు సాగుచేయటానికి వీలుఅవుతుంది. ఆ భూమిఅంతయు మాగాణీభూమి అయి వరి పండించటానికి అనువైనది అగును. కాబట్టి యీ విషయము ప్రభుత్వమువారు గమనించి యీ పని త్వరలో ఆరంభిస్తారని ఆశిస్తున్నాను. ప్రస్తుతము ప్రభుత్వము యొక్క బడ్జటులో లోటు ఉన్నదని తెలియకపోలేదు. అయినప్పటికినీ, అక్కడ ప్రజలు తిండికి యిబ్బంది పడుతున్నందున వారియొక్క కష్టములు ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను.

ఇదిగాక మా నెల్లూరు జిల్లాలోని సుళ్లూరుపేట తాలూకాలోనే నెర్రి కాలవ స్కీము అనేది ఒకటి ఉన్నది. దానిక్రింద దాదాపు 14 గ్రామాలకు నీరు పారుదల అవుతున్నది. పదివేల ఎకరాల భూమి సాగుబడి అవుతున్నది. కాని యీ విషయములో ఒకసంగతి ప్రభుత్వానికి జ్ఞాపకము చేస్తున్నాను. పైన ఉండే గ్రామాలవారు, క్రింద ఉన్న గ్రామాలవారికి నీరు సరఫరా కానివ్వకుండా యిబ్బందులు పెట్టుతున్నారు. ఈ విషయము యిదివరలోనే ప్రభుత్వపు దృష్టికి తేబడింది. నేను Technical man కాదనుకోండి. అయినను

అక్కడ Lock system ఒకటి ఏర్పాటుచేస్తే అన్ని గ్రామాలవారికి నీటి సరఫరా సక్రమంగా చేయటానికి వీలుఅవుతుందని అంటున్నారు. కాబట్టి యిందులోని మంచిచెడ్డలు విచారించి, యీ Lock system ఏర్పాటుచేసి పూర్తిచేస్తారని నమ్ముతున్నాను.

తరువాత గూడూరు తాలూకాలో తూపిరి చెరువు అనేది ఒకటి ఉన్నది. దీనియొక్క ఆయకట్టు 1800 ఎకరాలు. ఆ చెరువు సరియైన పరిస్థితిలో లేనందువల్ల నీటిపారుదల సరీగా జరగడములేదు. చెరువుకు కట్టలు తెగిపోయి సరీగా లేవు. ఈ చెరువు నుంచి వెళ్లే supply channels సరీగా లేనందున పొలములకు నీరు సరీగాఅందక పంటలు పండటంలేదు. అందువల్ల వారు ఆగ్రామాన్ని విడిచిపెట్టి పోయినందువల్ల అక్కడ ఆ గ్రామమే లేకుండాపోయింది. ఈ విషయమును గురించి ముఖ్యమంత్రిగారికి కూడ తెలుసు. అందువల్ల యికమీదట దీనిని గురించి ఎక్కువగ చెప్పనవసరములేదు. ప్రభుత్వము యీ విషయము కూడా గమనించవలసింటగా కోరుతున్నాను.

తరువాత గూడూరు పట్టణమునకు సంబంధించి మర్రిపల్లి మడుగు అని ఒకచెరువు ఉన్నది. దీనిక్రింద మూడువేల ఎకరాలభూమి సాగు అవుతున్నది. వర్షాకాలములో అప్పుడప్పుడు దీనియొక్క గట్లు తెగిపోవడము జరుగుతుంది. దీనికి ఒక స్లూయిజు ఉన్నది. గట్లు తెగిపోయినందువల్ల, నీరు బయటికి పోవడమువల్ల యీ స్లూయిజును close చేసియున్నారు. ఇప్పుడు యీ స్లూయిజును మరల open చేసి, కొత్తగా కట్టించి, చెరువుకు గట్లుబాగుచేయిస్తే, నీరు నిలవటానికి అవకాశము ఉంటుంది. దానిక్రింద సాగుఅయ్యే భూమికి చాలినంత నీరు ఉండగలదు. లేకపోతే, వచ్చిన నీరంతా బయటికి పోయి, భూమికి నీరు చాలక పంటలు ఎండిపోతాయి. దీనివల్ల రైతులు నష్టపడుతున్నారు. కాబట్టి ఈ చెరువును మరమ్మతు చేయించి గట్లు బాగుచేయించి, స్లూయిజు కొత్తది కట్టించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

ఇంకొక విషయముచెప్పి ముగించదలచాను. సోమశిల ప్రాజెక్టు నిర్మాణం ప్రభుత్వ దృష్టిలో ఉన్నదని అందరికీ తెలిసినవిషయమే. ఈమధ్య మంత్రిగారు వెళ్ళి ఆ ప్రాంతము పరిశీలించి వచ్చారు. ఈ ప్రాజెక్టును కట్టించే విషయములో మన ప్రభుత్వము కేంద్రప్రభుత్వానికి represent చేసి, దీనిని త్వరలో పూర్తి చేయిస్తారని ఆశిస్తున్నాను. తరువాత నెల్లూరుజిల్లాలో కోవూరు తాలూకా, నెల్లూరు తాలూకా యీ రెండు తాలూకాలు తప్ప తక్కిన తాలూకాలు అన్నీ వెనకబడిన తాలూకాలు. ఈ విషయము ప్రభుత్వానికి తెలియకపోలేదు. ప్రభుత్వము తలపెట్టిన సోమశిల ప్రాజెక్టును త్వరలో నిర్మింపజేస్తే, ఆ జిల్లా అంతాకూడ సస్యశ్యామలంగా అభివృద్ధికివచ్చి, అక్కడఉన్న పేదప్రజలకందరికీ,

ముఖ్యంగా వెనుకబడిన తాలూకావాళ్ళకు తగినంత తిండి దొరుకుతుంది. ఈ విషయమును గురించి మంత్రిగారికి మరొక పర్యాయము జ్ఞాపకముచేస్తూ నాకు యీ అవకాశము యిచ్చినందులకు అధ్యక్షులవారికినీ, మన సభయొక్క Chief whip గారికినీ నా కృతజ్ఞత తెలుపుతున్నాను.

*శ్రీ ఇ. అయ్యపురెడ్డి (నందికొట్కూరు-జనరల్) : అధ్యక్షా, నేను ఈ డిమాండును బలపరుస్తున్నాను. ఆంధ్రదేశములో ఉన్న గోదావరి, కృష్ణ, పెన్నారు నదీలోయల అభివృద్ధికిగాను ప్రభుత్వము తలపెట్టిన ప్రాజెక్టుల నిర్మాణము పూర్తికావటానికి యింకా ఏ 20 సం॥లో పట్టుతుందని నా అభిప్రాయము. ఈ శాసన సభలో ఆంధ్రదేశములో ఎంతమంది సభ్యులున్నారో, వారి వారి ప్రతినియోజకవర్గములో ఏదో ఒక రకమైన ప్రాజెక్టు, నీటిపారుదల స్కీములు లేకుండాపోలేదు. ప్రతి ఒక్క శాసనసభ్యుడు కూడ తన నియోజక వర్గములోని తనకు అత్యంత అవసరమైన స్కీము ఒకటైనా ఉన్నదని, దాని విషయము చెబుతూనే ఉన్నారు. నిజానికి ఆంధ్రదేశములో నీటిపారుదల వసర్లు ఎక్కువగా ఉన్నవి. కాని ప్రస్తుతము ప్రభుత్వానికి ఉన్న ఆర్థిక అభావమువల్ల ఆ ప్రాజెక్టులు ఎంతత్వరలో కేంద్రప్రభుత్వము సహాయముతో పూర్తిచేయ టానికి ప్రభుత్వము ప్రయత్నిస్తున్నప్పటికినీ, పూర్తికావటానికి కనీసము ఇరవై సం॥ అయినా పట్టుతుందని చెప్పకతప్పదు. కృష్ణానదీ లోయను అభివృద్ధి చేయటానికి మనము ప్రారంభించాము. నాగార్జునసాగర్ ప్రాజెక్టును ప్రారం భము చేసియున్నాము. అక్కడ పని చురుకుగానే సాగుతున్నది. ఈ ప్రాజెక్టు నిర్వహణలో ప్రభుత్వము చూపించే శ్రద్ధకు, P. W. D. వారు చూపించే మేధా శక్తికీ మనము తప్పకుండా అభినందించవలసి యున్నది. కేంద్ర ప్రభుత్వ మంత్రి శ్రీ పాటిల్ గారు వచ్చి మన ప్రభుత్వ ఇంజనీర్లను, ప్రభుత్వాన్ని అభినందించారు. ఇందులో ఏమాత్రము అతిశయోక్తి గాని, ముఖస్తుతిగాని లేదు. భారతదేశంలో సాగుతున్న యితర ప్రాజెక్టు నిర్వహణావిధానముతో మన ఆంధ్రదేశములో సాగుతున్న విధానమును పోల్చి చూస్తే మనము చేసే కృషికి గర్వించవలసి యుంటుంది.

నాగార్జునసాగర్ ను కేవలం ఆంధ్రప్రదేశ్ యొక్క ప్రాజెక్టుగా కాకుండా కేంద్రప్రభుత్వం యొక్క ప్రాజెక్టుగా తీసుకోవలసిందని మన ప్రభుత్వంవారు చేసిన సూచన సభవారందరు బలపరుస్తారనేదానిలో ఏమాత్రమూ సందేహం లేదు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు 1960 వ సంవత్సరానికి పూర్తిఅయినఎడల ఆంధ్రదేశంలోనేగాక యావద్భారతదేశంలోకూడా సంతోషించనివారు ఉండరు. భారతదేశానికంతకు ధాన్యాగారాన్ని సృష్టించబోవుచున్నటువంటి ఈ ప్రాజెక్టు నిర్మాణంలో కేంద్రప్రభుత్వంవారు ఇప్పుడు కేటాయించినటువంటి మొత్తంగాక

ఇంకా ఎక్కువగా కేటాయించవలసియుంటుంది. దానికోసం మన ప్రభుత్వము, ఆంధ్ర ప్రజలు తగువిధమైన కృషిచేయవలసి ఉంటుందనేదాంట్లో ఏమాత్రం సందేహంలేదు. నాగార్జునసాగర్ ప్రాజెక్టుపూర్తిఅయినవెంటనే ఇంక ప్రారంభించవలసినటువంటి ప్రాజెక్టుఏది ? అనేసమస్య తప్పక బయలుదేరుతుంది. గోదావరి లోయలో వెంటనే ప్రాజెక్టు నిర్మాణంకావాలని కొంత ఆందోళన ఉన్నది. కృష్ణాలోయను పూర్తిగా అభివృద్ధిలోకి తీసుకొనిరాకముందే గోదావరి లోయలో, ఇంకావేరే లోయలో వేరేప్రాజెక్టుల నిర్మాణానికి పూనుకోవడం అంత లాభకరంగా ఉండదని నా ఉద్దేశ్యం. నాగార్జునసాగర్‌కు 100 మైళ్ళు ఎగువలోనే సిద్ధేశ్వరం ప్రాజెక్టు ఉన్నది. సిద్ధేశ్వరం ప్రాజెక్టు నాగార్జునసాగర్ ప్రాజెక్టుకంటే ముందుగా నిర్మాణం జరగవలసిందని రాయలసీమ ప్రాంతంలోను, నెల్లూరు మెట్టప్రాంతంలోను ఇదివరకు ఆందోళన ఉండినది. కాని నాగార్జునసాగర్ ప్రాజెక్టువంటి బ్రహ్మాండమైనటువంటి scheme, దానివల్ల లభించబోయే లాభాలు చూచినప్పుడు దానిని మొట్టమొదట ప్రారంభంచేయవలసిన అవసరం ఉంటుందని గుర్తించి రాయలసీమ ప్రాంతంలో సిద్ధేశ్వరం ప్రాజెక్టు తదుపరి సాగించుకోవచ్చుననే ఉద్దేశ్యంతో ఆందోళన తగ్గింది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తి అయినవెంటనే సిద్ధేశ్వరం ప్రాజెక్టుపని ప్రారంభించవలసిన అగత్యంఉన్నదని ప్రభుత్వానికి విన్నవించుకొంటున్నాను. సిద్ధేశ్వరం ప్రాజెక్టు లేనిదే సోమశిలప్రాజెక్టు నెరవేరదనే విషయం నెల్లూరు సోదరులందరికికూడా తెలుసు. ఇంతకు ముందు గోపాలకృష్ణారెడ్డిగారు సోమశిలప్రాజెక్టు కావలెనని, దానియొక్క అవసరాన్నిగూర్చి మాట్లాడారు. సోమశిలప్రాజెక్టుకు ప్రాణం సిద్ధేశ్వరం. సిద్ధేశ్వరం ప్రాజెక్టుయొక్క ఉపయోగాలు వర్ణించవలసిన అగత్యం లేదనుకొంటాను. ఇటు రాయలసీమ ప్రాంతంనుంచి, అటు నెల్లూరువరకు ఒక link canal ను ఏర్పాటుచేసి రాయలసీమ ప్రాంతానికికూడా సముద్రతీరానికి రాకపోకల సౌకర్యాన్ని నీటిపారుదలద్వారా, navigation ద్వారా చేకూర్చ గలిగినటువంటి మహత్తరమైన ప్రాజెక్టు సిద్ధేశ్వరం ప్రాజెక్టు. అంతేకాకుండా రాయలసీమలో ఉన్నటువంటి ఖనిజసంపత్తిని కొల్లగొట్టుకొనేదానికి సిద్ధేశ్వరం ప్రాజెక్టులోని electricity ఎంతైనా అవసరం. ఇటీవలనే కర్నూలు జిల్లాలోని పాణ్యంలో బ్రహ్మాండమైన సిమెంటు ఫాక్టరీ తయారైంది. 4, 5 మాసాలలో దానికి ప్రారంభోత్సవంకూడా జరుగనున్నది.

నంద్యాలలోను, గుంటకల్లులోను, ఇంకా ఇతర ప్రాంతాలలోను పారిశ్రామికంగా అభివృద్ధిలోకి రావలసినటువంటి స్కీములు ఎన్నోఉన్నాయి. వీటన్నింటికి సిద్ధేశ్వరం ప్రాజెక్టు ప్రాణాధారం. కనుక నాగార్జునసాగర్ ప్రాజెక్టు పూర్తిఅయిన వెంటనే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సిద్ధేశ్వరం ప్రాజెక్టును ప్రారంభం చేయవలసిఉంటుంది. దానికి ఇప్పటినుంచి దర్యాప్తులు పూర్తిచేయవలసిన అగత్యం ఉన్నదని విన్నవిస్తున్నాను.

K. C. Canal ను గురించి మిత్రుడు వెంకటరామరాజుగారు చెప్పినటు వంటి విషయాలతో నేను పూర్తిగా ఏకీభవించనందులకు విచారిస్తున్నాను. K. C. Canal నిర్మాణంలో కొన్ని లోటుపాట్లు లేకపోలేదు. కాని దాని నిర్మాణం పూర్తిగా నిరుపయోగమైందని, దానివల్ల ఏమాత్రం ఆయకట్టు అభివృద్ధికావడం లేదనిన్నీ, ఇప్పుడు చేసినటువంటి పని ఎక్కడికక్కడ పగిలి పోయిందని చెప్పడం సబబుకాదని నేను వారికి తెలియజేస్తున్నాను. ఇటీవలనే Estimates Committee వారు K. C. Canal ప్రాంతాన్నంతా చూచి అక్కడ ఉన్నటువంటి విషయాలనుకూడా తెలుసుకొన్నారు. K. C. Canal నిర్మాణంలో కొంత సిమెంటు దుర్వినియోగం అయిందన్న విషయం నిర్వివాదమైనటు వంటి అంశమే. కాని ఇకమీదట ఇటువంటిది జరుగకుండా చూచుకొనేదానికి వీలుఉంటుంది. ఆ కార్యక్రమాన్ని జరుపుతున్నటువంటి contractor లకు క్రొత్తఅగుటవలన ఇటువంటి లోట్లు జరగకపోలేదు. ఈ Canal విషయంలో Sub-channels ను త్వరగా అభివృద్ధిచేయవలసిఉంటుందని నేను ప్రభుత్వానికి సూచిస్తున్నాను. ఆయకట్టు అభివృద్ధిఅగుటకు Main canal తో పాటు Sub-channels యొక్క అభివృద్ధికి ఆలోచనచేసి, దానికి పథకాలు తయారుచేసి, వాటిని కూడా implement చేసిఉంటే ఈసరికి కనీసం 30, 40 ఎకరాలభూమి సాగులోకి వచ్చేదానికి తయారుగా ఉండేది. K. C. Canal కు ఉన్నటువంటి Sub-channels విషయమై ఏ విధమైన చర్య తీసుకోకపోవడం అనేది చాలా శోచనీయమైనటువంటి విషయం. నా నియోజకవర్గంలో ఉన్నటువంటి తూడిచెర్ల Sub-channel ను repair చేయించి, దానిని సాగుకు అనుగుణంగా మార్చేదాని విషయమై ఎన్నోసార్లు దర్యాప్తుచేశాను. మంత్రిగారికి కూడా memorandum ఇచ్చాను. కాని దాని విషయమై ఎలాటి చర్య తీసుకోలేదు. K. C. Canal క్రింద ఉన్నటువంటి ఆయకట్టును అభివృద్ధిచేసేదానికోసం ప్రజల యొక్క సహకారం, రైతులయొక్క సహకారం కావలసిఉంటుంది. అందుకు గాను K. C. Canal Board అని ఒకటి ఏర్పాటుచేయవలసినదని నేను, తదితర M. L. A. లు ప్రభుత్వానికి సూచనచేశాము. ఏ కారణంచేతనో ప్రభుత్వం అటువంటి బోర్డును ఏర్పాటు చేయడానికి అంగీకరించలేదు. K. C. Canal ఆయకట్టును అభివృద్ధిచేసే విషయంలో ఒక సమగ్రమైనటువంటి బోర్డును ఏర్పాటుచేసి, దానిలో అక్కడ ఉన్నటువంటి Collector గారిని, Engineer గారిని, మరికొంతమంది experts ను official members ను, ఆయకట్టు ప్రదేశంలోనుంచి వచ్చే రైతులను, అక్కడ ఉండే శాసనసభ్యులను, మరికొంత మంది non - officials ను members గా పెట్టి, కనీసం 3 నెలల కొకమారు Board సమావేశమై ఆయకట్టు అభివృద్ధి విషయంలో కావలసినటువంటి సమస్యలను పరిష్కారం చేసుకొనేదానికి చర్చలు జరిపితే ఆయకట్టు త్వరగా అభివృద్ధికాగలదని నేను ప్రభుత్వంవారికి విన్నవిస్తున్నాను. ఆయకట్టు అభివృద్ధికి

కావలసినటువంటి విషయాలు, ముఖ్యంగా రైతుల ఋణపరపతి, bulldozers, tractors supply చేసే విషయం, క్రొత్తగా Sub-channels ను నిర్మాణం చేసే విషయము, తూములు తెరిచే విషయం, ఈ సమస్యలు దినదినము పరిశీలించవలసిన అగత్యం ఉంటుంది. ప్రతి రోజు ఆయకట్టు ప్రాంతంలో నుంచి "మాకు ఫలనాచోట తూము కావలెను, ఫలనాచోట కాలవ కావలెను" అని ప్రతి గ్రామంనుంచి మాకు మహజర్లు వస్తూఉన్నాయి. ఆ మహజర్లను మేము P.W.D శాఖవారికి పంపిస్తున్నాము. కాని దురదృష్ట వశాత్తు ఇంతవరకు వాటికి జవాబులు రాకుండా ఉన్నాయి. కనుక ఇప్పటికైనా ఇటువంటి Board ను ఏర్పాటుచేసేదానికి ప్రభుత్వం తలపెట్టవలెనని నేను వారికి సూచిస్తున్నాను. ఇటువంటి బోర్డును ఏర్పాటుచేస్తే దానివలన ప్రభుత్వా నికి వచ్చే నష్టముగాని, కష్టముగాని ఉండదు. Non-official members లో T.A. కోరేవారెవరూ ఉండరని ప్రభుత్వానికి విన్నవిస్తున్నాను. మా ప్రాంతంలో ద్వితీయ పంచవర్షప్రణాళిక కాలంలో ప్రభుత్వంవారు ఒప్పుకొన్నటువంటి వరదరాజు ప్రాజెక్టు అనే మధ్యరకం ప్రాజెక్టు 1957-58 వ సంవత్సరంలో ప్రారంభం జరుగుతుందని జిల్లా ప్లానింగ్ కమిటీలో మాకు తెలియజేశారు. కాని ఇంతవరకు అది ప్రారంభం కాలేదు. 58-59 సంవత్సరంలోనైనా దానిని ప్రారంభం చేసేదానికి ప్రభుత్వం ప్రయత్నం చేయవలసిందని విన్నవిస్తున్నాను.

మిత్రుడు వెంకటరామరాజుగారు మాట్లాడుతూ 'గోదావరి ప్రాంతంలో కోటి రూపాయలు అదనంగా పన్ను వేసేదానికి ఆర్థికమంత్రి ప్రయత్నం చేశారు' అని తమయొక్క నిరసనను తెలియజేశారు. కాని రాయలసీమ ప్రాంతంలో ముఖ్యంగా తుంగభద్రా ప్రాంతంలో ఇప్పుడు ప్రభుత్వం విధిస్తున్నటువంటి నీటి తీరువరేట్లకు, గోదావరి ప్రాంతంలో ఉన్నటువంటి నీటి తీరువరేట్లకు పోల్చి చూచుకొన్న ఎడల వాస్తవానికి గోదావరి ప్రాంతవాసులు ఎంతో అదృష్ట వంతులని మేము అనుకుంటాము. అందువల్ల కృష్ణా, గోదావరి లోయలలో క్రొత్తగా నీటి తీరువను హెచ్చింపు చేసేదానికి ప్రభుత్వం ఆలోచన చేస్తున్నది, అంటే దానిలో ఆశ్చర్య పడవలసినటువంటి విషయం ఏమాత్రం ఉండదు.

కొత్త ప్రాజెక్టులు, కొత్త స్కీములు కావాలంటే ప్రభుత్వానికి ఆర్థిక సహాయం కావాలి. అందుకు ఇంతవరకు బలపడి, లాభపడి ఉన్నటువంటి ప్రాంతాలవారు ఎక్కువ పన్నులను విధించుకొని ప్రభుత్వానికి సహాయం చేయాలి. అదితప్ప వేరేగత్యంతరం లేదని తెలియజేస్తూ నేను విరమిస్తున్నాను.

*శ్రీ కె. అచ్యుతరెడ్డి (కొడంగలు) : అధ్యక్షా, గౌరవనీయ మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును నేను సమర్థిస్తూ, మీ ద్వారా మంత్రిగారికి కొన్ని సూచనలు అందజేయదలచుకొన్నాను. ఈ డిపార్టుమెంటుకు ఈ డిమాండు

అవసరమైనది, చాలా ముఖ్యమైనదీ అనుకొంటున్నాను. దేశం ఉన్నతస్థితిలోనికి రావడానికీ, వ్యవసాయ కార్యకలాపాలు సక్రమంగా జరగడానికీ, ఉత్పత్తిని పెంచడానికీ ఈ డిపార్టుమెంటు చాలా ముఖ్యమైనదనే విషయం అందరకూ తెల్సును. అయితే ఈ డిపార్టుమెంటు సరిగా పని చేస్తున్నదా, లేదా అనే విషయం ఎవ్వరికీ తెలియనిది కాదు. "సభ్యులందరూ ఏవో పాత విషయాలను చెబుతున్నారు. బూజుపట్టిన డిపార్టుమెంటు, **Public Waste Department,** అని ఈ విధంగా పాతకాలంలోని విషయాలు చెబుతున్నారు" అని నిన్ననే మన గౌ॥ మంత్రిగారు శలవిచ్చారు. ఇవి పాతకాలపు విషయాలయితే మాకు సంతోషమే. కాని ప్రస్తుత వాతావరణంలో ఏమీ మార్పురాలేదని నేను సవినయంగా మనవి చేస్తున్నాను. ఈనాడు **red-tapism** రోజురోజుకూ ఎక్కువవుతున్నది. **Centralisation of Powers** రోజురోజుకూ ఎక్కువవుతున్నవి. వాటిని **de-centralise** చేయవలసిన అవసరం ఉన్నది. **Red-tapism** నూ, పనిలో జరుగుతున్న ఆలస్యాలనూ **eliminate** చేయవలసిన అవసరం ఉన్నది. ఒక చెరువునుగాని, **breached tank** ను గాని **restore** చేయడానికి దాదాపు 6, 7 సం॥లు పడుతున్నది. కాని మంత్రిగారు వారి కృషివలన **red-tapism** నూ, ఈ పాత విషయాలను తొలగించగల్గితే దేశానికి ఎక్కువ మేలు చేసిన వారవుతారు. **Breached tanks** ను **restore** చేసే విషయమే నేను చేసే సూచనలలో ముఖ్యమైనది. తెలంగాణా ప్రాంతంలో ఇంచుమించు ప్రతి గ్రామంలోనూ చెరువులు, కుంటలు ఉన్నాయి. చాలకాలంనుంచి అవి **restore** కాకుండా పడిఉన్నాయి. బహుశా **P. W. Department** వద్ద సరైన **census** ఉండకపోవచ్చు. ఈ విషయమై లోపము ఎక్కడ ఉన్నదో నాకు తెలియదు. కాని ఆ చెరువులు మాత్రం చాలకాలంనుంచి **restore** కాకుండా పడిఉన్నాయి. ప్రత్యేకించి జాగీరు ప్రాంతంలో 20, 30 సం॥ల నుంచి **restore** కాకుండా ఉన్నాయి. మేము గ్రామాలకుపోతే అక్కడ ఉన్నటువంటి ప్రజలు "మాకు ఇంకేపని చేయకపోయినా పోనీ, కాని ఇక్కడి చెరువులు 5, 6 సం॥ల నుంచి తెగిపోయి పాడుపడి ఉన్నాయి. వాటిని మాత్రం **restore** చేస్తే చాలు" అంటారు. ఈ విషయంలో అన్ని విషయాలకంటే ఎక్కువ శ్రద్ధవహించి **war-footing** మీదనైనా ఈ చెరువులను **restore** చేయడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందని నేను ఆశిస్తున్నాను. నా నియోజక వర్గములోని కోడంగల్‌లో 200 **tanks** ఉన్నాయి. వాటి విషయం 5, 6 సం.ల క్రితమే నేను ప్రభుత్వానికి అందజేశాను. మహబూబ్‌నగర్‌లో దాదాపు 1000 లగాయతూ 1500 **breached tanks** ఉన్నాయి. 1951-52 నుంచి అట్లాగే ఉన్నాయి. వాటి విషయమై ప్రభుత్వ మేమీ చేయలేదు. బహుశా ప్రతిజిల్లాలోనూ ఈ విధమైన చెరువులు ఎన్నో ఉంటాయి. అన్నింటినీ **restore** చేయవలసిన అవసరం ఉన్నది. ఇందుకుగాను ఈ బడ్జట్‌లో 31 లక్షలు కేటాయించబడినది. ఆ మొత్తం చాల

దని నా అభిప్రాయం. అందువల్ల కేంద్రప్రభుత్వంనుంచి అప్పుగా గాని, మరే రీతిగానైనా సరే కొంత మొత్తం తీసుకొని, warfooting మీద చేసినట్లయితే ఈపనులను త్వరలో చేయగల్గుతారని నేను విన్నవిస్తున్నాను.

River Projects కట్టడానికి మన ప్రభుత్వంవారు ఎక్కువ డబ్బు కేటాయించారు. చాలా సంతోషం. దేశం అభివృద్ధి చెందడానికి అది మంచి అవకాశమే. అయితే, ఎన్ని ప్రాజెక్టులు కట్టినా, ఎన్ని ఆనకట్టలు కట్టినా లాభపడని ప్రాంతాలు కొన్ని ఉన్నాయి. మహబూబ్‌నగర్ జిల్లాలో కృష్ణానదియొక్క ఉపనదులు ప్రవహిస్తాయి. కాని అది table land అగుటవలన అక్కడ ఎన్ని ఆనకట్టలు కట్టినా ప్రయోజనముండదు. అందువలన, అక్కడ వుండే చిన్నచిన్న నదులకూ, వాగులకూ ఆనకట్టలు కట్టిగాని, లేక మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులు గాని కట్టి అక్కడిప్రజలు లాభపడేటట్లు చేయాలి. ఆంధ్రలో అటువంటిప్రాంతాలున్నాయో, లేవో నాకు తెలియదు. కాని తెలంగాణాలో ఒకటి, రెండు జిల్లాలు ఉన్నాయి. Simultaneous గా పెద్ద ప్రాజెక్టులతోపాటు చిన్న ప్రాజెక్టులను కూడా కట్టి ఒక uniformity వచ్చేందుకు ప్రయత్నంచేయాలి. అందులకై ప్రభుత్వంవారు శ్రద్ధ వహించాలని మనవిచేస్తున్నాను. పెద్దపెద్ద ప్రాజెక్టులు కట్టినట్లయితే కొన్ని ప్రాంతాలు మాత్రమే లాభపడతాయి. కాని చిన్నచిన్న నదులు, వాగులపైన ఆనకట్టలు కట్టినట్లయితే అన్నిప్రాంతాలవారూ లాభపడతారు. ఎక్కువమంది ప్రజలు లాభపడే అవకాశం ఉన్నది. అయితే ఈ విధంగా ఆనకట్టలు, మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులు, చెరువులు, కుంటలు కట్టుటకు చాలా అవకాశాలున్నాయి.

అవి చేసినట్లయితే గ్రామాలలోని ప్రజలు ఎక్కువగా లాభపడతారు. అందువల్ల ఈ విషయమై శ్రద్ధవహించాలని కోరుతున్నాను. ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టాలి. ఇందులో కేంద్రప్రభుత్వం కూడ కొంతవరకూ subsidies గా గాని, అప్పుగాగాని యిస్తుండవచ్చు. ఈ అవకాశలన్నింటినీ సద్వినియోగం చేసి ఈ విషయంలో ఎక్కువ డబ్బు ఖర్చుచేయాలని మనవిచేస్తున్నాను. చిన్న చిన్న ఆనకట్టలు కట్టినట్లయితే ప్రతి గ్రామమూ లాభపడే అవకాశముంటుందని బహుశా మంత్రిగారికి తెల్సుననుకుంటాను. తక్కువ ఖర్చుతో ఎక్కువ ప్రాంతాలు, ప్రజలకు వినియోగపడే అవకాశం ఉంటుంది. ఇట్టి అవకాశాలన్నీ కల్గించాలని మంత్రిగారిని కోరుతున్నాను.

పెద్ద ప్రాజెక్టులు కట్టుటలో wastage ఎక్కువ అవుతున్నది. ఈ wastage ని సాధ్యమైనంతవరకూ తగ్గించుటకు ప్రయత్నం చేయాలి. నిజామ్‌సాగర్ ప్రాజెక్టులో maintenance కే 6 లక్షలకు పైగా ఖర్చుచేస్తున్నారు. Development మీద 4లక్షలకు పైగా ఖర్చుచేస్తున్నారు. దానిమీద మొత్తం ఆదాయం

ఖర్చుపెట్టిన 10 లక్షలే వస్తున్నదనుకొంటాను. ఎక్కువ returns వచ్చేందుకు పెద్దప్రాజెక్టులలో అవకాశంలేదు. పెద్దప్రాజెక్టులవలన కొద్ది ప్రాంతం మాత్రమే లాభపడుటకు అవకాశం ఉంటుంది. ఆ డబ్బుతో గ్రామాలలో చెరువులు, కుంటలు వేయించినట్లయితే ఎక్కువ ప్రాంతాలు లాభపడటానికి అవకాశం ఉంటుంది. ప్రభుత్వానికి కూడా ఎక్కువ return వస్తుంది. కనుక వాటికొరకు ఎక్కువగా ఖర్చుచేయాలని నేను మనవిచేస్తున్నాను. Multi-purpose projects చాలా ఉన్నాయి. వీటివలన దేశంలో అందరూ అభివృద్ధి చెందడానికి అవకాశం ఉంటుంది. ముందుగా చిన్నచిన్న చెరువులు, కుంటలు breached tanks మొదలైనవి తీసికొని, తరువాత కొంతవరకు క్రొత్త ప్రాంతాలను కూడా survey చేయించి వాటి విషయంలో కూడా ఎక్కువ శ్రద్ధతీసుకోవలసిన అవసరం ఉన్నది.

Services విషయంలో తెలంగాణా ప్రాంతంలో కొంత అసంతృప్తి ఉన్నది. ఆ విషయాలన్నీ నేను ఇక్కడ చెప్పడం సమంజసంగా వుండదేమో ! మొత్తానికి ఈవిషయంలో అసంతృప్తి ఉన్నది. అదికూడా తెలంగాణాప్రాంతపు మంత్రులున్న డిపార్టుమెంటులలోనే ఉన్నదని నేను చెబుతున్నాను. అటువంటి దేదైనావుంటే సరిదిద్దుకోవలసిన అవసరంఉన్నది. Yerra Manjil లోని P. W. D. లో దాదాపు 41 మంది ఉద్యోగులున్నారు. తెలంగాణా ఉద్యోగులు వేరు, ఆంధ్ర ఉద్యోగులువేరుగా అయిపోయారు. వీరికీ, వారికీ, మాటలుకూడా లేవు. ముఖచూపులుమాత్రమే ఉన్నాయి. నేను ఈ విషయం చెప్పకపోదును గాని, రోజూ ఇటువంటివార్తలే ఎక్కువగా వినవస్తున్నాయి. ఇటువంటివార్తలు రావడం రోజురోజుకూ ఎక్కువ అవుతున్నాయి. మంత్రిగారు ఇటువంటి సమస్యలను జాగ్రత్తగా ఎదుర్కొని, అసంతృప్తి బయలుదేరనీయకుండా చేయాలని నేను వినయపూర్వకంగా విన్నవిస్తున్నాను.

రెండవ విషయమేమంటే, చిన్న పల్లెటూళ్ళలోఉండే breached tanks మరమ్మతులను కంట్రాక్టర్సుకు యిస్తున్న పద్ధతిలోకూడా కొంత సవరణ అవసరం అనుకొంటున్నాను. దానిక్రింద సాగుచేసే రైతులకే కాంట్రాక్టు యిస్తే వాళ్ళు దాన్ని తొందరగా restore చేసుకుంటారు. దానివల్ల వాళ్ళు లాభంపొందడానికికూడా అవకాశంఉంది. కనుక దానిని ఆలోచించవలసిందని మనవిజేస్తూ ఈ డిమాండును బలపరుస్తున్నాను.

*శ్రీ పి. నరసింహప్పారావు : అధ్యక్షా, మంత్రిగారు తెచ్చిన demand ను బలపరుస్తూ, కొన్ని సూచనలు తమద్వారా వారికి మనవిజేస్తున్నాను.

మంత్రిగారు ఇందులో పెద్ద ప్రాజెక్టులు, ఎక్కువ మొత్తాలు హెచ్చుగా చూపించారు. చాలా సంతోషం. కాని ఈ విషయంలో హెచ్చు

మొత్తాలు ఖర్చుబెట్టబడిన గుంటూరు, కృష్ణా జిల్లాలవారు సంతోషిస్తారు గాని, తక్కిన జిల్లాలవారు మట్టుకు కొంతవరకు విచారించవలసి వస్తుంది. చిరకాలం నుండి వెనుకబడిన జిల్లాలు కొన్ని ఉన్నవి. వీటిని గురించి యిదివరకు మన ముఖ్యమంత్రి కొన్ని వాగ్దానాలు చేసిఉన్నారు. ముఖ్యంగా పాలకొండ తాలూకాలో నందివాడ ప్రాజెక్టు ఉన్నది. 3 సం. ల క్రిందట మంత్రిగారు దానిని చూశారు. అప్పుడు "తప్పకుండా మేము దాన్ని పూర్తిచేస్తాం" అని చెప్పారు. అప్పటినుండి ఏ Budget లో నైనా కనీసం token grant క్రింద ఒక 100 రూ. లైనా పెట్టారా ? అంటే లేదు. Estimates మట్టుకు తయారై 2 సం. లు అయింది. కాని అక్కడచేశాము, ఇక్కడచేశాం అంటున్నారు. వున్న వాళ్ళకే పెట్టడంవల్ల అజీర్తిచేసినట్లవుతుంది. లేనివాళ్ళం మేము, మామీద వేసిన శిస్తులు యిస్తాం అంటున్నాం. అది కూడా ప్రభుత్వం గమనించాలి. సుమారు 60 వేల ఎకరాలు సాగుకావడానికి సిద్ధంగా ఉంది. చీపురుపల్లి, పాలకొండ తాలూకాలకు నందివాడ ప్రాజెక్టు చాలా ముఖ్యమైనది. ముఖ్యమైన 3 నదులు అక్కడ కలుస్తున్నవి. ఎప్పుడో అక్కడ foundation మాత్రం వేశారు. అప్పటి నుండి ఇప్పటివరకూ దాన్ని పూర్తిచేయలేదు. దాన్ని గురించి ముఖ్యమంత్రి గారు వాగ్దానంచేశారు. కనుక వారి టైములోనే అది పూర్తిఅయిపోతుందనే విశ్వాసంతో ప్రజలంతా ఎదురుచూస్తున్నారు, కనుక మంత్రిగారు వెంటనే తగు చర్యతీసుకొని next budget లో నైనా దానికి కొంత allot చేసి, దాన్ని పూర్తిచేయించగలందులకు మరొకసారి విజ్ఞప్తిచేస్తున్నాను.

ఇక departments గురించి రెండువిషయాలు మనవిచేస్తాను. పాలకొండ తాలూకాల్లో నాగావళిప్రాజెక్టు ఉంది. నాగావళిప్రాజెక్టు క్రింద second crop క్రింద 1000 ఎకరాలకు ప్రతి సం. యిస్తూ ఉంటారు. 7, 8 సం. ల నుంచి ఈ విధంగా ప్రారంభించారు. ఇప్పుడు department లో లంచగొండితనం హెచ్చుగా పెరిగిపోయింది. ప్రస్తుతం 5000 ఎకరాలు తీసుకొని 15 వందలకు మాత్రమే నీటి supply చేస్తున్నారు. కాని మిగతాదానికి ఎకరాకు యింత అని మాత్రం వసూలుఅయిపోతున్నది. దాన్ని గురించి మంత్రిగారికి యిదివరకు ఒకసారి report చేశాను. Enquiry కూడా జరిగింది. ఒక Superintendent Engineer గారు వచ్చారు. వారితోబాటు నేనుకూడా enquiry కి వెళ్లాను. Delta area లో ఎకరాకు 2, 3 రూ. వసూలుచేస్తుంటారు. ఆయన యిది పెద్దనేరంకాదన్నట్లుగా చెప్పారు. తెలిసిఉండికూడా departmentలో దొంగతనంజరుగుతున్నదంటేఅందుకు ఎవరిది బాధ్యత ? ప్రభుత్వం ఈ విధంగా ఊరుకోవడంచేతనే లంచగొండితనం పెరిగిపోయిందని ప్రజలంతా అనుకుంటున్నారు. ఇదివరకు మన ముఖ్యమంత్రి గారు ఆ శాఖలో వుండేవారు. వారు చాలా కఠినుగా వుండి punishments బాగా యిస్తారని కొంతభయం ఉండేది. కాని ఇప్పుడు ఈ మంత్రిగారు తీసుకున్న

తరువాత చాలా సాత్వికులు, ఒకరి కడుపు కొట్టరు, అనే భావం బయలుదేరింది. ఇవాళ 2 రూ.లే తీసుకుంటున్నారు. రేపు 4 రూ.లు తీసుకుంటారు. యింక హద్దేముంది ? ఈ విధంగానే పెరిగిపోతుంది కనుక ప్రభుత్వంవారు departments లో జరుగుతున్న యిటువంటి అక్రమచర్యలు తగ్గడానికి వెంటనే చర్యలు తీసుకోవలసి యున్నది.

శ్రీకాకుళంజిల్లాలో estate villages ఉన్నవి. Estate villagesలో కొన్ని చోట్ల రెండు పంటలు ఉన్నవి. వాటిలో రెండు పంటలకూ ఎకరాకు 20, 30 రు.ల వరకు శిస్తులు వసూలుచేస్తున్నారు. అలాగే రెండు పంటల్లో నీటి తీరువ వసూలుచేస్తున్నారు. సుమారు 30 గ్రామాలున్నవి. వాటిలో 11 వేల ఎకరాలున్నవి. ఇదివరకు బొబ్బిలి ఎస్టేటులో వున్నప్పుడు అక్కడవేసిన supervisor ఆ నీటిని చూచుకొంటూ ఎకరాకు 60 రూ॥ల చొప్పున పన్ను వేస్తూవుండేవారు. Survey settlement కాకపోయినప్పటికీ సర్చార్జీలన్నీ వాళ్ల మీద వసూలు అవుతున్నవి. వాళ్ళకు రెండు పంటలకూ నీరు సరఫరాచేస్తే ఎంత rate వసూలుచేయాలనుకున్నా, వాళ్ళు యివ్వడానికి సిద్ధంగాఉంటారు. ఈ విషయం Executive Engineer గారిని అడిగితే వేరే department వుంటేనే గాని చేయడం కష్టం అని వారు చెబుతున్నారు. కాని పాలకొండలో ఉన్న supervisors అదికూడా manage చేయవలసివస్తుంది. కనుక దానికి వేరే ఒక supervisor ను వేసి, seperate staff ను వేసినట్లయితే అందరికీ ఉపయోగంకలిగే ఏర్పాటు అవుతుంది. కాబట్టి మంత్రిగారు ఈ విషయాలన్నీ తిరిగి ఆలోచించ వలసి యుంటుందని మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ జి. నరశింహమూర్తి (అమలాపురం - జనరల్) : అధ్యక్షా, ఇరిగేషన్ శాఖామాత్యులు తీసుకవచ్చిన ఈ demand ను బలపరుస్తూ నాకు స్ఫురించిన 2,3 ముఖ్యవిషయాలను మనవిచేస్తాను.

దేశం అంతటా ఆహారకొరత వస్తున్నదని, జనాభా విపరీతంగా పెరిగి పోతున్నదని, జనాభాకు తగినట్లుగా ఆహారోత్పత్తి అభివృద్ధి కావడంలేదని మన అఖిల భారత నాయకులు, రాష్ట్రనాయకులు ప్రతినిత్యం బ్రహ్మాండంగా ప్రబోధం చేస్తున్నారు. ప్రజలకు తగినట్లుగా అధికోత్పత్తి చేయాలంటే ముఖ్యంగా రాష్ట్రంలో అనేక తరహాలలో అనేక ప్రాంతాలలో ఉన్న భూముల స్థితిగతులను పరిశీలించాలి. సర్కారుజిల్లాలు అనబడేవి (గోదావరి, కృష్ణ నదులక్రింద సాగుఅయ్యే లక్షలకొలది ఎకరాలు గలిగిన ప్రాంతాలు) తరువాత రాయలసీమ, తరువాత తెలంగాణా, ఈ విధంగా వీటిని 3 ప్రాంతాలుగా మనం భాగిస్తున్నాం. ఈ మూడుప్రాంతాలలో uplands లో ఉన్న ప్రజానీకానికి ఆహారధాన్యాలు కృష్ణా, గోదావరి నదుల delta ప్రాంతాల

నుండే వస్తున్నవి. కనుక ఈ వెనుకబడిన ప్రాంతాలను పురోగమించిన ప్రాంతాలవారు అత్యంత ఆదరంతో, బహు కారుణ్యంతో ఆదుకొని, రాష్ట్రంఅంతా ఒకే సోదరులనేట్లుగా ఉన్నప్పుడే రాష్ట్రంలో ఏ ఒక్క ప్రాంతము క్షామంతో బాధపడడానికి వీలుండదు. అప్పుడు వెనుకబడిన ప్రాంతాలవారు కూడా యితరులకు సహాయం చేసేట్లుగా ఉంటారు. ఇప్పుడు గౌరవసభ్యులు శ్రీ అయ్యపురెడ్డిగారు "గోదావరి, కృష్ణా డెల్టాలలో ఉన్నవారు చాలా లావుగా ఉంటారు, వారినిచూస్తే మాకు బాధగా ఉంటుంది" అన్నారు. ఇటువంటి భావాలుమాత్రం యేమాత్రమూ ప్రయోజనమైనవి కావని మనవిచేస్తున్నాను. ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు మా కోనసీమ ప్రాంతాలకు వచ్చారు. అప్పుడు వారితోబాటు బ్రహ్మానందరెడ్డిగారుకూడా వచ్చారు. ఆ ప్రాంతాన్ని చూచి, అదంతా సస్యశ్యామలంగా ఉందనీ, నందనోద్యానవనంలాగున్నదనీ, వారి ఆనందాన్ని వెలిబుచ్చారు. శ్రీ సంజీవరెడ్డిగారు "ఈ ఆంధ్రప్రదేశ్ అంతా ఎప్పుడు ఈ కోనసీమలాగా ఒక నందనోద్యానవనంగా అవుతుందా అని అహోరాత్రులు, మెలకువలోను, నిద్రలోకూడా ఆలోచిస్తున్నా" మని బహిరంగంగా సభలో సెలవిచ్చారు.

అంతేకాకుండా బ్రహ్మానందరెడ్డి గారు ఆ ప్రాంతీయుల తెలివికొంత సంపాదించే అవకాశము కల్గినదని సంతోషము వెలిబుచ్చారు. ఐతే రాయలసీమ అని, తెలంగాణా అని, సర్కారు జిల్లాలని భేదాభిప్రాయాలు ప్రబలం చేసుకోవడం కంటే ఎచ్చట తక్కువ మొత్తముతో ఎక్కువ ప్రయోజనం అత్యల్పకాలంలో కలిగి అధికోత్పత్తి సాధ్యం అవుతుందో ఆ ప్రాంతాలలో తగినంత కృషిచేసి అధికోత్పత్తి చేయించి తరుగు ప్రాంతాలకు త్వరితగతిని అందుబాటు చేస్తే మనకు ఎంతో లాభం జరుగుతుంది. సర్వేజనా సుఖినోభవంతు అనేదే ధ్యేయంగా ఉంచుకొని అట్టి పథకాలకు ప్రథమ ప్రాధాన్యత ఇవ్వవలెనని నేను మనవి చేస్తున్నాను. ఇప్పుడు నాగార్జునసాగరు ప్రాజెక్టు నిర్మింపబడుతున్నది. మనమందరమూ గర్వించతగ్గ నిర్మాణమది. అయితే ఒక ప్రముఖ ఇంజనీరు చెప్పిన ఒక విషయాన్ని మనవిచేస్తాను. 10, 12 సంవత్సరములలోను యీ ప్రాజెక్టులవల్ల ప్రయోజనం కలుగుతుందని అంటున్నారేగాని పూర్తి ఫలితములను పొందటానికి కనీసము 20 సంవత్సరములైనా పడుతుందని వారు అభిప్రాయపడుతున్నారు. ఎన్నో వందల కోట్ల రూపాయలు ఖర్చుపెడితే 20 సంవత్సరముల తరువాత ఫలితం మనకు రావడం జరుగుతుంది. అయితే ఇప్పుడున్న ఇరిగేషన్ సిస్టమ్సువల్ల కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలలో కొన్నిలక్షల ఎకరములుసాగవుతున్నవి. ఈ ఎగ్జిస్టింగు సిస్టంమీద కొద్దిపాటిమొత్తములు ఖర్చుపెట్టినట్లయితే లక్షలాది ఎకరములభూమి సాగుకువచ్చి తద్వారా కొన్ని లక్షల టన్నుల ఆహార ధాన్యముల అధికోత్పత్తి జరుగగలదు. గోదావరి, కృష్ణాడెల్టా

ప్రాంతాలలో స్వల్ప వ్యయముతో అత్యల్ప కాలంలో అధికోత్పత్తి చేయించుటకు ఎన్నో అవకాశాలున్నాయి. ప్రభుత్వము యీ తరుణములో కొంత మొత్తము ఖర్చుపెట్టి ఆ ప్రాంతములను అభివృద్ధిచేసి తద్వారా రాష్ట్రాభివృద్ధికి తోడ్పడవలెనని కోరుచున్నాను. అదే విధముగా స్వల్ప వ్యయంతో అత్యల్ప కాలంలో అధిక ప్రయోజనం కలిగే స్కీములు తెలంగాణాలోనూ రాయలసీమ లోనూ కూడా ఉన్నట్లయితే వాటినికూడ తప్పకుండా ప్రభుత్వం వెంటనే కొనసాగించవలసిన అవసరమున్నదని నేను మనవిచేస్తున్నాను. రాయలసీమ ప్రాంతంలోకాని, తెలంగాణా ప్రాంతంలోకాని చదరపు మైలుకు 11, 12 మంది మాత్రమే జనాభా ఉంటుంది. ఐతే సర్కారు జిల్లాలలో ఉన్నటువంటి గోదావరీ జిల్లాలలోనూ, కృష్ణా, గుంటూరుజిల్లాలు మొదలయిన జిల్లాలలోను చదరపుమైలుకు 16 వందల జనాభా ఉన్నది. ఆ ప్రాంతంలోని రైతులకు వ్యవసాయ సౌకర్యములు ప్రభుత్వము కలుగచేసినప్పుడే వారు సర్వతోముఖాభి వృద్ధి చెందుతారు. అంతేనేకాని ఒక ప్రాంతాన్ని నిందించినందువల్ల ప్రయోజనంలేదు. తూర్పుగోదావరి జిల్లాలో కాకినాడ, రామచంద్రపురం, అమలాపురం, కొత్తపేట, రాజోలు మొదలయిన డెల్టా తాలూకాలు ఉన్నాయి. ఈ తాలూకాలలోని చాలా భాగము భూమి పేరుకు మాత్రము సాగవుతున్నదే కాని నూటికి డెభ్భై ఎకరాలలో చాలా కొద్ది పంటమాత్రమే పండుతున్నది. అవి పల్లపు ప్రాంతాలు. సముద్రతీరపు ప్రాంతాలు అవడంవల్ల ముంపు దెబ్బ తగులుతుంది. వరదలువచ్చినప్పుడు మునిగిపోవడంవల్లా మురుగునీరు పోవుటకు గాను డ్రైనేజి ఫెసిలిటీస్ లేకపోవడంవల్ల పేరుకు ఇన్ని లక్షల ఎకరాలు సాగవుతున్నదని చెప్పినప్పటికీ చాలా భూమిలో తగినంత పంట రావడంలేదు. అందుచేత ఆ ప్రాంతంలో కొన్ని లక్షలు మాత్రమే ఖర్చుపెట్టినట్లయితే ఎంతో అభివృద్ధిచెంది అధిక ఆహారోత్పత్తి జరుగుతుందని మనవిచేస్తున్నాను. ఆ ప్రాంతములో నున్నటువంటి మురుగు కాలువలను అభివృద్ధిపరచి మురుగునీరు వెంటనే వెళ్ళిపోయే సౌకర్యములు కలుగచేసే నిమిత్తము ఒక డ్రైనేజి డివిజన్‌ను కృష్ణానదికీ, గోదావరి నదికి వేరువేరుగా ఏర్పాట్లు చేసినట్లయితే బాగుంటుంది. దానివల్ల డ్రైనేజి ఫెసిలిటీస్ సమకూరి, యీ సంవత్సరం పనిచేసినట్లయితే వచ్చే సంవత్సరంలోనే ఎకరం 2 బస్తాలు పండే భూమి 20బస్తాలు పండుతుందని మనవిచేస్తున్నాను.

రెండవ పంటకు నీరు సప్లయి చేసే విషయంలో లోకలైజేషన్ స్కీము అని పిలువబడే పథకం ఒకటుంది. 1941, 42 సంవత్సరములలో గోదావరీ డెల్టాలో యీ స్కీమును ఏర్పాటుచేశారు. యీ స్కీము క్రింద గోదావరీ నదిలో ఎంత నీరు ఉంటుందో దానినిబట్టి కొంత ఏరియాను ఏర్పాటుచేసి దానికి రెండవ పంటకు నీరు ఇచ్చేటట్లు నిర్ణయించారు. ఐతే నదిలో ఎక్కువనీరు

ఉన్నట్లయితే మరి కొన్ని వేల ఎకరాలకు కూడా అదనంగా రెండవపంట ఇవ్వడం జరుగుతున్నది. ఈ లోకలైజేషన్ జి. ఓ. 1942 వ సంవత్సరములో పాస్ చేశారు. ఎప్పుడో ప్రజాప్రతినిధులు అధికారములో లేని కాలంలో, ఆ ప్రాంతపు నాయకులందరూ జైళ్లలోనున్న సమయంలో కొందరుఉద్యోగులు ఈ స్కీమును ఏర్పాటుచేశారు. 6 సంవత్సరముల అనంతరం ఆ స్కీమువల్ల కలిగిన అనుభవాలను పురస్కరించుకొని ఆ స్కీమును మార్పుచేస్తామని ఆ జి. ఓ. లో చెప్పారేగాని దాదాపు 15 సంవత్సరములు అయినప్పటికీ కూడా ఇంతవరకూ దానిని రివైజ్ చేయలేదు. ఇంజనీరుగారికీ, తదితర అధికారులకూ ఈ స్కీమును రివైజ్ చేయవలసిన అవసరాన్ని బట్టి తెలియచేసినప్పటికీ కూడా, ఎడిషనల్ స్టాఫ్ కావాలి, స్టాఫ్ లేదు కనుక ఇపుడు చేయలేము, స్టాఫ్ వచ్చిన తర్వాత చేస్తామని సమాధానము లివ్వడమే తప్ప మార్పు జరుగలేదు. మార్పు జరిగినట్లయితే కొన్ని వేల టన్నుల ధాన్యము అదనంగా పండటానికి అవకాశమున్నదని నేను తమద్వారా ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ఇర్రిగేషన్ డిపార్టుమెంటుకు అవుతున్న ఖర్చుగురించి చెప్పడమనేది చాలా విచిత్రమైనవ్యవహారం. దానిని వర్ణించి చెప్పాలంటే చాలా చెప్పవచ్చు. ఒకటి రెండు విషయాలు మాత్రమే మంత్రిగారి దృష్టికి తేదలచుకున్నాను. ముఖ్యముగా కాలువలలో సిల్టు క్లియరన్సు నిమిత్తము కొన్నిలక్షల మొత్తాన్ని ఏటేటా ఖర్చుచేస్తున్నారు. ఐతే యీ సిల్టు క్లియరన్సు అనేది ఏ విధముగా జరుగుతున్నదో గమనించవలసి ఉన్నది. సిల్టుక్లియరన్సు విషయంలో ఉద్యోగస్థులు తనిఖీ చేయడంగాని, తగిన చర్య తీసుకోవడంగాని జరగడంలేదు. ఉదాహరణకు ఒక కాలువ 9 మైళ్ళు పొడవు ఉన్నదనుకోండి. యీ తొమ్మిదిమైళ్ళ పొడవూ ఉన్న కాలువలో ఒండ్రుమన్ను తీసివేయడానికి 70, 80 వేల రూపాయలు ఖర్చుపెడతారు. అయితే మొదటఉన్న మూడుమైళ్లు చివరఉన్న 3 మైళ్లూ వదిలి, మధ్యన ఉన్న 3 మైళ్ళ కాలువలో సిల్టును క్లియర్ చేస్తారు. ఇలా ప్రతి సంవత్సరమూ జరుగుతున్నది. కాని మొత్తము 9 మైళ్ళకూ డబ్బు తీసుకుంటారు. కంట్రాక్టరు, మిగతా మిత్రులూ యీ విధంగా ప్రభుత్వం డబ్బు తీసుకుంటున్నారు. దీనివల్ల ప్రయోజనం ఏమిటి? అటు మూడు మైళ్లూ, ఇటు మూడు మైళ్లూ వదిలివేసి, మధ్యన ఉన్న 3 మైళ్ళలో రైతులు పొలాలలో పోసుకోడానికి లేదా ఇటుకలు తీసుకోడానికి ఒండ్రుమట్టి తీసుకుంటే ఆ ప్రాంతంలో ఇటూ అటూ కొద్దిగా కట్‌చేసి ఏదో కావలసిన **depth** చూపించి డబ్బు తీసుకోవడం జరుగుతున్నది. దీనిమీద నేను ఒక ఇంజనీరుకు కంప్లయింటు చేశాను. ఇటువంటి దండుగలు జరుగకుండా ప్రభుత్వంవారు చూడాలి. ఇది ప్రజాస్వామ్యంలో జరుగుతున్నది. యీ విధంగా ప్రజల డబ్బును దుర్వినియోగం చేయకుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలి. ఇటువంటి దుబారా ఖర్చులు ఎన్నో జరుగుతున్నాయి.

రీ-మోడలింగు స్కీము అనేది ఒకటున్నది. మా ప్రాంతంలో lengthy channels ఉంటాయి. కాబట్టి పయిన ఉన్న పైపు ఎక్కువ నీరు డ్రా చేస్తే క్రిందకు నీరు పోదు. కనుక చివరభూములు సఫర్ కాకుండాఉండే ఉద్దేశ్యముతో యీ రీ-మోడలింగు సిస్టము పెట్టారు. దీనిప్రకారము సిమెంటు హెడ్‌వాల్సు కట్టి పైపు పెడతారు. ఇందుకుగాను ప్రతి సాలున కొన్నిలక్షల రూపాయలు వ్యయమవుతున్నది. సిమెంటు హెడ్‌వాల్సు కట్టి సిమెంటు పైపు పెట్టిన పక్కనే కొందరు రైతులు పెద్ద గండ్లు కొడతారు.

మొదటినుంచి చివరవరకు ఈ breaches అలాగే వెళ్ళిపోతూఉంటే,దాన్ని గురించి అడిగే నాథుడేలేడు. అది చేయడంవల్ల ప్రభుత్వము మనమీద చర్య తీసుకుంటుందికదా, మనము నష్టపడుతాము అనే భయమేలేదు. మరి ఎందుకో ఈ remodelling అనే పేరుతోటి, ఇటువంటి కట్టుదిట్టాలు చేయకుండా; ఇన్ని లక్షల రూపాయలు ఖర్చు పెట్టడం. remodelling చేయవలసిందే, silt clearance సరిగా జరిగిందా లేదా చూడవలసిందే. కాని ఈ జరుగుతున్నటువంటి irregularities గురించి, ప్రభుత్వోద్యోగులపైన తీసుకొంటున్నట్లుగానె, రైతులమీద కూడా సరియైన కట్టుదిట్టమైన చర్యలు ప్రభుత్వము తీసుకొని తగినసౌకర్యాలు కలుగజేసినట్లయితే, ఇంతకుముందు మన వెంకటరామరెడ్డిగారు చెప్పినట్లు కోటి రూపాయలే కాదు, పదికోట్ల రూపాయలుకూడ పన్ను అక్కడ వేసినా, రైతులు ఇవ్వడానికి సంశయింపరని మనవిచేస్తున్నాను. కనుక సౌకర్యాలు చేయండి. అందుకుగాను కావాలంటే, గౌరవనీయ గోపాలరెడ్డిగారికి కోటి రూపాయలు పన్నుక్రింద ఇస్తాము. అప్పులుచేయడం రెడ్డిగారికి అలవాటు గనుక, అవసరమైతే అప్పులు ఇవ్వడానికికూడా సంశయించము. అందుచేత సర్వతోముఖాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని, అత్యధిక ఫలసాయాన్ని ఇచ్చేటటువంటి, అత్యంత స్వల్పకాలములో ఆదాయము వచ్చేటటువంటి విధంగా రాష్ట్రాన్ని అభివృద్ధి చేయాలన్నట్లయితే delta తాలూకాలలో, క్రిష్ణాడెల్టాక్రింద కానివ్వండి,గోదావరి డెల్టాక్రింద కానివ్వండి, ఉన్నటువంటి పల్లపుభూములలో drainage facilities కలుగజేసి irrigation channels ను improve చేసి, తగినట్టు కట్టుదిట్టములు చేసి, ఇప్పుడున్న శాసనాలను మార్చిఅయినా సరే, irregularities జరుగకుండా చేయవలసి ఉంటుంది. ఆ విధంగా చేసిననాడే అధికాహారోత్పత్తి సాధ్యమవుతుంది. అప్పుడు అయ్యపురెడ్డిగారి constituency లాంటి constituencies లకు వేలకొలది టన్నులు ఆహార పదార్థాలు పంపించవచ్చు. తెలంగాణాకుకూడా పంపించవచ్చు. పరస్పర సహకారముతో వ్యవహారము చేసుకొన్నప్పుడే ఈపని సాధ్యమవుతుంది. కనుక ఈ సూచనలన్నీ మంత్రిగారు జాగ్రత్తగా ఆలోచించి అమలులో తీసుకురావడానికి, తగిన కట్టుదిట్టాలు, ఏర్పాట్లుచేస్తారని ఆశిస్తూ ఈ అవకాశము ఇచ్చినందుకు తమకు నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

*శ్రీ కె. సీతారామస్వామి (బొబ్బిలి) : అధ్యక్షా, గౌరవనీయ Irrigation శాఖ మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ Irrigation Demand చాలా ప్రశంసనీయముగా ఉన్నదని చెప్పక తప్పదు. ఎందుచేతనంటే, దేశములో ఆహారకొరత చాలా జాస్తీగా ఉన్న సమయంలో, ఈ Irrigation కు కేటాయించిన మొత్తం చాలదేమో అనుకొంటాను. ఇంకా హెచ్చుచేస్తేనే గాని ఆహారకొరత తీరదని నా ఉద్దేశము. కాని ఒక్క విషయంమాత్రం నేను ప్రభుత్వ దృష్టికి తమద్వారా మనవిచేస్తున్నాను. ఈ Irrigation Demand లో కోరిన మొత్తము యావత్తూ ఇంజనీరింగు శాఖవల్లనే ఖర్చుపెట్టబడవలసియుంటుంది. ఆ ఖర్చుచేయడంలో ఈ Engineering Department లో ఇదివరకే ఒక జబ్బు ప్రవేశించింది. అది British Government పరిపాలనలో నూటికి అయిదుపాళ్ళు, 10 పాళ్ళు ఉండేది. కాని ఇప్పుడది నానాటికి హెచ్చుఅయిపోతున్న సంగతి అందరికి తెలుసు. కనుక ఆ శాఖలో జాగ్రత్తగా సరియైన కట్టుదిట్టాలు చేస్తే గాని ఈ డబ్బు సక్రమముగా వినియోగంకాదు, దుర్వినియోగమే అవుతుంది అని నేను ప్రభుత్వానికి సలహా ఇస్తున్నాను.

నేను ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లాను దృష్టిలో పెట్టుకొని మాట్లాడుతున్నాను. ఎందుచేతనంటే, కొదవ జిల్లాల విషయము నా కాట్టే తెలియదు. మా శ్రీకాకుళం జిల్లాలో 11 తాలూకాలు ఉన్నాయి. ఈ 11 తాలూకాల లోను, పూర్వము జమీందార్ల పరిపాలనఉండేటప్పుడు నీటివనరుల విషయంలో ఎప్పుడు చెరువులకు గండ్లుపడినప్పటికీ, ప్రత్యక్షంగా జమీందార్లకో లేక ఆ ఉద్యోగస్తులకో తెలియచేసుకొన్నట్లయితే ఆ వర్షాకాలం పోయిన వెంటనే వాటికి మరమ్మతులు చేసేవారు. కాని ఇప్పుడు Estates ను గవర్నమెంటు స్వాధీనం చేసుకొన్న తరువాత ఈ procedure అంతా చాలా cumbersome అయిపోయి రైతులు చాలా ఇబ్బందుల పాలు అవుతున్నారు. ఒక చెరువుకు గండిపడితే, దాన్నిగురించి కలెక్టరుగారికో, లేక Executive Engineer గారికో పిటీషను పెట్టుకొంటే, ఆయన బహుశా సక్రమంగా order వేయవచ్చు. కాని ఆయన order వేసినతరువాత ఆ కాగితము Supervisor దగ్గరకు వస్తుంది. ఆ Supervisor ఏ ఆరునెలల దాకానో, సంవత్సరం దాకానో దానికి estimate తయారుచేయడంలేదు. నాకు పని చాలా జాస్తీగా ఉన్నది, జిల్లాకు ఇద్దరమే ఉన్నాము లేక నేను ఒక్కడనేఉన్నాను, staff చాలదుఅని చెపుతాడు. ఆఖరుకు ఇంటిలోనే కూర్చొని estimates తయారుచేయడం జరుగుతుంది. ఆ estimates తయారుచేయడంలో చాలా విపరీతమైన మొత్తాలను వేయడం జరుగుతుంది. నిజంగా మూడు వేల రూపాయలకు అయ్యేపనిఉంటే ఆరువేల రూపాయలకు estimates తయారుచేస్తాడు. ఆ విధంగా చేసిన సందర్భాలు చాలాఉన్నాయి. ఇంటిదగ్గర estimates తయారుచేస్తే పెద్దఅధికార్లు, Executive Engineers,

Superintending Engineers, వీళ్ళంతా తనిఖీకి రావటం ఉండదు కాబట్టి ఈ Supervisor మొదలగు తక్కువ ఉద్యోగస్తులు డబ్బు కాజేయాలనే దురుద్దేశము మొదటే మనసులో పెట్టుకొని estimates తయారుచేయడంనుంచీ ఆపని ప్రారంభిస్తారు. ఈ విధంగా వారు ప్రవర్తిస్తారు. గండ్లుపడిన చెరువులకు 1, 2 సంవత్సరములైనాగాని మరమ్మతులు జరుగవు. పోయిన సంవత్సరం ఒక చెరువు తూముకు sluices పోయిన పరిస్థితులు కూడ ఏర్పడినాయి. ఆ సందర్భంలో ప్రభుత్వము ఒక contractor ను నియమిస్తే ఆ contractor ఇదివరకు ఆ పనిని నిర్వహించకపోయినా, ప్రశ్నించేవారు లేరు. ఎన్నోసార్లు ప్రజలు వెళ్ళి ఉద్యోగస్తులతో contractor పనిచేయడంలేదని చెప్పుకొన్నారు. అప్పుడు contract ను రద్దుచేస్తామని చెప్పడం జరిగిందిగాని నాకు తెలిసినంత వరకు ఆ contract ను రద్దుచేయడం జరగలేదు.

తరువాత ముఖ్యంగా పనులు సక్రమంగా నిర్వహించక పోవడానికి ఒక కారణ మున్నది. పెద్ద ఇంజనీర్లు, పెద్ద అధికార్లు తరచు ఆ యా ప్రదేశాలకు వెళ్లి తగినతనిఖీ చేయడంలేదు. శ్రీకాకుళం, విశాఖపట్టణం ఈ రెండింటికి కలిసి ఒక Special Division ఉన్నది. కనుక ఆ ఇంజనీరుగారు విజయనగరంలో ఉంటారు. ఇక్కడేమో ఈ Supervisors పనులు చేస్తూ ఉంటారు. వీరు ఏమి పొరపాట్లు చేయకుండా వారిమీద effective check ఉంచటానికి, పెద్ద ఆఫీసర్లు తరుచు ఆ ప్రదేశాలకువచ్చి అజ్మాయిషిచేస్తూఉంటె, ఈలాంటి అక్రమాలు జరుగకుండా ఉంటాయి. లేకపోయినట్లయితే చాలా అక్రమాలు జరగడానికి అవకాశం ఉంటుంది. ప్రజలనుంచికూడా చాలా విమర్శలు వస్తున్నాయి. కనుక ఈ పొరబాటును నివారించడానికి సక్రమమైన చర్యలు తీసుకోవలెనని సూచన చేస్తున్నాను.

తరువాత, సంజీవరెడ్డిగారు Deputy Chief Minister గా ఉన్నప్పుడు మా జిల్లాపరిస్థితులు చూచి ఈ జిల్లా నిర్లక్ష్యం చేయబడిందని అన్నారు. ఇదివరకు మద్రాసు రాష్ట్రంలో ఉన్నప్పుడు కూడా మా జిల్లా నిర్లక్ష్యం చేయబడింది. రాష్ట్రంలో ఎక్కడో దూరంగా ఒరిస్సాలో కలిసి ఉన్నదికాబట్టి, అది ప్రభుత్వ దృష్టికి తరచు రావడంలేదు. ఇది ఆ విధంగా నిర్లక్ష్యం చేయబడినటువంటిది కాబట్టి, సంజీవరెడ్డిగారు దానికి ఉపకారం చేయాలని 4 సంవత్సరములక్రిందట ఒక కోటి రూపాయలతో నాలుగు స్కీములు శాంక్షన్ చేశారు. ఆ స్కీములు sanction చేసిన తరువాత, పని ప్రారంభించారు, కొంతవరకు పనికూడా జరిగింది. ముఖ్యంగా నా నియోజకవర్గములో ఉన్నటువంటి నీతనార ఆనకట్ట గురించి మీకు వివరాలు తెలియజేస్తున్నాను. ఆ పని ప్రారంభించి నాలుగు సంవత్సరాలైంది. క్రిందటి సంవత్సరం జూన్ నెల ఆఖరులోపల నీరు ఇస్తామని ప్రభుత్వము ప్రకటించింది. గెజెట్‌లో వేశారు. దో ఫసల్ అంటే రెండుపంటలకు

27 రూపాయలు, ఒక పంటకు 12రూపాయలు చొప్పున నీటితీరువా వసూలు చేస్తారనికూడా ప్రకటించబడింది. అప్పుడు Deputy Chief Minister గారు ఆ విషయం ఈ అసెంబ్లీలోకూడా announce చేసినట్లు నాకు జ్ఞాపకము. కాని క్రిందటి సంవత్సరం జూన్‌కు నీరు రాలేదు. ఈ సంవత్సరం వర్షం వచ్చింది. అచ్చట పనిఏమీ చురుకుగా సాగడంలేదు. చాలా మందకొడిగా జరుగుతున్నది. దీనికి ఒక కారణం చెప్పుతున్నారు. ఇదివరకు కొండయ్యగారు అని ఒక ఇంజనీరు ఉండేవారు. ఆయన ఏజెన్సీ ఖండ్‌కు transfer చేయబడిన తరువాత పనిలో జాప్యం జరిగిందని చెప్పుతున్నారు. అక్కడ ఉన్న roads సరిగాలేక contractors ఎవ్వరూ రావడంలేదు. వచ్చిన contractors వెళ్లిపోతున్నారు. Contract రద్దు చేయబడుతున్నది అని ఆ staff చెప్పుతున్నారు. ఆ staff ఏమో రెండు సంవత్స రాలనుంచి జీతాలు పుచ్చుకొనడంమాత్రం జరుగుతుంది. కాని contractors ను అడిగితే, వారు చెప్పే కారణాలు వేరు. "ఇక్కడ staff ఏమీ శ్రద్ధతీసుకోవడం లేదు. మేము వెళ్ళి, ఎక్కడ పనిచేయమంటారో చూపండి అని అంటే వారు చూపడంలేదు, మాకుపనిచూపించి చేయించడంకూడాలేదు, మాబిల్సు payment విషయంలోకూడా చాలా జాప్యం జరుగుతున్నది. ఆ bills ఇచ్చేటప్పుడుకూడా మాకు నష్టం జరుగుతున్నది. కనుక లాభములేని contract మాకెందుకు" అని వారు చెప్పుతున్నారు. అటుపైన ఇంకొక విషయంకూడా జరిగింది. దీనిని గురించి ఇరిగేషన్ మంత్రిగారు తగిన శ్రద్ధ పుచ్చుకొని enquiry కూడా జరిపిస్తే బాగుంటుందని నాఉద్దేశం. అక్కడ ఈఉద్యోగస్థులు ప్రభుత్వంతాలూకు సిమెంటు బస్తాలు చాలా విరివిగా అమ్మడం జరిగింది. చాలామంది అదిచూచినవాళ్లుకూడా చెప్పారు. దానికి తార్కాణం అక్కడ చుట్టుప్రక్కల గ్రామాలలో పూరి కొంపలలోకూడా సిమెంటు గచ్చులు ఉన్నాయి. మంత్రిగారు అక్కడికివస్తే, ఇది స్వయంగా వారికి చూపిస్తామని అనుకొన్నాను. దానికి ఇంకా ఒక ప్రబల మైన నిదర్శనమున్నది. పై అధికార్లు వచ్చినప్పుడు ఈ సిమెంటు bags ను check చేస్తారేమో అనుకొంటాను. అందుకని ఈ ఉద్యోగస్థులు బొబ్బిలి, పార్వతీపురం మార్కెట్‌లో empty cement bags కొని తమ stores లో పెట్టినట్లు చాలా మంది ప్రజలు చెప్పుకొంటున్నారు. ఆ ఆనకట్టపని ఇంత మందకొడిగా సాగు తున్నందుకు అన్ని రాజకీయ పక్షాలవారుకూడా అసంతృప్తిచెందారు. ఇంకా దింట్లో levels కూడ సరిగా ఎత్తడంలేదు. ఈ ప్రాజెక్టు పూర్తికాదు. ఇదంతా failure, దీనికి పెట్టిన పది లక్షల రూపాయలు waste అనికూడ అను కొంటున్నారు.

దానిని గురించి ప్రజలుకూడ చాల ఆందోళన చెందుతున్నారు. రెండు సంవత్సరములనుంచి జాప్యంవల్ల 4 వేల ఎకరాలకు ప్రభుత్వానికి వచ్చేటటువంటి శిస్తు సంవత్సరానికి రు. 27 చొ॥ రెండు పంటలకు యిచ్చే శిస్తు నష్టం, పంటలు లేనందున రైతులకు నష్టం ఈ జాప్యంవల్ల అపారనష్టం కలిగింది.

ప్రభుత్వమువారు యిచ్చిన Second Five Year plan లో కూడ కొన్ని లెక్కలుచూస్తే నారాయణపురం ఆనకట్ట స్కీముకు 1956-57 లో 255 లక్షలు provide చేసియుంటే, ఖర్చుమాత్రం 3.806 లక్షలు అయినది. అదే విధంగా నాగావళి రైట్ సైడ్ ఛానెల్‌కు 5.84 లక్షలు ఉంటే, 1.926 లక్షలు ఖర్చు అయినది. వేదావతి ఆనకట్ట స్కీముకు 3.130 లక్షలు provide చేసియుంటే 2.49 లక్షలు ఖర్చుఅయినది. ఈ లెక్కలుచూస్తే, పని మంద కొడిగా సాగటానికి కారకులు ఎవరో, పనియొక్క progress మంత్రిగారి నోటీసుకు ఉద్యోగస్థులు తెచ్చినట్లు తోచదు. మంత్రిగారు రిపోర్టు తెప్పిస్తామని చెప్పారు. ఏమయినది తెలియదు. ఈ పని సత్వరంగా చేయించి ప్రభుత్వమునకు రైతులకు నష్టములేకుండా చేయాలని మంత్రిగారిని కోరుతున్నాను. మాది కరువుకాటకాలకు గురైన ప్రదేశం. అటు జయపూర్ సైడ్‌న ఒరిస్సా రాష్ట్రమునకు పోయి ధాన్యం తెచ్చుకునే పరిస్థితి ఉండేది. ఈ సంవత్సరం వర్షాలు లేనందువల్ల మళ్లీ ఆ పరిస్థితి వచ్చేటట్లు కనబడుతుంది. దానికితోడు ఇర్రిగేషన్ పనులలో జాప్యానికి ఎంతో దోహదం చేస్తున్నది. వర్షాలులేక నారుమళ్ళు పోయినట్లు కనబడుతుంది. మాకు ఇదివరకు ప్రభుత్వమువారు తయారుచేసిన రెండు పథకములు సిద్ధముగా యున్నవి. (1) బంటుమొక్క, (2) మామిడిపల్లి. ఈ ఆనకట్టలు కూడ త్వరితంగా శాంక్షన్ చేస్తారని ఆశిస్తున్నాను.

తెలంగాణాకుచెందిన మంత్రులు మా ప్రాంతం ఒకరిద్దరు వచ్చారుగాని జిల్లా హెడ్ క్వార్టర్సుకు వచ్చి కలెక్టరు ఆఫీసు అవీ చూచి, వెళ్ళారు. తాలూకాలకు వచ్చి పర్యటించలేదు. మంత్రులు ప్రతితాలూకా హెడ్‌క్వార్టర్సుకు వచ్చి ముఖ్యమైన ప్రాజెక్టు పరిశీలన చేస్తేనేగాని పనులు సక్రమంగా సాగవు. ఉద్యోగస్థుల జాప్యంవలన ప్రజలకు చాల నష్టం వస్తుందని వినయపూర్వకంగా మనవి చేస్తూ, యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ ఎమ్. కోటిరెడ్డి (మంగళగిరి): అధ్యక్షమహాశయా, మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ మా నియోజకవర్గములోయున్న కొన్ని యిబ్బందులను మనవిచేయదలచుకొన్నాను. మాది కృష్ణకు దక్షిణప్రాంతం, దాదాపు 30 గ్రామాలు కృష్ణ వరదలవల్ల నష్టపడుతున్నాయి. కరకట్ట వేయాలని ఎంతోకాలంనుంచి ఆందోళన చేస్తున్నాము. సీతానగరంనుంచి వైకుంఠపురం గట్టువరకు కట్ట వేయటానికి 26 లక్షల రఫ్ ఎస్టిమేషన్ వేసి పంపారు. తరువాత డిటైల్డ్ ఎస్టిమేటు తయారుచేస్తూ సీతానగరంనుంచి కాకుండ, ఉండవల్లినుంచి వైకుంఠపురంగట్టువరకు తయారుచేశారు. 1½ మైళ్లు మినహాయించి, 14½ మైళ్లవరకు కట్ట వేస్తే చాలునని చెప్పారు. దానివల్ల సాగుభూములే గాక, ఉండవల్లి గ్రామము నీటిప్రమాదమునకు గురిఅవుతుందని గ్రామస్థులు ఆందోళన చేసిన మీదట, రక్షణ కల్పించాలని ఛీఫ్ ఇంజనీరుగారు

వ్రాశారు. దానిమీద యిప్పుడు వేసిన ఎస్టిమేట్సులో గ్రామంచుట్టూ కట్ట వేయమన్నారు. అయితే గ్రామానికి ఒకవైపు కొండ ఉన్నది. కొండమీద వర్షాకాలంలో కురిసే వర్షపునీరు గ్రామంలో నిలవఉండాలే తప్ప బయటకు పోయే అవకాశం లేదు. తూములు పెట్టటానికి వర్షాకాలంలో వరదనీరు వస్తుంది. ఎప్పుడూ ఈ గ్రామము వర్షపు నీటిలో వుండవలసివస్తోంది. యిది అనారోగ్యమునకు కారణమని ఆందోళన చేశారు. పిటిషన్లు చాలాసార్లు పంపించారు. సంజీవరెడ్డిగారు అక్కడకువస్తే స్వయంగా కలుసుకొని చెప్పాము. ఒకలక్ష రూపాయలకు లోపుగా అయ్యేటట్లయితే చేర్పించమని వారుచెప్పారు. ఎస్టిమేట్సు వేస్తున్నారు. అది రాకముందే పూర్వపు ఎస్టిమేషన్ రికమెండ్ చేసి పంపినట్లు తెలుస్తుంది. ఛీఫ్ ఇంజనీరును కలుసుకుంటే "అది శాంక్షన్ కానివ్వండి, తరువాత చూచుకొనవచ్చును" అని చెప్పారు. మళ్లీ పిటిషన్లు, టెలిగ్రామ్సు యిచ్చారు. అక్కడ దాదాపు 20 లక్షలు పెట్టి ఒక వర్కుషాప్ కడుతున్నారు. దానికి కూడా ప్రమాదం కలుగుతుంది. ఇదివరకు మద్రాసు మైన్ కెనాల్ లోకి నీరు దిగుతూయుండేది. దానికి కూడా ప్రమాదం సంభవిస్తుందని ఒక క్రొత్త ప్రపోజలు యిచ్చాము. మొట్టమొదట వేసిన ఎస్టిమేటు ప్రకారం కృష్ణానది ఒడ్డున కట్ట వేయకుండా లోపలకు జరిపి వేస్తే దాదాపు 500 ఎకరాల మాగాణి భూములకు, ఆ గ్రామానికి లాభం కలుగుతుంది. అక్కడ ఒక పంపింగ్ సెట్ ఏర్పాటుచేశారు. 1200 ఎకరాలకు పంపువేసి ఉండవల్లి, తాడేపల్లి గ్రామాలకు నీరు సప్లయిచేస్తున్నారు. 3 లక్షల రూ. లు ఖర్చు పెట్టారు. దానికి కూడ రక్షణ కలుగుతుంది. మొదటి ప్రపోజలుకు అవకాశం ఉంటే, అది తీసుకోవాలి; లేకపోతే మధ్యగా యీ కట్ట అయినా వేయమని ప్రపోజలు పంపాము. సూపరింటెండింగ్ ఇంజనీరు చూచారు. మొట్టమొదటి ప్రపోజలు బాగున్నదని, దానికి **technical objections** వుంటే, ఈ మధ్యకట్ట వేయటం బాగుంటుందని చెప్పారు. ఎస్టిమేట్సు వేశారు, ఏ పరిస్థితిలో ఉన్నదో యింతవరకూ అతీగతీ తెలియుటలేదు. సాధ్యమైనంత త్వరలో పూర్తిచేయాలి.

కృష్ణ వరదలవల్ల ప్రతి సంవత్సరం దక్షిణపువడ్డు కోసుకుపోయి వంద, రెండువందల ఎకరాలు నదిలో కలిసిపోతున్నవి. అవి, ఎకరం రెండువేల కిమ్మతుచేసే భూములు. మా ఒక్క గ్రామంలోనే 180 ఎకరాలు కోసుకు పోయింది. క్రిందటిదఫా అసెంబ్లీలో నేను చెప్పాను. 300 ఎకరాలు వెంకటా పాలెం తాలూకు, కోసుకుపోయింది. రెవిన్యూ మంత్రిగారు వచ్చినప్పుడు తీసుకువెళ్లి చూపించాము. అప్పుడు సూపరింటెండింగ్ ఇంజనీరు వగైరా ఉన్నారు. వారంతా నిలుచొని యుండగానే నీటితో కోసుకుపోయి పెద్దలు, పెడలు పడిపోయింది. రక్షణకు అవకాశం ఉన్నదా అంటే, రెల్లు పెంచి కట్టలు కోసుకుపోకుండా చేయవచ్చునని చెప్పారు. కాని యింతవరకు ఏ విధమైన

చర్యలు తీసుకోనలేదు. Flood bank వేయుటకు ఆలస్యం జరిగినా, తాత్కాలికంగా ఈ భూములు కోసుకుపోకుండా చేయాలని రైతులు మహజర్లు పెట్టారు. పూర్వం ఒడ్డున రెల్లు పెంచి, కట్ట ఎత్తుగా యుంచితే గ్రామాల్లోకి వరద త్వరగా వచ్చేది కాదు. ఇప్పుడు అది కోసుకుపోవుటవల్ల కృష్ణలో నీరు 13 అడుగులు వస్తేనే పల్లపుభూములు మునుగుతున్నాయి. ఇదివరకు 15, 16 అడుగుల నీరు వచ్చినా మునిగేవి కావు. ఈ విలువగలభూములలో బావులకు కరెంటు వగైరా బిగించియున్నవి. ఈ వరదలవల్ల మోటార్సు చెడిపోయి పాడయిపోయినవి. కాబట్టి, దానికైన డబ్బులో కూడా కొంత భరించటానికి సిద్ధంగా ఉన్నామని మహజర్లు పెట్టుకున్నాము. దానికి ఎస్టిమేట్సు తయారై ఒక సంవత్సరమైనా అది కార్యరూపం కానందుకు విచారంగా ఉన్నది. వెంటనే దానిని పూర్తిచేయ వలసినదిగా కోరుతున్నాను. చిన కాకాని, కాజ లిఫ్ట్ ఇరిగేషన్ అని ఒక ప్రయివేటు కంపెనీ ఉన్నది. దానికి లక్ష ముప్పయి వేలు ఖర్చుపెట్టి, సరిగా నడపలేక చివరకు ప్రభుత్వానికి హేండోవర్ చేస్తామని పిటీషన్ పెట్టుకొన్నారు. దానిని సంజీవరెడ్డిగారు కూడా చూశారు. దానిని హేండోవర్ చేసుకొంటాం, ఏమి అభ్యంతరం లేదు, అని చెప్పారు. దానికి కావలసిన ఎగ్రిమెంటు వగైరా వ్రాసి ఇవ్వండి, హేండోవర్ చేసుకొంటాం అన్నారు. తాత్కాలికంగా ఏదో ఆర్డర్సు ఇచ్చి రెండు మూడు సంవత్సరాలనుంచి పనిచేస్తున్నారుగాని, పర్మినెంట్‌గా ఈ ఎగ్రిమెంట్ వ్రాసి ఇవ్వనిది, అది తీసుకోటానికి వీల్లేదని చెప్పారు. ఏడెనిమిది మాసాలక్రిందట ఆ డీడ్ వ్రాసి గవర్నమెంటుకు మంజూరుకోసం పంపించారు. ఇంతవరకు దాని అతీగతీ లేదు. అది ఎక్కడ ఉన్నదో, ఏమైందో కూడ తెలియటం లేదు. "ఇది మీరు మాకు హేండోవర్ చేయలేదు, కాబట్టి పర్మినెంట్‌గా పనులు చేయటానికి వీల్లేదు, డబ్బు ఖర్చుపెట్టటానికి వీల్లేదు" అని చెప్పి అక్కడ పనులు చేయటంలేదు. దానివల్ల రైతులకు నష్టం కలుగుతోంది. దానినిగురించి వెంటనే చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను. మాకు యీ ఫ్లడ్ బేంక్స్ వేసే లోపల, ఆ ఒడ్లు కోసుకుపోకుండా తగినటువంటి రక్షణ ఇవ్వటానికి రెల్లునాటి, బొంగులు వగైరా పాతి కంప వగైరా వేసి ఆ భూమి కోసుకు పోకుండా చేయాలి. పూర్వము ఆవిధంగా చేసేవారు. ఆ భూములన్నింటిని యీ పేదలకు గ్రో మోర్ ఫుడ్ కేంపైన్ క్రింద సాగుచేసుకోటానికి ఇచ్చేసినందు వల్ల వారు రెల్లంతా కోసివేశారు. ఆ భూములు దున్నేస్తే ఒడ్లు అన్నీ విరిగి పడిపోతున్నాయి. అలా కాకుండా వెంటనే తగిన రక్షణ ఇవ్వవలసినదిగా కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

*శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ (అలంపూరు): అధ్యక్షా, గౌరవనీయులైన ఇరిగేషన్ మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండ్లను బలపరుస్తూ నేను కొన్ని ముఖ్యమైన సూచనలు తెలుపుకొనుచున్నాను. మానవులకు, జంతుకోటికి

కూడ ముఖ్యముగ గాలి నీరు అవసరము. గాలికొరకు మనము శ్రమపడనక్కర లేదు. ముఖ్యముగా నీటికొరకు మనము వ్యయము చేసుకోవలసిన అవసరము ఉన్నది. తెలంగాణా ప్రజలు మాన్సూణిపంటపైన ఆధారపడి ఉన్నారు. మంత్రి గారు కొన్ని పెద్దపెద్ద ప్రాజెక్టులపై, మధ్యరకపు ప్రాజెక్టులపై దృష్టిని ప్రసరించారు. కాని పల్లెటూరి ప్రజలపైన, చిన్నచిన్న ఇరిగేషన్, చెరువులు పైన వారి దృష్టి ప్రసరించి, అటువంటి చెరువులు కుంటలు బాగుచేసినట్లయితే అక్కడి రైతులను ఎంతో బాగుచేసినవారు అవుతారు. ముఖ్యముగా మహబూబ్ నగర్ జిల్లాలో కొన్ని చెరువులున్నాయి. ఎక్కువ వర్షముతో అక్కడి అన్ని చెరువులు చాలమట్టుకు తెగిపోయినవి. వాటికి మరమ్మతులేక కొన్ని సంవత్సరముల నుంచి అవి అలాగే రిపేరులో ఉన్నవి. వాటి రిపేరు గవర్నమెంటు దృష్టికి రాలేదు. వీటిని గురించి మేము ప్రభుత్వమువారికి తెలియజేసు కొంటున్నాము. ఇప్పటికి 20 సంవత్సరాల క్రితంనుండి కూడ ఇవి అలాగే పడిఉన్నవి. చెరువులు తెగటంవల్ల నీరు పోవటమేగాక, ఆ వచ్చేనీరంతా పంట పొలాలకు పోయి, పంటలు పొలాలు పాడై పోవటమేగాక, రాకపోకలకు కూడ ఆటంకము ఏర్పడుతున్నది. ప్రభుత్వం తొందరగా చెరువులను రిపేర్ చేయిస్తే, మనము రైతులకు చాలా మేలుచేసినవారము అవుతాము. ఆ రిపేర్ వర్కు అక్కడ ఉన్నటువంటి కూలీలకే ఇస్తే, వారు తొందరగా పనులుచేసి, కుంటలు మొదలైనవి త్రవ్వి అక్కడ అభివృద్ధి జరగటానికి కృషిచేస్తారు. మా ఆలంపూర్‌లో 5, 6 చెరువులున్నాయి. అవికూడా తెగిపోయాయి. రైతులు చాలా బాధపడుతున్నారు. అసలే ఆ ప్రాంతంలో నీరు చాలా కరువు. దానికి తోడు చెరువులు కూడ తెగిపోయాయి. చాలా రోజులనుండి యీ విషయం ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నారు. ఇంతవరకు అవి రిపేరుచేయబడలేదు. ఇప్పటికైన వాటిని తొందరగా రిపేరుచేయించవలసినదిగా ప్రభుత్వానికి దయతో మనవిచేసుకొంటున్నాము. మొదటిపంచవర్ష ప్రణాళికాకాలంలో ఆతాలూకా వారు చాలా ఆశాభంగముచెందారు. ఈ రెండవపంచవర్ష ప్రణాళికాకాలంలో అయినా, నిరాశాపరులు కాకుండా వారు ఫలితాలు పొందేటట్లుగా ప్రభుత్వం వారు చూస్తారని ఆశిస్తున్నాను. ఆంధ్రప్రదేశ్ వచ్చిన లగాయతు తెలంగాణా ప్రాంతం ఎంతో అభివృద్ధిలోకి వస్తోంది. ప్రతిదాంట్లోను తెలంగాణా ప్రాంతం ముందంజ వేస్తున్నట్లు తెలుస్తోంది. ఆంధ్రప్రదేశ్ వచ్చిన కొద్ది మాసాల్లోనే మా ఆలంపూర్ ప్రాంతంకు, మా వెనకబడిన తాలూకాకు కొంత విద్యుచ్ఛక్తి ప్రసాదించినారు. అందుకు నేను వారికి కృతజ్ఞతాభివందనాలు అర్పిస్తున్నాను. తాలూకా కేంద్రాలకే కాకుండా చుట్టుప్రక్కల నున్న పల్లెలకు కూడా విద్యుచ్ఛక్తి ఇస్తే, ఆ విద్యుచ్ఛక్తి బావుల కొరకు సప్లయిచేస్తే, కొంతవరకు వ్యవసాయదారులకు సదుపాయంగా ఉంటుంది. మా తాలూకా చాలా వెనుకబడిన తాలూకా. దారి కూడా ఏమాత్రం సరిగా లేకుండాఉన్నది. ఎలక్షన్

క్రైములో మంత్రిగారు వచ్చారు. అక్కడి ప్రజలకు హామీ ఇచ్చారు. వారు ఇచ్చిన హామీలను తప్పక నెరవేర్చవలసినదిగా మనవిచేస్తున్నాను. ఈ అవకాశం ఇచ్చిన అధ్యక్షులవారికి నా కృతజ్ఞతావందనములు తెలుపుతూ నా ఉపన్యాసము విరమిస్తున్నాను.

*శ్రీ జి. సూర్యనారాయణ (గజపతినగరం-రిజర్వుడు) : అధ్యక్షా, మన రాష్ట్రంలో ఆహారోత్పత్తి ఎక్కువ కావాలని మనము అనుకొంటున్నాము. అయితే యీ అధికాహారోత్పత్తికి మనకు నీరు సరఫరా కావాలి. నీరు సరఫరా ఏవిధంగా అవుతుందో మనము ఆలోచిస్తున్నాము. ఇప్పుడు మనం పెద్ద పెద్ద ప్రాజెక్టులు కట్టటానికి ఆలోచిస్తున్నాము. కొన్ని పెద్దప్రాజెక్టుల నిర్మాణము కూడ జరుగుతున్నది. అయితే పెద్దప్రాజెక్టులవల్ల మనకు ఎంతవరకు ఆహారోత్పత్తి జరుగుతుంది అన్నది మనము దృష్టిలో పెట్టుకోవాలి. ఈనాడు చిన్న చిన్న మైనర్ ఇర్రిగేషన్ స్కీములను వెనక్కునెట్టి, మొదట పెద్ద ప్రాజెక్టులను కట్టటానికి మొదలుపెడుతున్నాము. దీనివల్ల దేశాభివృద్ధి చాలా కుంటుపడుతుందని నేను భావిస్తున్నాను. కారణం ఏమిటంటే, యీ పెద్ద ప్రాజెక్టులకు ఎక్కువ ధనము ఖర్చవుతుందే గాని, దీనివల్ల ఎక్కువ లాభము రాలేదేమోనని భావిస్తున్నాను. చిన్న ప్రాజెక్టులు కట్టిన తక్కువ డబ్బుతో ఎక్కువ ఆదాయాన్ని సంపాదించవచ్చునని నా అభిప్రాయము. విశాఖపట్నం జిల్లా గురించి ఒక విషయం ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చి, నా ఉపన్యాసాన్ని ముగిస్తాను. విశాఖపట్నం జిల్లాలో శృంగవరపుకోట తాలూకాలో గోసాని నది ఉంది. దానిపై గంటికొండప్రాజెక్టు కట్టటానికి ఒక ప్రపోజల్ ప్రభుత్వం దృష్టిలో ఉన్నది. కాని ఒకటి మాత్రం ప్రభుత్వం ఆలోచిస్తున్నట్లు నాకు తెలుస్తున్నది.

విశాఖపట్నంలోని oil refinery కి ఈ నీరు తీసుకుపోయి సరఫరా చేస్తున్నట్టు తెలుస్తున్నది. దీనివల్ల అక్కడ వుండే రైతులకు నీటి సరఫరా యివ్వడానికి అవకాశం ఉండదు. దీనివల్ల రైతులకు చాలా నష్టాలు కలుగుతున్నాయని నేను భావిస్తున్నాను. అదేవిధంగా ఆ తాలూకాలలోనే కడకొండ ప్రాజెక్టు వుంది. అదికూడా estimate అయినట్టు భోగట్టా తెలుస్తున్నది. సాధ్యమైనంత త్వరలో దానిని తయారుచేసి అక్కడ రైతుల ఆహారోత్పత్తికి తోడ్పడాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఇకపోతే గజపతినగరం నియోజకవర్గంలోని ఒక స్కీము విషయం చాలాసార్లు ప్రభుత్వదృష్టికి తెచ్చాను. కాని అది ప్రభుత్వం దృష్టిలో పెట్టుకోలేదు. దీనికి నేను విచారిస్తున్నాను. గజపతినగరం నియోజకవర్గంలో ఆంధ్రదరి జగన్నాథపురం వద్ద dam ను నిర్మించినయెడల 25,000 ఎకరాలభూమి పండడానికి అవకాశం ఉంది. ఇదేకాకుండా ఆ నియోజకవర్గంలోనే లింగాలవలస గెడ్డ చెల్లానిమెట్ట దగ్గర ఒక Reservoir కడితే 10 – 15 గ్రామాలకు నీరు సరఫరా అవుతుంది. ఈ విషయం పదే పదే ప్రభుత్వం దృష్టికి

తీసుకువచ్చినా వారు చర్యతీసుకోనందుకు విచారిస్తున్నాను. ఈవిధంగా చిన్న చిన్న minor irrigation scheme లను త్వరలో తయారుచేసి రాష్ట్రాన్ని అభివృద్ధి లోకి తీసుకురావాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈవిధంగా minor irrigation projects తయారుచేసిననాడే దేశంలో ఆహారోత్పత్తి అధికం కావడానికి అవకాశం ఉంటుంది. దీనివల్ల ప్రభుత్వాదాయం పెరుగుతుంది. అంతేకాని పెద్ద పెద్ద ప్రాజెక్టులవల్ల త్వరత్వరలో దేశంలో ఆహారోత్పత్తి పెరుగదని నేను భావి స్తున్నాను. ఏనాడయితే చిన్నచిన్న minor irrigation project లను మనం తయారుచేసి ఆయా జిల్లాలలోని రైతులకు తోడ్పడతామో అనాడే మన దేశంలో ఆహారం పుష్కలంగా లభిస్తుందనే విషయం మంత్రివర్గంయొక్క దృష్టికి తీసుకువచ్చి విరమిస్తున్నాను.

శ్రీ సి. హెచ్. యస్. ఆర్. వి. పి. మూర్తిరాజు (పెంటపాడు) : అధ్యక్షా, ఆంధ్ర ప్రదేశ్‌లో కొల్లేరు అనే సరస్సు వుంది. ఆ ప్రాంత ప్రజలకు జరిగేటటువంటి అన్యాయంగురించి అనేక సంవత్సరాలనుంచి చెప్పుకోడమేకాని ఏ పనీ జరగడం లేదు. దానినిగురించి 2 కోట్ల రూపాయలు ఖరీదుచేసే స్కీము ఒకదానిని యిది వరకే నేను ప్రభుత్వానికివ్వడం జరిగింది. దానిని విచారణ జరిపిస్తాం అని ప్రస్తుతం ముఖ్యమంత్రిగా వున్నటువంటి శ్రీ సంజీవరెడ్డిగారు విచారణ జరిపించడానికి ప్రయత్నం చేశారు. వారు స్వయంగా చూశారు. మూడు సంవత్సరాలకు వారు ఆ స్కీమును అర్థం చేసుకున్నారు. కాని ఇకముందు అది వ్యర్థంకాకుండా చూస్తారని ఆశిస్తున్నాను. ఈ స్కీమువల్ల ప్రత్యేకంగా కొల్లేరు ప్రాంతాలలో వున్న 2 లక్షల మంది ప్రజానీకానికి వృత్తి ఏర్పడడమే కాకుండా ఆంధ్ర దేశంలో వున్నటువంటి 30 లక్షల ప్రజానీకానికి తిండి సౌకర్యం కలుగ జేస్తుంది. ఇది ఒక ప్రత్యేక పంట పండడమేకాదు. చేపలు పెంచడానికికూడా ఎక్కువ ఉపయోగంగా వుంటుంది. దీనివల్ల 45 లక్షల రూపాయలు ప్రత్యే కంగా చేపలమీద పన్నుద్వారా మన ప్రభుత్వానికి వస్తుందనికూడా యిదివరకే స్కీములో నేను మనవిచేశాను. ఇదేకాదు. కొల్లేరు ముంపువల్ల 60 లక్షల రూపాయల పన్ను నష్టం వస్తున్నది. ఈ స్కీము అమలుజరిపితే సంవత్సరానికి 60 లక్షల రూపాయలు వస్తుంది. అదికాక 40 లక్షల రూపాయలు చేపల మీద పన్నుద్వారా వస్తుంది. మొత్తం ప్రభుత్వానికి దీనివల్ల ఒక కోటి రూపా యలు ఆదాయం రావడమే కాక 30 లక్షల టన్నుల ధాన్యం పంట వస్తుంది. దీనిని అమలుపరచడానికి 2 కోట్ల రూపాయలవుతుందని నా అంచనా. ప్రభుత్వ అంచనాల ప్రకారం ఎక్కువఅయితే కావచ్చు. అయినప్పటికీ యింత తేలి కయిన స్కీము యిప్పటికి మన ఆంధ్రప్రదేశ్‌లో లేదని చెప్పడానికికూడా నేను గర్వపడుతున్నాను. ఇప్పుడు ఒక ఎకరానికి వంద రూపాయలు మనం ఖర్చు పెడితే సుమారు 2 లక్షల 50 వేల ఎకరాలమీద వచ్చే పంట వస్తుంది. దీనిని

ఉపయోగించుకోవడంకోసం సాధ్యమైనటువంటి ప్రయత్నాలన్నీ కూడా ప్రస్తుత ముఖ్యమంత్రిగారయినటువంటి శ్రీ సంజీవరెడ్డిగారు స్వయంగా చేశారు. కాని యింతవరకు బడ్జెటులో అది రాకపోవడానికి చాలా విచారిస్తున్నాను. ఈ పరిస్థితులు యిలా వుండగా పశ్చిమ గోదావరి జిల్లాలో ఎఱ్ఱకాలువ స్కీముగురించి కూడా అనేక పర్యాయాలు చెప్పడం జరిగింది. అందులో పులివాగు స్కీము క్రొత్తది, అందులో 4 dam లు కట్టవలసివుంది. అందులో ఒక dam అయినా ప్రారంభించినందుకు నా సంతోషాన్ని యిందుమూలకంగా తెలియపరచుకుంటున్నాను. ప్రస్తుతం డెల్టాలో వున్నటువంటి మురుగు కాలువలకు కావలసినటువంటి సదుపాయాలు సరిగా జరగడంలేదు. పంటకాలువలకు silt తీయడంలేదు. దానివల్ల వచ్చే నష్టం ఎంతో ప్రభుత్వాని కింకా గ్రహింపునకు రావడంలేదని బాధపడుతున్నాను. దీనికి గాను ప్రత్యేకంగా private కమిటీలను పెట్టి దానికి కావలసిన సౌకర్యాలు చేస్తేతప్ప మనకు కావలసిన పంటరాదు. ఇప్పుడు అధికాహారోత్పత్తి మనం చేసుకోకపోయినట్లయితే దేశానికి వచ్చేనష్టం ప్రభుత్వం గ్రహించిందేగాని ప్రస్తుతం వున్నటువంటి డెల్టాలను ఏవిధంగా ఉపయోగించుకుంటే ఎక్కువ ఆదాయం వస్తుందనేది గ్రహించడం లేదని నేను బాధపడుతున్నాను. ఎందుకంటే, అనేక పర్యాయములు కొల్లేరు ప్రాంతంలో జరిగినటువంటి అన్యాయాలు ప్రభుత్వానికి తెలియపరచుకోవడం జరిగింది. కొల్లేరు ప్రాంతంలో మురుగు ఎక్కువగా వస్తూనే వుంటుంది. ఆ ప్రథమపంటలో మురుగురావటం పంట మురిగిపోవడం భూములన్నీ నష్టపోవడం జరుగుతుంది. దానివల్ల వచ్చేనష్టం ఎంతో తెలుసుకోవడమేగాని ఉపయోగం జరగడంలేదు. అందులో మన నీటిపారుదల ఉద్యోగులు నీరు అవసరం లేనప్పుడు ఎక్కువ వదలిపెడుతుంటారు. కావలసినప్పుడు బిగిస్తూవుంటారు. దానివల్ల రైతులకు భరించలేనంత నష్టం కలుగుతుంది. ముంపు భూములకు ముందుగా నీరు ఇవ్వాలని ఉద్యోగస్థులు అర్థం చేసుకోకుండా ఆఖరున నీరు యివ్వడంవల్ల భూములు మునిగిపోవడంవల్ల, దానివల్ల కలిగే నష్టాన్ని రైతులు పూడ్చుకోలేకుండా వున్నారు. దీనికిగాను అధమపక్షం ప్రథమ పంటలో వచ్చే నష్టాన్ని కూడదీయడానికైనా సరే రెండో పంటలో నీరు ఈయవలసిన బాధ్యత ప్రభుత్వముమీద వున్నప్పటికీ కూడా వారు సరైనటువంటి చర్యలు తీసుకోకపోవడంవల్ల వచ్చే నష్టం అక్కడున్న ప్రజలకుగాని అర్థంకాదు. డెల్టాలో, అందులో గోదావరి, మహానది ప్రవహించే ప్రాంతాలలో వేసవికాలం లోమంచి నీళ్ళులేకుండా బాధపడుతున్నారు అనేది ప్రభుత్వాని కెన్నోసార్లు మనవి చేసినప్పటికీ సరైన చర్యలు తీసుకోలేదంటే, దానిని గురించి నేను చాలా బాధపడుతున్నాను. అనేక పర్యాయాలు ప్రత్యేక D. O. ల ద్వారా ప్రభుత్వానికి వ్రాశాను. వాటివల్ల ఉపయోగం యేమీ జరుగలేదు. గత సంవత్సరం, యీ సంవత్సరం కూడా కాలువలు మూసినతరువాత నీళ్ళులేకపోతే దాన్ని గురించి

'వెంటనే action తీసుకోవాలని' వ్రాయడం జరిగింది. అయినా మంచినీళ్ళు రాలేదు. దైవికంగా భగవంతుడు సహాయపడ్డాడేతప్ప ఉద్యోగులుగాని ప్రభుత్వం గాని సహాయపడలేదు. డెల్టాప్రాంతంలో పల్లపు ప్రాంతం అయిన కొల్లేరులో మంచినీళ్ళు లేవంటే, దాని గురించి సరైన చర్యలు తీసుకోలేదంటే ఏమనుకోవాలో నాకు అర్థంకాలేదు. అందుచేత 'మావల్ల కాలేదంటే' మనం ప్రజలలో ఎందుకూ పనికిరాకపోతాం. ఈ పరిస్థితులను ఏవిధంగా దాటాలనేది అర్థంకాలేదు. ఇప్పటికైనా ప్రభుత్వం, అందులో నీటిపారుదల మంత్రులు, తప్పకుండా శ్రద్ధతీసుకుని అధమపక్షం మంచినీళ్ళయినా ముందు ఇస్తే బాగుంటుంది. మునిగిపోయిన భూములకు రెండోపంటకు నీరును సరఫరా చేసే టటువంటి విధానం ఆరంభిస్తారని ఆశిస్తున్నాను. తరువాత ఈ సంవత్సరం ఉప్పుటేరు స్కీము తప్పకుండా తీసుకొంటారని ఆశించాను. కాని ఈ సంవత్సరం కూడా తీసుకోలేదు.

భీమవరం తాలూకాలో కలువపూడికి కావలిసిన ఒక స్కీమును తయారు చేశారు. దానికై రు. 1,77,000లు ఎస్టిమేటు వేసారు. ఐతే అంతా ఖర్చుచేసినట్లు కనిపించడంలేదు, ఎస్టిమేట్లు అన్నీ అమలుజరగడంలేదు. డెల్టాలో జరుగుతుండే విధానం చూస్తే ఒక్కొక్క పద్దు క్రింద డబ్బు కేటాయించినట్లే కనిపిస్తోంది కాని ఖర్చుకాకుండా ఉంటోంది. ఎందుకు ఖర్చుకాలేదు అని అడిగితే డెల్టాలో ఎక్కువగా మరమ్మతుల క్రింద ఖర్చుచేయడానికి వీలులేదని ఉద్యోగస్థులు చెపుతుంటారు. వారు ఇలా చెప్పడానికి కారణం తెలియదు. ప్రభుత్వం శ్రద్ధ తీసుకొని అన్ని కాలువలలోని silt ను తీయించడం అవసరం. అధికారులు వెళ్లి సరిగా supervise చేయకపోవడంవల్ల వచ్చే నష్టం కట్టే ప్రాజెక్టుల మీద వచ్చే లాభం కంటె ఎక్కువగా కనిపిస్తోంది. డెల్టాలో ఉన్న బాధను తొలగించడం కోసము పూర్తిగా ఉద్యోగులమీద ఆధారపడకుండా అనధికార సభ్యులను కూడా వేసి, వారి సహాయ సహకారాలతో కావలసిన సదుపాయాలు చేస్తారని ఆశిస్తున్నాను. ఈ కార్యక్రమాల నిమిత్తమై అనేక లక్షల రూపాయిలను ఇదివరకు ఖర్చుపెడుతుండేవారు. 'పంచవర్ష ప్రణాళిక వచ్చినతరువాత ఆయ కట్టులో ఉన్న భూముల సదుపాయాల విషయం చూడడం మాని క్రొత్త ప్రాజెక్టులను కడుతున్నారు. దీనివల్ల ఆయకట్టులోఉన్న ప్రాంతానికే గోదావరి నీరు సరిగా అందడంలేదు. దీనివల్ల వచ్చే నష్టం కూడదీయలేని నష్టంగా కనిపిస్తోంది. మరొక సదుపాయం చేయించే విషయమై శ్రీ సంజీవరెడ్డిగారికి ఇదివరలో సూచించియున్నాను. Localisation చేస్తే డెల్టాలో ఉండే సమస్యలు చాలా పోతాయి. Localisation జరిగి సుమారు 28 సంవత్సరాలైనది. ఇపుడు Localisation చేయిస్తే రెండు పంటలు పండే ప్రాంతానికి, ఇదివరకు ముంపు ప్రాంతానికి సరిఅయిన సదుపాయాలుచేయడానికి వీలుఉంటుంది అని చెప్పాను.

దీనిని గురించి శ్రద్ధ తీసుకుంటారని ఆశిస్తున్నాను. కొల్లేటి మురుగు కాలువలకు మరమ్మతులు చేయించడమే కాకుండా వాటికి regulators కట్టి అందులో navigation కు లాకులు కట్టి పడవలు పంపితే కొల్లేటిలోని రెండవ పంటకు పనికివచ్చే భూములకు రెగ్యులేటరుల ద్వారా ఎక్కువ నీరును నిలువవేసి భూములకు అందిస్తే సంవత్సరంలో 50, 60 వేల ఎకరాలకు రెండవ పంటకు నీరును కష్టంలేకుండా సప్లయిచేయవచ్చును. ఈ రెగ్యులేటర్ల వల్ల పడవలు నడవడం, భూములకు నీరు రావడంకూడా జరుగుతుంది. లాకులు ఏర్పాటుచేస్తే ఎక్కువ వీలున్నది. కొల్లేటిలో రెండవపంట పండినతరువాత అధికంగా వర్షాలు కురిస్తే ఎకరానికి 20బస్తాలుపండినా ఒకబస్తాకూడా ఇంటికిరాదు. ఆ ధాన్యాన్ని తీసుకురావడానికి మోసుకువచ్చేవానికి ఒకబస్తాఇస్తే పండించినవానికి ఒక బస్తా మిగులుతుంది. అంత ఖర్చుచేస్తేనేకాని ధాన్యం రావడానికి సౌకర్యంలేదు. పశు గ్రాసముకూడా రావడానికి సౌకర్యము లేదు. పడవలు వెళ్ళడానికి కాలువలు వేయవలసిఉంది. పండినపంట సకాలంలో తీసుకురావడానికి వీలులేదు. కాబట్టి వర్షాలు కురిసేవరకు కొల్లేటిలో దిమ్మలు వేయిస్తే వాటిమీద పురులు కట్టుకొని ధాన్యం తెచ్చుకోడానికి వీలుఉంటుంది. తగిన navigation ఏర్పాట్లు చేయాలి. 10 సంవత్సరాలకంటె కొల్లేటి భూములు పండవు. తరువాత కావలిసిన ఎరువులు, మట్టి తీసుకురావడానికి మార్గాలు లేవు. పడవలమీద వర్షాకాలం తీసుకువెళ్ళడానికి మాత్రమే వీలుఉంటుంది. రెండవ పంటకు ఊడ్పుసమయమున కొల్లేటిలో నీరు ఉన్నపుడు ఆనీరు బైటకువెళ్ళకుండా ఆటంకం ఉండడంవల్ల రెండవ పంట ఆలస్యంగా సాగుఅవుతుంది. రైతులు భూములకు అడ్డగట్లువేసి వ్యవసాయం చేస్తున్నారు. దారిని ఉప్పుటేరులోనికి మార్చడంకోసం కాలువలు ఏర్పరచవలసిన బాధ్యత ఉన్నది. కావలసిన వెడల్పులో రైతులకు రెండవ పంట ఊడ్పుకు ఆటంకాలు లేకుండా P.W.D. వారు కాలువలు వేయవలసిఉంటుంది. అపుడు కొల్లేటిలో రెండవ పంట పండడానికి వీలున్నది. ఏప్రిలు నెలాఖరుకు గోదావరిలోని నీరు తగ్గిపోతుంది. ఈ సౌకర్యంకోసం short crop వేసుకోవలసి ఉంటుంది. ముందే సాగుచేయాలంటే మునిగిపోయే భూమి ఉన్నది. దానికి గట్లువేసి ఉంటాయి. P. W. D. వారు కొల్లేటి నీరు పొంగితే మురికి కాలువల్లో నీరు వెళ్ళదుకాబట్టి మురికికాలువలు అవసరం లేదని చెబుతారు. దీనివల్ల ఎంత నష్టంవస్తున్నదో ఆలోచిస్తే, అందులో మురుకి కాలువలకు అయే ఖర్చు ఎన్నవవంతుకూడా కాదు. దీనిని ప్రత్యేకంగా ఇంజనీర్లకు స్వయంగా చూపించినా ఉపయోగం కనిపించలేదు. ఇప్పటికైనా కొల్లేటి ప్రాంతానికి సంబంధించిన శాసన సభ్యులనుకాని ఇతర అనధికారులనుకాని ఇంజనీర్లతోకలిపి investigate చేయించి లోపలికి కాలువలు తీయించి తగిన సౌకర్యాలు చేయిస్తారని ఆశిస్తూ నీటిపారుదలశాఖ మంత్రిగారిడిమాండును బలపరుస్తున్నాను.

*శ్రీ సి. సుబ్బారాయుడు (తాడిపర్తి) : అధ్యక్షా, ఈ నీటి పారుదల డిమాండును నేను బలపరుస్తున్నాను. అయితే కొన్ని విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచుకున్నాను. భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోను నీటి వనరులకు సంబంధించినంతవరకు ప్రకృతి అనుకూలతవల్ల ఆంధ్రప్రదేశ్ అదృష్ట వంతమైన రాష్ట్రమని చెప్పవచ్చును. ఆ నీటివల్ల పొందవలసిన సదుపాయములకు చాలా ఖర్చుపెట్టవలసిన అవసరం ఉన్నది. ఉత్తరోత్తరా కొన్ని సంవత్స రాలలోనైనా భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌కు నీటిపారుదల సౌకర్యం ఎక్కువగా ఉంటుందనేది నిర్వివాదమైన విషయం. 1951 వ సంవత్సరంలో కృష్ణా, గోదావరి నదులు పారుతున్న రాష్ట్రాలు ఆ నీటిపంపకాన్ని గురించి ఒక ఒడంబడికను చేసుకున్నాయి. అప్పట్లో మద్రాసురాష్ట్రం, హైదరాబాద్, బొంబాయి, మైసూరు రాష్ట్రాలు పంపిణీ ఒడంబడికను చేసుకున్నాయి. ఇందులో ఆంధ్రప్రదేశ్‌కు— పూర్వపు హైదరాబాద్ రాష్ట్రానికి— కృష్ణా, గోదావరీ నదీజలాల కేటాయింపులో— ఎన్నవవంతు అనే విషయం ఇంకా మాకు తెలియలేదు. బహుశా ఆ పరిష్కారం ఇంకా కాలేదేమో అని అను కుంటున్నాను. ఈ సందర్భంలో ఒక్కవిషయం మాత్రం ప్రభుత్వదృష్టికి తీసుకు రావలసిన అవసరం ఉన్నదని నేను భావిస్తున్నాను. తుంగభద్రా నీటి విషయం గురించి ఎగువకాలువ వాడకాన్ని గురించి మైసూరు రాష్ట్రంతో పరిష్కారం చేసుకునే సందర్భంలో ఆంధ్రప్రాంతానికి మాత్రం అనుకున్నదానికన్న, న్యాయంగా పొందవలసినదానికన్న చాలా తక్కువ వాటా వచ్చిందనేది నిర్వి వాదమైన విషయం. ఈ పరిష్కార ఫలితంగా ఆంధ్రప్రాంతానికి 65%, మైసూరు రాష్ట్రానికి 35% రావడం తటస్థించినది. ఇది మన పొరపాటు అని చెప్పకతప్పదు. ఏదో ఉద్దేశంతో నేను అంటున్నది కాదు. ఎగువకాలువను తొందరగా సాధించవలెననే ఉద్దేశంతో పరిశీలన పూర్తి కాకుండానే ప్లానింగు కమిషన్ వారికి స్కీమును పంపిన నేరానికి ఇంకా పారుదల ఎంతో కావలసిన ప్రాంత్యములు, ముఖ్యముగా పూర్వపు మద్రాసురాష్ట్రంలో వర్షపాతం తక్కువ అయిన ప్రాంతములు, ఈ ఎగువ కాలువగుండా పారుదలకావడానికి అవకాశం ఉన్న ప్రాంతాలను మినహాయించడం జరిగింది. ఇతర నీటివనరులు లేని మొత్తం ప్రాంతాన్ని ఎగువకాలువ (commandable area) దామాషాలో మనం పరిష్కారం చేసుకుని ఉన్నట్లయితే 80% కన్న ఎక్కువగానే మనకు వచ్చిఉండేది. దురదృష్టవశాత్తు అది జరగని కారణం చేతనే 65 వంతులు రావడం జరిగింది. జరిగిపోయినదానిని గురించి చింతించవలసిన అవసరంలేదు. కాని జరిగిన అనుభవాన్నిబట్టి మనం కృష్ణ, గోదావరి నదుల వాటాలవిషయంలో జాగ్రత్త వహించవలసిఉంటుంది. తుంగభద్ర నీటి విషయంలో నేను చెప్పదలచు కున్నాను. పూర్వపు హైదరాబాదు రాష్ట్రానికి సంబంధించినంతవరకు తుంగ భద్రనుంచి ఎడమవైపునుంచి 7000 క్యూసెక్కుల కాలువ త్రవ్వబడింది.

అప్పుడు అది వాళ్ళ రిస్కు పైనే త్రవ్వబడింది. నీటి వాడకం గురించి పూర్తిగా పరిష్కారం కాకపోయినా, ఎవరెవరు ఎంత వాడుకోవాలనే ఎగ్రిమెంటు పూర్తి కాకపోయినా ఆ కాల్వ త్రవ్వబడింది. ఇందులో మనకు (అంటే తెలంగాణాకు) రావలసిన వాటా ఎంత, కృష్ణనుండి రావలసిన వాటా ఎంత. అప్పర్ కృష్ణా ప్రాజెక్టు గురించి ప్రపోజల్స్ వున్నాయి. భీమా ప్రాజెక్టు గురించి ప్రపోజల్స్ వున్నాయి. మనకు రావలసిన వాటా గురించి ఒక నిర్ణీతమైన **basis** ను **adopt** చేసేటప్పుడు జాగరూకతతో వుండవలసిన అవసరం వుంది. ముఖ్యంగా తుంగభద్రలో మనకు వుండే వాటా చాలా తక్కువగా వుంది. నీరు పారుదల కాని ప్రాంతములను నిరంతరము క్షామానికి గురిఅయ్యే ప్రాంతములను కోట్ల రూపాయలు ఖర్చుపెట్టవలసిన ప్రాంతములను కరువు బాధలనుండి తప్పించటానికి తుంగభద్ర నీటిని సద్వినియోగపర్చవచ్చును. ప్రతి ఒక్క క్యూబిక్ ఫుట్ వాటర్‌ను విలువైనదిగా భావించి, వాటా గురించి ప్రభుత్వం జాగరూకతతో వుండవలసిన అవసరముందని మనవిచేస్తున్నాను.

ఎగువ కాలవ విషయం మరొకమారు ప్రభుత్వదృష్టికి తీసుకవస్తున్నాను. పారుదలయ్యే ప్రాంతాలను కొన్నిటిని ఈ ఎగువ కాల్వనుండి మినహాయించారు. అది ఉద్దేశ్యపూర్వకంగా చేశారనే నేరం ప్రభుత్వంమీద మోపటం లేదు. ఇప్పటికి 4,000 క్యూసెక్స్ లైను కెనాలుగా పెడుతున్నారు. మనకు ఆ కాలువ ఎక్కువ సదుపాయముగా పొందాలంటే డామ్‌సైట్ దగ్గర మన వాటా నీటిలో దిగువ కాలవకు కావలసిన నీరు మినహాయించిన, మిగులు నీరు ఎగువ కాలువలగుండా పంపవలెను. ఆ ఎగువ కాలువ 4 వేల క్యూసిక్కుల నీరును మినిమమ్ డ్రా చేస్తుంది. తిరువలయ్యంగారు రిపోర్టు ఏమి, మెకంజి రిపోర్టు ఏమి, పరమేశ్వరపిళ్ళె రిపోర్టు ఏమి, ఇవన్నీ తుంగభద్ర రిజర్వాయరు నాల్గు మాసాలు సంపూర్ణంగా నిండినా పొర్లి పారుతుందనే విషయాన్ని ఉద్ఘాటిస్తాయి. కనుక ఇప్పటికైనా ఆ 4 వేల క్యూసిక్కులకు బదులు అది 5 వేలు చేయాలి. చివరకు **unlined** గా 4000 **cusecs** చేసినట్లయితే లయినింగ్ చేసిన 6000 **cusecs** డ్రా చేస్తుంది. 4 మాసాలు **complete** గా రిజర్వాయర్ నిండి నీరు క్రిందకుపారిపోయే సమయంలో, వీలున్నంతవరకు ఎగువకాలువలగుండా పంపి, మిడ్ పెన్నారు ప్రాజెక్టు దగ్గర అవసరమైతే చిన్న డాము కట్టి అందునుంచి యింకా మినహాయించపడిన ప్రాంతాలకు సదుపాయం కల్గించినట్లయితే కోట్లకొలది రూపాయలు యికమీద ఖర్చుపెట్టవలసిన అవసరంలేదు. అందువల్ల మద్రాసు కోస్తాపైకి వర్షపాతం తక్కువగా వుండే ప్రాంత్యములు, పెన్నార్‌కు ఉత్తర ప్రాంతముగా వుండే తాడిపర్తి జమ్మలమడుగు తాలూకాలలోని, యాడికి వగైరా ప్రాంతాలలో 50,000 ఎకరాలకు పారుదల చేయించటానికి, **50% intensity** ప్రకారం

అవకాశం వుంటుంది. దానికి దమ్మిడీ ఖర్చుపెట్టవలసిన అవసరంలేదు. పెన్నార్ నార్త్ కెనాల్ కు ఇప్పుడు 86 మైళ్ళు investigate చేశారు. నాకు తెలిసినంతవరకు ప్లాన్ ప్రకారం మొదటి నార్త్ కెనాల్ ఎగ్జిక్యూషన్ కు తీసుకోబడుతోంది. ఈ కాలువవల్ల మినహాయింపబడిన ప్రాంతాలకు పారుదల కావటానికి అవకాశ ముంటుందా లేదా? నిజమా? అబద్ధమా అని investigate చేయాలి. ఈవిషయం మేము రిప్రజెంట్ చేశాము. అది ఏమైనదో మాకు తెలియదు. పారుదల కావటానికి అవకాశాలు వున్నట్లైతే తప్పనిసరిగా చేయించాలి. దిగువ వుండే గండికోటను feed చేయడంఅనేది కడపవాళ్లకు నీరు ఎగ్గొట్టమనే ఇంకో ఉద్దేశంతో చెప్పడంలేదు. సిద్దేశ్వరంకాని, ఇంకో ప్రాజెక్టునుండికాని వారికి పారుదల చేయించటానికి అవకాశముంటుంది. ఇదికాక మెయిన్ కెనాల్ కెపాసిటి పెంచినట్లయితే ఇబ్బందిలేకుండా అందరుసదుపాయంపొందటానికిఅవకాశముంటుంది. 8 ఏండ్ల ఎగ్జిక్యూషన్ కు ప్లాన్ వేసినట్లు నేను విన్నాను. న్యాయముగా 8 ఏండ్లు అవసరంలేదు. అందులో 4, 5 సంవత్సరాలలో నాగార్జునసాగరం నుండి నీటి సదుపాయంపొందే అవకాశం వుంది. 4, 5 సంవత్సరాల్లో ఎగువకాల్వ మెయిన్ కాలువను పూర్తిచేసినట్లయితే పైన వుండేవాళ్ళం ఉపయోగించకపోయినా చివరి దశలో వుండే నెల్లూరు మిత్రులు వుపయోగించవచ్చును. వీలైతే కావలి కనుపూరు కాల్వను త్రవ్వినట్లయితే ఎగువకాల్వ ఆయకట్టు డెవలప్ అయ్యేంతవరకు, ఈ నెల్లూరువాండ్లు సదుపాయం పొందటానికి అవకాశము వుంటుంది. యింతలోపుగా ఆయకట్టును డెవలప్ చేయవచ్చు. నందికొండనుండి, కావలి, కనుపూరు కాల్వనుండి feed చేయటానికి అవకాశం ఏర్పడుతుంది కనుక దీనిని పరిశీలించవలసిందిగా మనవిచేస్తున్నాను. హైదరాబాద్ సైడున రాజోలిబండ కెనాలు త్రవ్వారు. తిరువలయ్యంగారి రిపోర్టు ప్రకారం ఆంధ్రసైడ్ నుండి investigate చేశారు. ఇంటర్ మిడియట్ కాచ్ మెంటునుండి, ఈ డామ్ సైట్ నుండి రాజోలిబండకు వచ్చే నీరు వృధాకాకుండా, మైసూరు ప్రభుత్వాన్ని కోరి, వాణివిలాస్ సరస్సువద్ద పెద్ద రిజర్వాయరుకట్టి హైలెవెల్ స్లుయిస్ పెట్టి నీటిని వృధాపోనీయకుండా ఉపయోగించుకోవచ్చు. అది నిజమో అబద్ధమో నాకు తెలియదు. కె. సి. కెనాలును రిమోడల్ చేయవలసిందని సెంట్రల్ ప్రభుత్వానికి నచ్చచెప్పితే, వాణి విలాస్ లోవుండే నీటివల్ల కూడా మనకు సదుపాయాలు కలుగుతాయని వారు చెప్పినట్లు విన్నాను. అది వారు చెప్పివుంటే సంతోషము. రాజోలుబండ కెనాలును పరిశీలించి, అది చేసినట్లయితే రాజోలిబండకుకాని, ఇటు కె. సి. కెనాలుకుకాని నీరు ఉంటుంది. అంతేకాకుండా తుంగభద్ర ఎగువ కాలవకు ఇంటర్ మిడియట్ కాచ్ మెంటు water ను పంపించటానికి అవకాశం ఏర్పడుతుంది. దీనిని గురించి ఆలోచనచేయాలని మనవిచేస్తున్నాను.

ఇకపోతే K. C. Canal విషయములో, దానికి re-modelling అవసరమనే అభిప్రాయము గలవాణ్ణే. అంతే కాలవను త్రవ్వి, లైనింగుకూడ చేసినప్పటికినీ, దానివల్ల ప్రయోజనములేదని కాదు. మనకు కొద్దిపాటిది అయినా తుంగభద్ర నీరు ఉన్నది. వీలుఅయినంత ఎక్కువ నీరు ఆ కాలవద్వారా పంపించినట్లయితే మంచిదే. సిద్దేశ్వరము ప్రాజెక్టునుగురించి, కృష్ణా పెన్నారు ప్రాజెక్టును గురించి ఆనాడు investigation జరిపించారు. ఖోస్లాకమిటీ రిపోర్టు ప్రకారము చూస్తే, యీ సిద్ధేశ్వరము ప్రాజెక్టు రెండవ దశలోనే పూర్తిచేస్తే సస్యశ్యామలంగా నీరువచ్చి, రాయలసీమ అభివృద్ధిచెందుతుంది. ఒక్క రాయలసీమే కాకుండా నెల్లూరుజిల్లాలోని దక్షిణప్రాంతము అంతయు సంపూర్ణముగా నీటివనరులు ఏర్పడుతాయి గనుక, సిద్ధేశ్వరము ప్రాజెక్టు అవసరమనేవారు చెప్పారు. సిద్ధేశ్వరము ప్రాజెక్టు కట్టబోయే సమయములో మనము K. C. Canal ను re-model చేయడము అనవసరమని నేను ఆనాడు చెప్పాను. గత రెండు సంవత్సరాలుగా K. C. Canal లో cement lining చేసిన సందర్భములో ప్రజలు అనేకవిధములుగ అపోహలు పడుతున్నారు. Cement lining చేస్తే, అది నిష్ప్రయోజనమని నేను అనను గాని, అదిచేసినంతవరకు చేసినఖర్చుకు తగినంత పని జరగలేదన్న అపోహ ప్రజలలో ప్రబలముగా ఉన్నది. దీనికి దృష్టాంతముగ కండ్లార చూచినవారే అనుకుంటున్నారన్న సంగతి ప్రభుత్వము గుర్తించాలి. సిమెంటు ఎంతో మిగుల్చుకున్నారని చాలమట్టుకు నిదర్శనమని చెబుతున్నారు. మా జిల్లోలో లారీలమీద సిమెంటు వస్తూంటేకూడ, దానికి ఉండే రేటుకంటే అధికరేట్లకు అమ్ముకోవడము జరిగింది. దానివల్ల proper supervision లేకుండా పోయిందని తెలుస్తున్నది. గతములో ఎప్పుడో ఎవరో ఇంజనీర్లు అది examine చేసి, దాని edges కు cement lining చేసినను అది నిలవదని అభిప్రాయమిచ్చారట. పైగా దానికి చేసినంతవరకు proper checking కూడ జరగలేదని అన్నారని మనవిచేస్తున్నాను. కాబట్టి నా అభిప్రాయము యిప్పటివరకు చేసిన పని వృథా అని. అందులో wastage చాలా ఉన్నదని తెలుతున్నది. ఇక యీ canal ద్వారా సంపూర్ణమైన ప్రయోజనము పొందాలని యిప్పటినుంచి complete గా localization కూడ చేస్తున్నారు. Field channels కూడ త్రవ్వడము జరుగుతున్నది. అయితే రేపు ప్రొద్దున మనకు సిద్ధేశ్వరము ప్రాజెక్టు వచ్చేటట్లయితే, దానివల్ల submerge అయ్యే ప్రాంతములోకూడా యిప్పుడు irrigation canals ద్వారా నీరు అందజేస్తూంటే, ఉత్తరోత్తరా, యీ పని అంతా వృథాయేనని, మనవిచేస్తున్నాను. దీనివల్ల నష్టపడడము నిశ్చయము గనుక యిది ప్రభుత్వము తీవ్రంగా ఆలోచించమని అంటున్నాను. ఈ K. C. Canal ద్వారా పంపించే నీరు ఏ ఏ ప్రాంతాలలో, ఏ ఏ సర్వే నెంబర్లుగల భూములకు, ఏ ఏ canals ద్వారా నీరు పారుదల అవుతుందనే విషయము రైతులకు తెలియజేస్తే, వారు ఆయా భూములను త్వరలో బాగుచేసుకోటానికి

అవకాశము ఏర్పడుతుంది. దానిని గురించి ప్రభుత్వము చర్యతీసుకోవలసిన అవసరమున్నది. తీసుకుంటారని ఆశిస్తున్నాను.

ఇకపోతే services ను గురించి ఒక్క విషయము మనవిచేస్తున్నాను. ఈమధ్య Highways Department నుండి కొంతమంది నాన్‌గజెటెడ్ ఆఫీసర్లను Irrigation Department కు మార్చడము వల్ల వారికి promotions రావడము కూడ జరిగింది. ఇందులో జూనియర్లుగా ఉన్నవారికి ప్రమోషను దొరకటము జరిగింది. Irrigation Department కు సంబంధించినంతమట్టుకు ఇది చాలా అపోహలకు, అలజడికి కారణమయింది అనే విషయము నేను ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. Highways Department లో వారు, బహుశ మొన్న మొన్న నే కాలేజీలనుంచి వచ్చి కొత్తగా సర్వీసులోచేరి, అక్కడ ఏదో కొద్దికాలం పనిచేసిన వారు, యిప్పుడు ఇరిగేషనుడిపార్టుమెంటుకు తీసుకునిరాబడ్డారు. వారు అక్కడ Highways Department లో కొత్తగా చేరినవారు. అనుభవము సంపాదించిన వారుకాదు. అలాంటివారిని యిప్పుడు Irrigation Department లోకి తీసుకుని వచ్చి పై ఉద్యోగాలలో ప్రమోషను మీద వేయడమువల్ల యిక్కడ వాస్తవ ముగా ఎప్పటినుంచో కష్టపడి పనిచేసి, మంచి అనుభవము ఉన్నవారియొక్క claims ignore చేసి, వారిపైన వేయడము నిజముగా affected party కి దుర్గ గానే ఉంటుంది. ఆ విధముగా చేస్తే వారు నిరుత్సాహముచెందడమే కాకుండా, ప్రభుత్వము విమర్శలకు గూడ గురికావలసివస్తుంది. ఆవిధముగ promotions ఎందువల్ల యిచ్చారో గాని, సర్వీసులో ఉండేవారికి మాబోటివారు సమాధా నము చెప్పడమంటే చాలా కష్టతరముగానే ఉంటున్నది. అలాంటిపద్ధతి యిప్పటి కైనా మాన్పించాలని, ప్రభుత్వము యీ విషయములో దర్యాప్తుచేసి, తగు చర్య తీసుకోవాలని కోరుతున్నాను. అది సరియైన పద్ధతిలో చేస్తే సర్వీసులో ఉన్నవారికి క్రమమైన seniority ప్రకారము ప్రమోషన్సు యివ్వడము న్యాయము. ఉత్సాహముతో పనిచేస్తారు.

ఇక భైరవానితిప్ప ప్రాజెక్టు విషయము చూస్తే యిప్పటివరకు దీనిని గురించి చేసిన investigation ప్రకారము సుమారు ఆరువేల ఎకరాలకు నీరు పారుదల అవుతుందన్న ఉద్దేశ్యముతో ఏదో పని ప్రారంభించి చేస్తున్నారు. అయితే యింకా ఎక్కువభూమికి నీరు పారుదలచేయించటానికి అవకాశమున్న దని నేను అభిప్రాయపడుతున్నాను. నేను technical man కాదనుకోండి. అయినను ప్రభుత్వము దీన్ని గురించి ఆలోచించాలని మనవిచేస్తున్నాను. ఎందు కంటే పైనున్న వాణివిలాస్‌వారు తీసుకున్న run-off కు, దిగువ నున్న Engineers తీసుకున్న run-off కు సంబంధము ఏమీ లేదు. దానికిపైగా చేయ టానికి అవకాశమున్నదనుకుంటాను. ఈ విషయము ప్రభుత్వము పరిశీలించి, దీనికి ఎంతవరకు అవకాశమున్నదో అంతవరకు, అవసరమైతే carry over

reservoir ను ఒకదానిని ఏర్పాటుచేసి, ప్రజలకు యింకా ఎక్కువ ప్రయోజనము ఉంటుందేమో పరిశీలించమని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఈరోజున యీ డిమాండుమీద మాట్లాడటానికి నాకు అవకాశమిచ్చినందులకు అధ్యక్షులవారికి నాకృతజ్ఞత తెలియజేస్తూ యింతటితో సెలవుతీసుకుంటున్నాను.

శ్రీ యస్. కాశిరెడ్డి : అధ్యక్షా, మన దేశములో ప్రస్తుతము ఆహార సమస్య కేంద్ర ప్రభుత్వాన్ని, రాష్ట్ర ప్రభుత్వాలను, ప్రజలను చాలా ఆందోళన పరిచే సమస్యగా పరిణమించింది. ఈ సమస్య పరిష్కారము చేయటానికి రాష్ట్రములలో ఉన్నటువంటి నీటివనరులను అన్నింటినీ ఉపయోగించి, నీటివనరులు లేనటువంటి ప్రదేశములలోకి ప్రవహింపజేస్తే, యీ సమస్యకు పరిష్కారము సాధ్యమవుతుంది. అందువల్లనే ప్రథమ పంచవర్ష ప్రణాళికలో నీటివనరులు బాగుచేయటానికి కొంత కృషి జరిగినందువల్ల సుమారు 7 లక్షల ఎకరాల భూమిని అటు ఆంధ్రలోనూ, ఇటు తెలంగాణలోనూ సాగులోనికి తీసుకుని రావటము జరిగింది. అయితే దీనివల్ల యిప్పటికి ఆంధ్రలో 18%, ఇక్కడ తెలంగాణలో 10%, మాత్రమే నీటిపారుదల జరిగిందని చెప్పవచ్చు. ఇంకను లక్షల కొలది ఎకరాలభూమి, అంటే దాదాపు 80%పైగా నీటి పారుదల చేయటానికి అవసరమున్నది. గోదావరి, కృష్ణ నదుల నీటిని ఉపయోగించినట్లయితే, యీ భూమినంతయు కూడ, సాగులోనికి తీసుకునిరావటానికి వీలుఉన్నది. ఇప్పటి వరకు జరిగిన కృషి అంతా, గతములో ప్రభుత్వము నిర్మించిన ప్రాజెక్టువల్లనే దృష్టిలో పెట్టుకోవాలి. అదేవిధముగా తుంగభద్ర దిగువ కాలవ విషయములో కొంత అనుభవము ఉన్నది. కాని నీరు ఆ కాలవలోనికి వచ్చినప్పటికి కూడ యింకా కొన్ని వేల ఎకరాలు సాగులోనికి రాకుండా మిగిలిపోయి యున్నది. అందువల్ల మనము ఆ అనుభవమునంతను దృష్టిలో పెట్టుకొని యీ సమస్యను పరిష్కరించుకోటానికి కృషిచేయవలసి ఉంటుంది. నాగార్జునసాగర్ ప్రాజెక్టు విషయము తీసుకుంటే, ఇది ఆంధ్రదేశములో చాలా బ్రహ్మాండమైన ప్రాజెక్టు అని మనకుతెలుసు. ఇటు తెలంగాణలోను, అటుఆంధ్ర ప్రాంతములోను యీ ప్రాజెక్టువల్ల నీరు పారుదల వెనుకబడిన ప్రాంతాలకన్నింటికి జరిగి లక్షల కొలది ఎకరాల భూమి సాగులోనికి రావటానికి అవకాశము ఏర్పడుతున్నది. కేంద్ర ప్రభుత్వము యీ ప్రాజెక్టు నిర్మాణమునకు తోడ్పడుతున్నందులకు చాల సంతోషముగా ఉన్నది. కాని యీ ప్రాజెక్టు పూర్తిఅయి, దీని యొక్క ఫలితము సంపూర్ణముగా అనుభవించటానికి దీని విషయములో కొన్ని చిక్కు సమస్యలను మన ప్రభుత్వము ఎదుర్కొంటున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 32 కోట్ల రూపాయలు మాత్రమే కేటాయించబడింది. Schedule ప్రకారము యీసంవత్సరానికి 8 కోట్లు మాత్రమే రావలసి యున్నప్పటికినీ, 6¼ కోట్లు మాత్రమే కేటాయించడము జరిగినది. అందువల్ల యీ ప్రాజెక్టు నిర్మాణమునకు డబ్బు

సమస్య ఒక కీలక సమస్యగా తయారైంది. అసలు పంచవర్ష ప్రణాళిక ప్రకారముగానే ప్లానింగు కమిషనువారు నిర్ణయించిన ప్రకారమైనను యీప్రాజెక్టు పూర్తి కావటానికి పది పది హేను సంవత్సరాలు పట్టుతుందని అనుకున్నప్పటికినీ, దీన్ని చుట్టుకున్న పరిస్థితులనుబట్టి చూస్తే, యిది ఏ 20 సం. లకో గాని పూర్తి అయ్యేటట్లు కన్పించడములేదు. దీనిని మనము త్వరలో పూర్తి చేసుకోవటానికి మన దేశములో దరిద్రము త్వరలోపోగొట్టుకోటానికి కేంద్రప్రభుత్వముమీద మనము అందరము, ప్రభుత్వముతోసహా, ఒత్తిడిచేసి దీనికి కావలసిన సొమ్మును వారివద్దనుంచి సంపాదించటానికి కృషి చేయాలని అంటున్నాను. అదేవిధము విదేశమారకములు ద్వారా, మనకు 50 లక్షల రూపాయలు schedule rate ప్రకారము యంత్రములు రావలసిఉంటే, దానిని 20 లక్షలకు తగ్గించి యున్నారు. అందువల్ల 20 లక్షలుకాకుండా మనకురావలసిన ప్రకారము యాభై లక్షలకు యంత్రాలు వచ్చేటట్లుగా యీప్రభుత్వము ప్రయత్నించవలసియున్నది. కారణమేమిటంటే మనకు యిక్కడ డాము కట్టేకొద్దీ, కాలవలు త్రవ్వేకొద్దీ, రైతులకు అప్పులు వగైరాలు అన్నీ పరిష్కారము చేయవలసిఉంటుంది. ఈ విషయములో కుడికాలవ సంగతి ఆలోచిస్తే, మొట్టమొదట అనుకున్న ప్రకారము కాకుండా, యీ కాలవను చాలా low levelలోఉండేటట్లుగా కొలతలు వేయడముజరిగింది. దానివల్ల ప్రజలలో, వారికి కావలసిన నీరు లభిస్తుందో లేదోఅని, దీనివల్ల పూర్తిఫలితము దక్కుతుందో, లేదో అని తీవ్రంగా ఆందోళనచెందారు. ఫలితముగా యిప్పుడు ప్రభుత్వమువారు యీ విషయము బాగుగ గమనించి దీనిని High level లోనికి తేవటానికి alignment చేయటానికి కొలతలు వేయడము జరుగుతున్నది. ప్రభుత్వము యీ విషయము గుర్తించినందులకు సంతోషమును ప్రకటించవలసి యున్నది. ప్రభుత్వము యీ కొలతలు వీలుఅయినంత త్వరగా ముగించి, detailed estimates పూర్తిచేయించి, కేంద్ర పవర్ అండ్ ఇరిగేషన్ కమిషన్‌నుంచి వారియొక్క అంగీకారము పొందటానికి కృషిచేయాలి. అంతే కాకుండా మన ఇంజనీర్లలోనూ, ప్రజలలోను కూడ యింకొక అభిప్రాయము కూడ ఉన్నది. ఇప్పుడు కొలిచే కొలతల ప్రకారమే కాకుండా యింకా కొంత పైగా రావటానికి కూడ వీలుంటుందని అభిప్రాయపడుతున్నారు. ప్రభుత్వము దీన్నికూడ గమనించటానికి కృషిచేయాలి. ఎంతవరకు వీలుంటుందో, అంతవరకు చేయమని కోరుతున్నాను. మొదటి దశలో మూసినదివరకే కాలవ నిర్మాణము జరుగుతున్నదని చెప్పబడింది. ఆ విధముగ కాకుండా కాలవలు అన్నింటినీకూడ 176 మైళ్ళ వరకు కూడ ఒకే దశలో జరిగి పూర్తి అయ్యేటట్లు, కృషి చేయవలసిన అవసరము ఉన్నది. ఇదిఅంతా జరగాలంటే మనప్రభుత్వము నిర్వహించడములో కొన్ని చిక్కులు వస్తున్నవి. విదేశ మారకముల విషయములో కూడ యీ చిక్కులన్నీ వస్తున్నవి. అందువల్ల ఈ నందికొండ ప్రాజెక్టు నిర్మాణాన్ని కేంద్రప్రభుత్వమే undertake చేసి పూర్తిచేయడము మంచిదని మన ముఖ్య

మంత్రిగారు సెలవిచ్చారు. ప్రస్తుతము మన ప్రభుత్వము యీ ప్రాజెక్టు నిర్మాణము విషయములో ఎదుర్కొంటున్న చిక్కు సమస్యల దృష్ట్యా, శాసనసభ్యులమైన మనమందరము ప్రభుత్వము ద్వారా కేంద్రప్రభుత్వము మీద ఒత్తిడితెచ్చి యీ ప్రాజెక్టును కేంద్రప్రభుత్వమే undertake చేసి పూర్తి చేసేటట్లు ప్రయత్నించాలని అంటున్నాను. తుంగభద్ర ఎగువకాలవ విషయములో ప్రజలందరుకూడ చాలా ఆందోళన చెందుతున్నారు. అందులో అది త్వరలో పూర్తికావలసిన విషయము. అదేవిధముగ వంశధార ప్రాజెక్టు విషయములో కూడా ఏదో విధముగ ఆలస్యము జరుగుతూనే ఉన్నది. దానికి ఇంత వరకు స్థలనిర్ణయము కానేలేదు. ముఖ్యమంత్రిగారు అక్కడి శాసనసభ్యుల నందరిని సమావేశపరచి వారివారి అభిప్రాయములను తీసుకొని వీలుఅయినంత త్వరలో దానికి స్థలనిర్ణయము చేయడము మంచిదని నా అభిప్రాయము. అదే మాదిరి సోమశిల ప్రాజెక్టు విషయములోకూడ కేంద్రమంత్రిగారు, మనమంత్రి గారు అక్కడికి వెళ్ళి పరిశీలించి వచ్చారు. ఆ ప్రాజెక్టును కట్టిస్తే నెల్లూరుజిల్లా లోని దక్షిణ ప్రాంతములో లక్షలకొలది ఎకరాలభూమి సాగులోనికి వస్తుంది. అలాగే కావలి–కనుపూరుకాలువల విషయములో ప్రభుత్వము త్వరలో తగిన చర్యలు తీసుకోవాలి. మన రాష్ట్రంలో ఉన్న జీవనదులన్నింటిలోకి గోదావరి నది పెద్దది. ఆ నదియొక్క నీటిని మనము తెలంగాణలోనికి పారుదల చేసు కోవచ్చు. మిగిలిన నీటిని అటు మద్రాసు రాష్ట్రములోనికికూడ తరలించటానికి అవకాశములున్నవి. ఆ నదిద్వారా మనకు చాలినంత నీరు లభించగలదు. మన దేశమంతా సస్యశ్యామలముగాఅభివృద్ధికి తెచ్చుకోడానికిఅవకాశములున్నప్పుడు ప్రభుత్వము కేంద్రప్రభుత్వమును ఒత్తిడిచేసి, మనకు కావలసిన నీటివసర్లు ఏర్పాటు చేసుకోవలసిందిగా కోరుచున్నాను. గోదావరినది నీటిని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వము కావాలని కోరుతున్నప్పుడు, తద్వారా మనకుగూడ మరింత నీరు లభించే అవకాశమున్నది గనుక, మద్రాసు ప్రభుత్వము, మన ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వముతో సంప్రదింపులు జరిపించవలసిందిగా కోరుతున్నాను.

Minor Irrigation ప్రాజెక్టుల విషయంలో ప్రభుత్వం అశ్రద్ధచేస్తోందనే చెప్పాల్సి ఉంటుంది. ఇవి చాల ప్రధానమైనవని మనకు తెలుసు. వీటిని వెంటనే సాగులోకి తీసుకురావలసిన అవసరం ఉన్నది. కాని, వీటి విషయంలో చాల ఆలస్యంచేయడం జరుగుతోంది. ఉదాహరణకు మా ప్రాంతంలో 5, 6 సంవత్స రములనుంచి ఆందోళన చేస్తున్నటువంటి పనులుఉన్నాయి, మేకలేరు ప్రాజెక్టు, ముసి ఇలాంటివి. 5, 6 సంవత్సరాలనుంచి సంవత్సరానికి ఒకటివంతున ఒక్కక్కొత్త చెరువునో, చిన్నచిన్న ప్రాజెక్టులనో చేయడానికి ప్రభుత్వం పూనుకోలేదంటే, అది చాల విచారకరమైనటువంటి విషయం.

ఈనాములకు సంబంధించినటువంటి చెరువుల మరమ్మతుల విషయంలో చాల ఆలస్యం జరుగుతోంది. వీటికికూడా సక్రమంగా, చాల త్వరలో నీటి పారుదల చేయవలసిన అవసరం ఉన్నది. చట్టాలలో చిక్కులుఉంటే ఆ చిక్కులను తొలగించడానికి emergent గా సవరణలుతీసుకురావలసిఉంటుంది. ఉదాహరణకు వెలిగండ్ల అనే చెరువు పోయినసంవత్సరం అతివృష్టివల్ల తెగిపోయిఉంటే దానిని త్వరగా repair చేయాలని ప్రభుత్వ దృష్టికి తీసుకొస్తే, ఇంతవరకుకూడా దానికి జవాబు రాలేదు. వీటన్నింటి విషయంలో ప్రభుత్వం తగినటువంటి శ్రద్ధ తీసుకోవాలి.

కృష్ణా, గోదావరి, వంశధారా, తుంగభద్ర నదులవల్ల సదుపాయాలు లేనటువంటి ప్రాంతాలకు ఈ Minor Irrigation Schemes ఎక్కువ ఉపయోగ పడతాయి. అందువల్ల వీటినికూడా దృష్టిలో పెట్టుకోవాలి. తెలంగాణాలో ఉన్నవే చాలతక్కువ. ఉన్నటువంటి మూసి, కడం మొదలైన వాటినికూడా అమలులోకి తీసుకురావడానికి ప్రభుత్వం వీలైనంత సత్వరచర్యలు తీసుకొనేందుకు కృషిచేయాలి.

ప్రాజెక్టుల నిర్మాణ విషయంలో ప్రజా సహకారం చాల తక్కువగా వస్తున్నది. అన్ని పార్టీలకు సంబంధించిన M.L.A. లు, ఇతర ప్రజాసంఘాలు వీళ్ళందరితో కలిపి ఒక కమిటీని వేసి ఎప్పటికప్పుడు ప్రజా సహకారాన్ని సమీకరించేందుకు తగినటువంటి చర్యలు ప్రభుత్వం తీసుకోవాలని చెపుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు) : అధ్యక్షా, ఈ demand ను నేను హృదయపూర్వకంగా బలపరుస్తూ కొన్ని విషయాలు తమ ద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. నేను ఇప్పటికి సుమారు 5, 6 budget లు చూశాను. మద్రాసులోను, కర్నూలులోను అనేకపర్యాయాలు నా సూచనలు ప్రభుత్వంవారికి అందచేశాను. ఇంతవరకుకూడా అవి జరగలేదు. మా area కు సంబంధించినంతవరకు వంశధారా ప్రాజెక్టు కడుతున్నందుకు పూజ్యులైన శ్రీ సంజీవరెడ్డిగారికి నా హృదయపూర్వక వందనములు సమర్పిస్తున్నాను. వంశధారా ప్రాజెక్టు కట్టినట్లయితే మా తాలూకాలో 60 గ్రామాలు మునిగి పోతాయి. అలా మునిగిపోకుండా కట్టమని ప్రజలు, మేము ముఖ్యమంత్రిగారికి చాల పర్యాయములు మనవిచేసుకొన్నాము. ఆ విధంగా చేయిస్తారనికూడా ఆశిస్తున్నాము. గొట్టపల్లి రిజర్వాయర్, బత్తిలిగెడ్డ అనేది చిన్నగడ్డ పాతపట్నం తాలూకాలో ఉన్నది. దాని విషయమై అనేక దఫాలు ప్రభుత్వదృష్టికి తీసుకు వచ్చాము. అది కట్టాలని రెండవ పంచవర్ష ప్రణాళిక పుస్తకాలలో కూడా ఉన్నది. ఈ budget లో దాని విషయమై కనీసం 10 వేల రూపాయలైన

మినహాయించలేదు. అది వెనకబడిపోతుందేమోననే నిరుత్సాహం కూడా కలుగుతున్నది. Supplementary budget లో నైన కొంత డబ్బు కేటాయించి దాని పని ఈ సంవత్సరమే జరిగేటట్లు చూడవలసిందని ప్రభుత్వంవారిని కోరుతున్నాను.

అదేవిధంగా బత్తిలిగడ్డకు కూడా 2, 3 లక్షల రూపాయలలో పని పూర్తి అవుతుంది. ఆ scheme కూడా Government వారి proposals లో ఉన్నది. బత్తిలిగడ్డ ఆనకట్ట కట్టినట్లయితే 5, 6 గ్రామాలలో రెండుపంటలు పండడానికి అవకాశం కలుగుతుంది. అలాంటి చిన్న స్కీములను పూర్తిచేయించి, ఆ తాలూకా ప్రజలయొక్క కష్టాలనుతీర్చాలని ప్రభుత్వంవారిని ప్రార్థిస్తున్నాను.

పర్లాకిమిడి మహారాజాగారి time లో పెద్దపెద్ద చెరువులు తీయించారు. అలాంటివి కనీసం 50చెరువులన్నా ఉంటాయి. పొత్తూరుదగ్గర బగ్గసాగరం అనే చెరువు ఉన్నది. దాని విషయమై రెండేళ్ల నుంచి ప్రజలు, మేము ప్రభుత్వానికి దరఖాస్తులు పెట్టుకొంటున్నాము, ఇంతవరకు ఆ చెరువు మరమ్మత్తుకాలేదు. రంగసాగరం అనే పెద్దసాగరం సారవకోట దగ్గర ఉన్నది. దానికి కూడా ఒక గండిపడినది. ఆ గండి రెండేళ్ల నుంచి కప్పలేదు. అనేక దఫాలు అక్కడి స్థానిక అధికారులకు మనవిచేశాము. దరఖాస్తు కూడా ఇచ్చాము. ఇంతవరకు పనిచేయలేదు అధికాహారోత్పత్తి చేయడమే ప్రభుత్వంయొక్క విధానంగా పెట్టుకొన్నారు. దానికిగాను 30, 40 లక్షలవరకు అక్కడక్కడ ఇచ్చినట్లు ఈ budget లో ఉన్నది. మా జిల్లాకు కూడా గతసంవత్సరంనుంచి జరుగుతున్నటువంటి పనులకు మాత్రమే ఇచ్చినట్లు ఉన్నది. క్రొత్తగా దరఖాస్తులు పెట్టుకొన్నటువంటి పనులు ఏవి కూడా ఈ budget లో లేవనే నా విచారం. మా తాలూకాలలో 200 చెరువులు ఉన్నాయి. ఇదేవిధంగా అన్ని తాలుకాలలోను చెరువులు ఎక్కువగానే ఉన్నాయి. 2, 3 లక్షల రూపాయలు ఖర్చుపెట్టి ఆ చెరువులను బాగుచేసినట్లయితే రైతులు ఉత్సాహంగా రెండు పంటలు పండించి అధికాహారోత్పత్తికి తోడ్పడగలరని మనవి చేస్తున్నాను.

Estate తాలూకాలలో ఉన్నటువంటి చెరువులు 2 సంవత్సరములనుంచి కళ్లములు గంతలు వేసినప్పటికి కూడా ఇంతవరకు బాగుచేయించలేదని స్థానిక రెవిన్యూ అధికారులకు అనేక దఫాలు చెప్పాము. చెప్పినప్పటికి కూడా ఆ పనులు ఇంతవరకు జరగలేదు. జరగకపోయినందున పంట పండించాలంటే చాల కష్టంగా ఉంటోంది. ఇలాంటివి ఎన్నో ప్రభుత్వ దృష్టికి తెచ్చాము. వెంటనే ఆ పనులన్నీ జరిగేటట్లు చేయవలసిందని ప్రార్థిస్తున్నాను. పార్వతీపురం తాలూకాలో జంఝూవతి అనే నది చాల ముఖ్యమైనటువంటిది. ఆ నదికి అలమండ, వ్యాపవలస దగ్గర reservior కట్టమని ఎంతో కాలంనుంచి అడుగుతున్నాము.

అది కూడా ఈ రెండో పంచవర్ష ప్రణాళికలో చేర్చబడి ఉన్నది. దానికి కొంచెం మొత్తమయినా ప్రభుత్వం కేటాయించలేదు. అది పార్వతీపురం తాలూకాకు సంబంధించిన పెద్ద జీవనది. ఆ నదికి ఆనకట్ట కట్టినట్లయితే ఆ తాలూకాలోని సుమారు 50 వేల ఎకరాల భూమిలో 2, 3 పంటలు పండటానికి అన్ని విధాల అవకాశం కలుగుతుంది. ఆ ప్రాంతంలోని చెరువులకు, చిన్న నదులకు కట్టలు కట్టకపోయినందువల్ల ధరలు హెచ్చుగా పెరిగిపోయి బీద ప్రజానీకానికి అనేకమైన ఇబ్బందులు కలుగుతున్నాయి. బత్తిలిగడ్డ, వరహాలగడ్డ స్కీములకు 60 వేల రూపాయలు గవర్నమెంటు ఖర్చుచేసినట్లయితే సుమారు 3 వేల ఎకరాల భూమి సాగుకువస్తుంది. ఆ 3 వేల ఎకరాలలోను రెండు పంటలు పండించేందుకు అవకాశం కలుగుతుంది. అవి చాలకాలంనుంచి P. W. D. లో pending గా ఉన్నవి. ఇంతవరకు ప్రభుత్వంవారు ఆ పనికూడా చేయలేదు. ఇప్పుడు budget లో కూడా ఏమిలేదు. మధుపాం అనే గడ్డపై కట్ట నిర్మించే విషయం 10 ఏళ్ళనుంచి చూస్తున్నాము. 15 వేల రూపాయలు ఖర్చుపెట్టినట్లయితే 5 గ్రామాలకు 30 చెరువులకు ఆ నీరు పోతుందని estimate లో ఉన్నది. అదికూడా ఇంతవరకు చేయలేదు. లచ్చరాజుగడ్డ, పేటగడ్డ అని పార్వతీపురం తాలూకాలో ఒక గడ్డ ఉన్నది. దానికి 20 వేల రూపాయలు estimate అయి కూడా ఇందులో ఒక్క దమ్మిడీ కేటాయించలేదు. అది కట్టినట్లయితే 4, 5 గ్రామాలకు లాభిస్తుంది. ఇలాంటి చిన్నచిన్న నదులు, చెరువులు, వాగులు వెంటనే కట్టించి అధికాహారోత్పత్తికి తోడ్పడి, ప్రజలయొక్క మన్ననను ఈ ప్రభుత్వం పొందుతుందని హృదయపూర్వకంగా నమ్ముతున్నాను. చినబొండపల్లి ఊరచెరువు వరహాలగెడ్డ త్వరలోనే పని ప్రారంభించాలని ప్రార్థిస్తూయున్నాను.

* శ్రీ బి. రామారెడ్డి (మైదుకూరు) : అధ్యక్షా, కేవలం వ్యవసాయానికి ఆధిక్యత ఇచ్చిన మన ఆంధ్రప్రదేశ్‌కు, వ్యవసాయానికి ముఖ్యంగా కావలసిన ఇరిగేషన్ ఖర్చులకు ఇరిగేషన్ మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండులో కేటాయించిన మొత్తం చాలదు, అనే విమర్శతో, సలహాతో నేను ఈ డిమాండును ఆమోదిస్తున్నాను. అయితే ఇంతకుముందు మాట్లాడిన మిత్రులు కొందరు దాని అవశ్యకతను పూర్తిగా అంగీకరిస్తూ, ఈ డిమాండును ఆమోదించడం సబబుకాదు అన్నారు. ఇది నాకు చాలా విచిత్రంగా తోచింది. అతిథి వచ్చినప్పుడు భోజనం పెట్టితే "నాకు ఇదిచాలదు. కాబట్టి నేను తినడం లేదు" అన్నట్లుగా ఉన్నది. 'నాకు ఇది చాలదు, మరికొంచెం అన్నంపెట్టు' అని అడగాలిగాని, 'నాకు ఆకలి చల్లారడం లేదు, కాబట్టి నాకు అన్నమే వద్దు' అన్నట్లుగా ఉన్నది ఈ విమర్శ. ఇటువంటి విచిత్ర ప్రవృత్తికి నాకు చాలామారులు ఆశ్చర్యం కలుగుతూంటుంది. P. W. D. మరి ఇంకా ఇతర డిపార్టుమెంటుల డిమాండులపై

చాలా రోజులనుంచీ జరుగుతున్న చర్చలలో లంచగొండితనం గురించి పదేపదే విమర్శిస్తూ వచ్చారు. అది నొసటివ్రాత. తప్పదు.

లంచగొండితనం అనేది మానవజాతిలో పుట్టినటువంటి అంటువ్యాధి. ఈ అంటువ్యాధికి ఒక మందున్నది. అటుపైన, ఇటుక్రింద నా అనేవారులేకుండా త్రిశంకుస్వర్గంలో అల్లలాడుతున్న మధ్యతరగతి ప్రజానీకమంతా ఎప్పుడైతే కట్టుదిట్టంగా పనిచేస్తారో ఆనాడే ఈ రోగానికి మందు కుదురుతుంది. ఆదర్శాల వల్ల, ఉపన్యాసాలవల్ల ఏమీ లాభంలేదు. ఆదర్శాలవల్ల, ఉపన్యాసాలవల్ల, ఆకలి మంటలు చల్లారవు. అవి కేవలం **platforms** కు మాత్రమే ఉపయోగిస్తాయని నేను మనవిచేస్తున్నాను. ఆహారపదార్థాల ధరలు ఎక్కువగా పెరిగిపోతున్నాయని చాలమంది అంటున్నారు. ఇవి రైతులకష్టం ఏమాత్రం తెలియని వారి ఆక్రందనలు. అధికాహారోత్పత్తికి ముఖ్యమైనవి నీటివనరులు. నీటివనరులు కల్పించాలంటే చెరువులు త్రవ్వించాలి. అవి సద్యఃఫలితాలు ఇచ్చేవిగా ఉండాలి. సద్యఃఫలితాలిచ్చేవి మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులు మాత్రమే. ఇప్పుడు మన ప్రభుత్వంవారు పెద్దపెద్ద ప్రాజెక్టులను కట్టడానికి ప్రయత్నం చేస్తున్నారు. అవి 10 సం॥ లకో, 15 సం॥ లకో ఫలితాన్నివ్వవచ్చు. కాని ఈ లోపల ప్రజానీకం మాడి చావవలసిన పరిస్థితి ఉన్నది. ఈ డిమాండులో ఒక్కొక్క జిల్లాలోని ఇర్రిగేషన్ ప్రాజెక్టులకు 3 లక్షలు కేటాయించినట్లున్నది. అంటే ఒక్కొక్క తాలూకాకు 30 వేలు అవుతుందన్నమాట. ఆ 30 వేలతోనూ మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులు కట్టగలమని చెప్పడానికి వీలులేకుండా ఉన్నది. ఇవన్నీ విమర్శనగా చెప్పాలంటే నా నియోజకవర్గంలో, బద్వేలుతాలూకా భాగంలో మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులవలన లాభముంటుంది. కాని మేజరు ప్రాజెక్టులు రావడానికి వీలులేదు. తక్కువఖర్చుతో ఎక్కువమంది బీద ప్రజానీకానికి లాభదాయకంగా ఉంటుంది. మడేరు, తళుకువాగు ప్రాజెక్టులను గురించి మేము అనేక సంవత్సరాలనుంచి చెబుతున్నాము. తళుకువాగు ప్రాజెక్టు కట్టినట్లయితే, 4 లక్షల ఖర్చుతో 2 వేల ఎకరాల భూమి సాగు అవడమే కాకుండా వెనుకబడిన 10 గ్రామాలు బాగుపడడానికి అవకాశం ఉంటుంది. అటువంటి అవకాశం ఉన్నప్పటికిన్నీ, దానికి ఇప్పటికింకా **detailed investigation** అయ్యేభాగ్యం లేకపోయినందుకు విచారం కల్గుతున్నది. మడేలు ప్రాజెక్టువల్ల రెండులక్షల ఖర్చుతో దాదాపు 8 గ్రామాలలోని భూమి సాగులవుతుంది. మడేలు ప్రాజెక్టువల్ల **direct** గా ఆదాయం రావడమేకాకుండా, **indirect** గా అనేకమైన లాభాలున్నాయి. మడేలు ప్రాజెక్టుకు సంబంధించిన ప్రాంతంలో ఎక్కువగా బావులపైన ఆధారపడిన భూములున్నాయి. ఈ ప్రాజెక్టు కట్టినట్లయితే బావులన్నింటికీ నీరు వచ్చే అవకాశం ఉన్నది. దానివల్ల **direct, indirect advantages** రెండూ ఉంటాయి.

కాబట్టి దానిని మొట్టమొదట ఆచరణలోనికి తీసుకోవాలని మంత్రిగారిని కోరుతున్నాను.

ఇందాక సర్కారుజిల్లా సోదరసభ్యుడు మాట్లాడుతూ "రాయలసీమ వారు చాల కొద్దిమంది ఉన్నారు, మేము జాస్తిగా ఉన్నాము, కాబట్టి మాకు ఎక్కువ అవకాశాలను కల్పించాలి" అన్నారు. రాయలసీమవారు తక్కువగా ఉండటానికి కారణమేమిటో వారు ఊహించి నట్లయితే, ఈ విమర్శ చేసిఉండరనుకొంటాను. అక్కడ కావలసిన అవకాశాలు, సదుపాయాలు లేకపోవడంమూలాన తక్కువగా ఉన్నారు. "మా ప్రాంతాల నన్నింటినీ రావణాసురుడు శూర్పణకు శరణంగా యిచ్చాడ"ని మా పెద్దలు చెబుతూండేవారు. అంటే మంత్రులకు నివాస యోగ్యం కాదని అర్థం. అటువంటి అరణ్య ప్రాంతంలో ఉన్నటువంటి మాకు సౌకర్యాలు లేనందువల్ల జనాభా తక్కువేగాని, కావలసిన సౌకర్యాలన్నీ కల్గజేసినట్లయితే కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాలతో సమానంగా వచ్చే అవకాశాలున్నాయి. కాబట్టి మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులు త్వరగా కట్టించేందుకు మంత్రిగారు శ్రద్ధ వహించాలని కోరుతున్నాను. పెద్ద ప్రాజెక్టులు కట్టవద్దని నేను చెప్పను, కాని మనం అధికాహారోత్పత్తిని సాధించాలంటే సద్యఃఫలితాలు యిచ్చే ప్రాజెక్టులు కావాలి. మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులు సద్యఃఫలితాలనిస్తాయనే విషయం నేను వేరే చెప్పవలసిన పనిలేదు. ఈ విషయాన్ని మంత్రిగారు గమనించి మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టులను అడవి ప్రాంతాలలో, బద్వేలు తాలూకావంటి ప్రాంతాలలో కట్టించినట్లయితే, అక్కడి ప్రజలకు సహాయం చేసినవారై ఆ ప్రజానీకం యొక్క ఆదరణను, అభిమానాన్ని పొందగలరని విశ్వసిస్తూ నేను శలవు తీసికొంటున్నాను.

* **శ్రీ బి. సుబ్బారావు (బూరుగుపూడి - రిజర్వుడు)** : అధ్యక్షా, నేను ఈ డిమాండును బలపరుస్తూ నా నియోజక వర్గానికి సంబంధించిన కొన్ని విషయాలను ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. రాజమండ్రి తాలూకాలోని తొర్రిగడ్డ పంపింగ్ స్కీము ఏ సంవత్సరాని కాసంవత్సరమే వస్తుందని 5,6 సం॥ల నుంచి అక్కడి రైతులంతా నిరీక్షిస్తున్నారు. కాని అదిఅమలు చేయకపోవడంమూలాన వారు చాలా నిరుత్సాహపడుతున్నారు. అది 35 గ్రామాలకు సంబంధించిన స్కీము. ఈ స్కీమువలన 20 వేల ఎకరాలభూమి అదనంగా సాగు అవుతుంది. అదనంగా 8 వేల టన్నుల ధాన్యం పండుతుంది. దీనికి సంబంధించిన **estimates, plans** అన్నీ ఇంజనీరులు తయారుచేసి ప్రభుత్వానికి పంపడం జరిగింది. కాని 5,6 సం॥ ల నుంచి రైతులు ఎదురుచూడడం, పనులు జరుగక పోవడం జరుగుతున్నది. గత సంవత్సరం ఇప్పటి మన ముఖ్య మంత్రిగారైన శ్రీ సంజీవరెడ్డిగారు, కళా వెంకటరావుగారు రాజమండ్రి తాలూకా వచ్చి

నపుడు ఆ స్కీమును గత సంవత్సరమే తప్పకుండా అమలు జరుపుతామని హామీ యిచ్చారు. వారు అట్లా చెప్పడంవల్ల ఈ స్కీము తొందరలో వస్తుందని రైతులంతా సంతోషించారు. కాని అది గత సంవత్సరం అమలు జరుగకపోవడంతో ప్రజలంతా చాలా నిరుత్సాహపడ్డారు. ఈ సంవత్సరం బడ్జట్‌లో కూడా దానిని తీసికొన్నట్లుగా కనిపించుటలేదు. ఆ తొర్రిగడ్డ పంపింగ్ స్కీము, చాలా ముఖ్యమైనది, స్వల్పమైనది. మంత్రిగారు వాగ్దానం చేసినప్రకారం తప్పనిసరిగా ఈ సంవత్సరమైనా దానిని అమలు చేయుటకు తగిన చర్యలు తీసుకుంటారని ఆశిస్తున్నాను. రాజమండ్రి తాలూకాలోనే కడియం, ఆవా పంపింగ్ స్కీము అని ఇంకొక చిన్న స్కీము ఉన్నది. దానివల్ల అదనంగా 1,000 ఎకరాలభూమి సాగు అవుతుంది. ఇది లక్ష రూపాయల స్కీము, చాలా స్వల్పమైనటువంటిది. దీని విషయమైకూడా **Superintending Engineer** గారు **plans, estimates** తయారు చేశారు. అవి ప్రభుత్వానికి పంపించడం జరిగింది. నేను ఈ రెండు స్కీముల విషయమై అసెంబ్లీలో అనేకసార్లు మనవి చేస్తున్నాను. కాని యింతవరకూ ప్రభుత్వం ఏ విధమైన చర్యలూ తీసుకోలేదు. అక్కడవుండే రైతులు 50% **contribution** ఇవ్వడానికి కూడా సిద్ధంగా ఉన్నారు. ఈ విధంగా రైతులు **agreement** వ్రాసి ఇవ్వడం కూడా జరిగింది. రాజమండ్రి తాలూకాకు సంబంధించిన తొర్రిగడ్డ పంపింగ్ స్కీము, కడియం, ఆవా పంపింగ్ స్కీము కూడా ప్రభుత్వంవారు త్వరలో అమలు చేస్తారని ఆశిస్తున్నాను.

రాజమండ్రిలో జిల్లాకోర్టుకు వెనకవైపుఉన్న గోదావరిగట్టు కొన్ని గజాలు పూర్తిగా పోయింది. గత వరదల్లో అక్కడ గండిపడి రాజమండ్రి అంతా మునిగిపోవడం జరిగింది. ఇప్పటికీ అదంతా చాలా **low level** లో వున్నది. ఏమాత్రం వరదలు వచ్చినా ఆ జిల్లాకోర్టు వెనుకవున్న గట్టు సరిగా లేనిచోట నీరు **town** లోకి ప్రవేశించి మొత్తం ముంచేయడం జరుగుతున్నది. అందువలన ఆ జిల్లాకోర్టు వెనుకఉన్న గట్టును ఎత్తుగా వేయించి తగిన కట్టుదిట్టాలు చేయగలందులకు ప్రభుత్వాన్ని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

శ్రీ పి. రంగారెడ్డి (గిద్దలూరు) : **Mr. Speaker Sir,** ఈ **demand** చాలా ముఖ్యమైనది అవడంవల్ల చాలామంది సభ్యులు తమతమ అభిప్రాయాలు తెలపాలనుకుంటున్నారు, అందుచేత ఈ **discussion** 2 గం. ల వరకు కొనసాగించినట్లయితే బాగుంటుంది అనుకుంటున్నాను. 1-30 గం. ల వరకు చర్చ జరిపి ఆ తరువాత మంత్రిగారు జవాబుచెబితే చాలామంది సభ్యులకు అవకాశం కలుగుతుంది, కనుక దీన్ని మీరు అంగీకరించి, ఆ విధంగా చేస్తారని ఆశిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : అది గౌ. మంత్రిగారి యిష్టం.

ముఖ్యమంత్రి (శ్రీ ఎన్. సంజీవరెడ్డి): ఇవాళ ఒక గంట ఎక్కువ తీసుకుందాం, 25 వ తేదీన ఒక గంట తక్కువ తీసుకుంటే సరిపోతుంది. ఆ విధంగా చేద్దాం.

శ్రీ యన్. రామచంద్రారెడ్డి (డోర్నకల్): అధ్యక్షా, నీటి పారుదల శాఖామాత్యులు ప్రవేశపెట్టిన Demand ను బలపరుస్తూ తమద్వారా కొన్ని సూచనలు చేయదలచుకున్నాను.

మనది పూర్తిగా వ్యవసాయ దేశం. వ్యవసాయం అభివృద్ధి చెందాలంటే, నీటి పారుదల సౌకర్యాలు చాలా ముఖ్యం. ఆ సౌకర్యాన్ని తీర్చడానికి ఈ బడ్జెట్‌లో కొంతవరకు ప్రయత్నించారుగాని, తెలంగాణాప్రాంతం మాత్రం ఈ విషయంలో చాలావరకు వెనుకబడియున్నది. సరియైన సౌకర్యాలు ఏర్పరిచేందుకు ఏ ratio అయితే maintain చేస్తాం అన్నారో, ఆ ratio ప్రకారంగా ఈనాడు పనులు చేయడంలేదని నేనభిప్రాయపడుచున్నాను. కనుక ఈ శాఖ మంత్రిగారు తీసుకొనిరావలసిన ఈ మార్పుల గురించి తిరిగి యోచించగలరని భావిస్తున్నాను.

Natural resources మనకేమీ తక్కువలేవు. పుణ్యనదులు మన ప్రాంతములో చాలా ఉన్నవి. అయితే వాటిని ఉపయోగములోకి ఏ రీతిగా తీసుకురావాలనేది మాత్రం ముఖ్యమైనది. మద్రాసు రాష్ట్రానికి గోదావరి నీటిని తీసుకుపోవాలని కొంత ప్రయత్నం జరుగుతున్నట్లు తెలుస్తున్నది. ఆ నీరు మదరాసురాష్ట్రానికి పోకపూర్వమే మనరాష్ట్రంలో దానిని ఏ రీతిగా ఉపయోగించవలసిందీ ముందే యోచించవలసి యున్నది. ప్రస్తుతం మనం రెండు ప్రాజెక్టులను గోదావరిపైన కట్టుకొనవలసి యున్నది. అది పోచంపాడు వద్ద ఒకటి, ఇచ్చంపల్లి వద్ద మరొకటి. ఈ రెండు project లను కట్టుకున్న తరువాత ఆ నీటిని మద్రాసురాష్ట్రానికి పోనిస్తే బాగుంటుందని నేను వారికి సలహాయిస్తున్నాను. మొట్టమొదట పోచంపాడు ప్రాజెక్టుప్రాంతమంతా సర్వే చేయించి, తక్కిన కార్యక్రమాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో ప్రారంభించేసినట్లయితే, 3 వ పంచవర్ష ప్రణాళిక మొదలుకాగానే దాన్ని పూర్తిగా అమలులోనికి తీసుకరావడానికి కొంతవరకు అవకాశముంటుంది.

ఇక యిచ్చంపల్లి ప్రాజెక్టును కూడా అదేవిధంగా ప్రత్యేకమైన శ్రద్ధతో పూర్తి చేసినట్లయితే 25 లక్షల ఎకరాలలో నీరు పారడానికి అవకాశం ఉంటుందని మనవిచేస్తున్నాను. మిత్రులు శ్రీ అయ్యపురెడ్డిగారు మాట్లాడుతూ సిద్ధేశ్వరం ప్రాజెక్టును నాగార్జునసాగర్ ప్రాజెక్టు అయినతరువాత తీసికోవాలని

అభిప్రాయం తెలిపారు. కాని నేనుమాత్రం వారితో పూర్తిగా ఏకీభ వించడంలేదు. ఎందువల్లనంటే దానివల్ల కొంత నష్టంకూడా ఉంది. కర్నూలు ప్రాంతంలో 180 వేల ఎకరాల సారవంతమైన భూమి మునిగేట్లుగా ఉంది. కనుక ఈ సిద్ధేశ్వరం ప్రాజెక్టు తీసుకొనేముందు యింత సారవంతమైన భూమి మునిగిపోతున్నది కనుక యిటువంటి విషయాలన్నీ ఆలోచించవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

మహబూబ్‌నగర్ విషయంలో శ్రీ అచ్యుతరెడ్డిగారు చెబుతూ అక్కడ minor irrigation projects కావాలని సెలవిచ్చారు. కాని upper Krishna porject, (భీమా ప్రాజెక్టు) ఏదైతే యిదివరకు investigate చేశారో, ఆ ప్రాజె క్టును నిర్మించితే మహబూబ్‌నగర్ జిల్లాకు నీరు రావడానికి అవకాశంఉంటుంది.

ఇక ఈ అభివృద్ధి ప్రణాళికల విషయం మనవిజేస్తాను. తెలంగాణాలో దస్తుబంద్ అని ఉండేది. దస్తుబంద్ అంటే కొంతమంది పట్టేదార్లుకు ఆయా చెరువులు బాగుచేసుకొనడానికి కొంత డబ్బును ప్రభుత్వంకి యిచ్చేది. అవన్నీ వాళ్ళే బాగుచేసుకుంటారు. కాని 7, 8 సం. నుంచి ఆ దస్తుబందును తీసేశారు. ఆడబ్బు మాత్రం ప్రభుత్వం యివ్వడంలేదు. దస్తుబంద్ తీసివేయడమే ఆలోచించారుగాని, ఆ పద్ధతిని తీసివేసినతరువాత ఏ పద్ధతిని ప్రవేశపెట్టి ప్రజలకు సౌకర్యం కలిగించాలనే విషయం మాత్రం ప్రభుత్వము ఆలోచించలేదు. ఈ చెరువులన్నీ యథావిధిగా బాగు అయ్యేందుకు ఈ దస్తుబందు ఎక్కడైతే తీసేశారో అక్కడి చెరువులను ప్రభుత్వమే తీసుకొని maintain చేయాలని నేను కోరుతున్నాను.

ఇక త్రైబంది అనేది ఉన్నది. దానికి నీరు ఏవిధంగా కేటాయించాలనే దానికొరకు నరసంపేట తాలూకా వరంగల్లు జిల్లాల గురించి మనవిజేస్తాను. ఆ ప్రాంతంలో గత సంవత్సరం నీరు లేకపోవడంవలన చాలా యిబ్బందిపడడం జరిగింది. అధికార్లు నీటిని ఏ పద్ధతిప్రకారం సరఫరా చేయవలెనో ఆ విధంగా చేయడంలేదు. లంచగొండితనం విపరీతంగా పెరిగిపోయింది. మంత్రులు ప్రత్యేకమైన శ్రద్ధతీసుకొని ఈ విషయంలో కృషిచేస్తేనే తప్ప లేకపోతే దీని కొక గతీ మోక్షం అంటూ ఉండదు. మంత్రులు Files చూచుకుంటూ యిటువంటివాటిపై తగు చర్యలు తీసుకొనకపోతే ఈ corruption అరికట్ట బడదు. ఇదిగాక వరంగల్లు జిల్లా మానుకోట తాలూకాలో తులారాం ప్రాజెక్టు ఉన్నది. ఆ ప్రాజెక్టు కొరకు అక్కడి ప్రజలు ఎన్నో రోజులనుంచి ఆందోళన చేస్తున్నారు. కాని గతప్రభుత్వంగాని, ఈ ప్రభుత్వంగాని, దానిని గమనించినట్లు కనబడడంలేదు. అందువల్ల ఆ ప్రాజెక్టుపై ప్రత్యేక శ్రద్ధ తీసుకోవలసిందని మనవి చేస్తున్నాను.

ఇవిగాక మధ్యరకం యిరిగేషన్ ప్రాజెక్టులు ఈ ప్రాంతంలో చాలా

అవసరమై ఉన్నవి. చిన్నచిన్న నదులన్నిటినీ ఉపయోగంలోకి తీసుకరావడానికి వెంటనే తగు చర్యలు ప్రభుత్వం తీసుకుంటుందని భావిస్తున్నాను.

మానుకోటతాలూకాలో పెద్దిరెడ్డి చెరువు అనేది ఉన్నది. దానిని బాగు చేయించడానికి ప్రభుత్వం ఒకస్కీమును శాంక్షన్‌చేసి దానిని ఒక కంట్రాక్టరుకు ఇచ్చారు. ఆ కంట్రాక్టరు పని సరిగా చేయకపోవడమువల్ల వాష్‌అవుట్ అయి పోయింది. ఇప్పుడు ఆ పనిని తిరిగి తీసుకోడానికి ప్రభుత్వం వెనుకాడుచున్నది. ఇదివరకు కొంతపని జరిగి కొంత డబ్బు ఖర్చయి అంతా వృధాఅయిపోయినందు వల్ల ఇప్పుడు తిరిగి అంతడబ్బూ ఖర్చుపెట్టవలసి ఉండడంవల్లా తిరిగి ఆ పనిని అమలు చేయడానికి ప్రభుత్వం వెనుకాడుచున్నది. మొదట జరిపిన పని ఎందు వల్ల వృధాఅయిపోయినది, ఆ తప్పు ఎవరిది, ఎందువల్ల వాష్‌అవుట్ అయినది అనే విషయాలను ఆలోచించి అందుకు బాధ్యత వహించవలసిన కంట్రాక్టరు వద్దనుంచి ఆడబ్బు తీసుకొని ఆపనిని తిరిగి అమలు చేయవలెనేకాని ఖర్చు ఎక్కువ అవుతుందని దానిని విరమించుకోవడము సరిఅయిన పద్ధతికాదని మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను.

ఇచ్చంపల్లి ప్రాజెక్టు కట్టినతర్వాత గోదావరినీరు రామపాదసాగరు కాలువగుండా విశాఖపట్టణంవరకూ పోతుందని చెబుతున్నారు. ఆ సౌకర్యము లను కల్పించవలెనని మనవిచేస్తున్నాను. ఆలీ నవాజ్ జంగుగారు ఎన్నో ప్రాజెక్టు లను గురించి సర్వే చేయించారు. అటువంటివి ఎన్నో ఉన్నాయి. వాటిని దీర్ఘంగా ఆలోచించి అమలులోనికి తీసుకొని రావాలని కోరుతున్నాను.

1951 వ సంవత్సరంలో ప్లానింగు కమిషన్‌వారు గోదావరి, కృష్ణా నదుల నీటిని ఆయా రాష్ట్రములకు ఒక రేషియోలో పంచిపెట్టారు. బొంబాయి ప్రాంతానికి 20 శాతము, హైదరాబాదుకు 40 శాతము, కాంపోజిట్ మద్రాసుకు 40 శాతము అనే రీతిగా ఏర్పాటుచేశారు. ఐతే ఇప్పుడు మైసూరు గవర్న మెంటువారు హెచ్చు నీటిని తీసుకొనిపోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. దానికి అంగీకరించక వెనుక నిర్ణయించిన విధంగానే మనకురావలసిన నీటి నంతనూ మనమే ఉపయోగించుకొనేటట్లు చూడగోర్తాను. అప్పర్ కృష్ణా, భీమ మొదలైన నదుల విషయంలో మనకు రావలసిన నీటినంతనూ మనము ఉపయోగించుకోటానికి తప్పకుండా ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను.

శ్రీ పి. వి. నరసింహారావు (మంథాని): అధ్యక్షా, యీ అయిదు నిమిషముల కాలంలో నా గ్రామము సంగతికాని, నా నియోజకవర్గము సంగతి కాని చెప్పదలచుకోలేదు. 9 జిల్లాలు ఉన్నటువంటి తెలంగాణా సంగతి నాకు తెలిసినంతవరకూ మనవిచేస్తాను. తెలంగాణాలో 33 వేల చెరువులున్నాయని, ఆ 33 వేల చెరువులలో 10 ఎకరాలకు తక్కువ ఆయకట్టు కలవి 12,438

అనిన్నీ, 10 ఎకరాలనుంచి 200 ఎకరాలవరకూ ఆయకట్టు ఉండేవి 19,580 అనిన్నీ 200 ఎకరములకు పైగా ఆయకట్టు ఉన్నటువంటివి కేవలం 11 వందలేనని ప్రభుత్వంవారు ఇచ్చిన స్టాటిస్టిక్సు మూలమున తెలుస్తున్నది. ఐతే తెలంగాణాలో 14½ లక్షల ఎకరాలకు నీరు పారుదల అవుతున్నదని రివిన్యూవారి లెక్కల ప్రకారము నిజమే అయినప్పటికిన్నీ కేవలం 11 వందల చెర్వులు మాత్రమే నమ్మకంగా నిండి, పొలాలు పండి రైతుకు లాభము సమకూర్చేవిగా ఉన్నవికాని తక్కినవి నాల్గు సారులో, మూడు సారులో నిండితేనేగాని ఒక పంట కూడా పండకుండునటువంటివి అయిఉన్నాయి. కాబట్టి యీ 14 లక్షల పైచిలుకు సంఖ్య అంకెలలో ఉన్నదేకాని నిజముగా అన్ని ఎకరాలకు ఖచ్చితమైన నీటిపారుదల సౌకర్యము ఉన్నదని మనము అనుకోవడానికి వీలులేదు. అందువల్ల ఏ నాల్గయిదు లక్షల ఎకరాలకు మాత్రమే తెలంగాణాలో నమ్మకముగా నీరు పారుదల అవుతున్నదేకాని అంతకన్నా ఎక్కువ భూమికి నమ్మకమైన నీటి సౌకర్యము లేదని మనము తెలుసుకోవచ్చు. ఐతే యీ తెలంగాణాలో గోదావరి, కృష్ణా మొదలయిన పెద్ద నదులు ఉన్నాయి. ఇవేకాక మంజీరా, మానేరూ, కడమ్, పెన్‌గంగా మొదలయిన పెద్ద ఉపనదులుకూడా ఉన్నాయి. తుంగభద్ర, మూసీ, మొదలయిన పెద్ద ఉపనదులుకూడా ఉన్నాయి. యీ తెలంగాణాలో ఉన్న నీటిని నిజముగా ఉపయోగించుకోవాలంటే యీ ఉపనదులలోని నీటినే ఉపయోగించుకోవాలి. మంజీరా నదిపైన నిజాంసాగరు కట్టబడిఉన్నది. మానేరుపైన నర్మాల్ ప్రాజెక్టు కట్టారు. అలాగే కడమ్‌ప్రాజెక్టు కూడా ఉన్నది. ఈవిధంగా ఈ ఉపనదులోని నీరు వినియోగమవుతున్నది. మానేరు నదిపైన లోయరు మానేరు అనేటటువంటి ప్రాజెక్టు నదియొక్క లోయర్ రీచెస్‌లో కట్టవలసిఉంది. అది చాలా ముఖ్యమైన ప్రాజెక్టు. దాని విషయంలో మంత్రిగారు ఏమీ చెప్పినట్లు కన్పడడం లేదు. యీ బడ్జటు లెక్కలలోకానీ, వారు ఇచ్చినటువంటి నోట్‌లో కానీ దీనివిషయం ఏమీలేదు. అది ఎప్పుడు తీసుకోబడుతుందో, అసలు తీసుకుంటారో లేదో అనే విషయం తెలుసుకోవడానికి చాలామంది కుతూహలపడుతున్నారు.

ఈ రోజున మనం పెద్దపెద్ద ప్రాజెక్టులు కడుతున్నాము. ఆ ప్రాజెక్టులు ఇప్పుడు మనకు వెంటనే ఫలితానికి రావు. కాబట్టి మానేర్, మంజీరా, మూసీ మొదలయిన యీ ఉపనదులలోని నీటిని, వాటిని కలిసే చిన్నచిన్న వాగులలోని నీటిని ఉపయోగించవలసి యున్నది. యీ వాగులు, ఉపనదులూకూడా చాలా ముఖ్యమైనవి, వాటి క్యాచ్‌మెంటేరియా 500 నుంచీ 1000 చ. మైళ్ళ వరకూ కూడా ఉంటుంది. వాటి నిడివి 50 నుండి 100 మైళ్ళ వరకూ ఉంటుంది. యీ ఉపనదులపైన ఇదివరకే రైతులు కట్టుకున్న మాట్లు అక్కడక్కడ ఉన్నాయి. ఇలా మాట్లు కట్టుకొని కొన్ని వేల ఎకరాలను వారు సాగు

చేసుకుంటున్నారు. 40, 50 సంవత్సరాలై కట్టబడిన మోట్లు కావడంచేత అవి మంచి స్థితిలో లేవు. ఇంతవరకూ రైతులు మాత్రమే వాటిని మరమ్మత్తు చేసుకుంటున్నారు. రైతులవల్ల ఆ మరమ్మత్తులు సాధ్యంకావడంలేదు. కాబట్టి ప్రభుత్వంవారు ఒక్కొక్క వాగును పరిశీలించి వాటిపైన కట్టలు కట్టించి నట్లయితే అచ్చటి రైతులకు నీటి పారుదల సౌకర్యం కలుగుతుంది. వరంగల్లు తాలూకా, ములుగు తాలూకాల బోర్డర్‌లో జెర్రిపోతులవాగు ఉన్నది. ములుగు తాలూకాలో రామప్పచెర్వుక్రింద పుట్టేటటువంటి మొరంచవాగున్నది. నిజామాబాదు జిల్లాలో పెద్దవాగున్నది. కరీమ్‌నగరు జిల్లాలో మైదువాగున్నది. ఈ విధంగా తెలంగాణా జిల్లాలో ఎన్నో పెద్ద వాగులున్నాయి. యీ విషయం మంత్రిగారికి తెలుసు. అదిలాబాదు జిల్లాలో పెద్ద వాగున్నది. అది బుడమేరుకు కౌంటరు పార్టువంటిది. ఈ సోర్సెస్‌ను ఇంతవరకూ ట్యాప్ చేయలేదు. యీ వాగులన్నిటినీ గురించి సమగ్రంగా పరిశీలించి ఎక్కడెక్కడ వీలుంటుందో, ఎక్కడెక్కడ లాభసాటిగా ఉంటుందో గమనించి అక్కడ సరి అయిన ఏర్పాట్లు చేయాలని మనవిచేస్తున్నాను.

శ్రీ పి. నరసింగరావు : అధ్యక్షా, ఇరిగేషన్ శాఖగురించి మాట్లాడు తున్నప్పుడు రెండు విషయాలు గమనించవలసి యున్నది. ఒకటి, ఈ ఇరిగేషన్ గురించి ప్రభుత్వ పాలసీ ఏవిధముగా నున్నది? రెండు, ఇరిగేషన్ శాఖలో పని ఏవిధముగా జరుగుతున్నది? పాలసీకి సంబంధించినంతవరకూ కేవలం మేజరు ప్రాజెక్ట్సుకే ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వాలని ఎక్కువ డబ్బు వాటికే వెచ్చించదలచినట్లు కన్పించుచున్నది. తెలంగాణాలో 33 వేల చెర్వులు ఉన్నాయి. వాటిలో 19 వేల చెర్వులు 10 ఎకరాలకు మించీ మించని ఆయ కట్టు కలిగిఉన్నాయనీ వాటిని బాగుచేసేదానికి మనము చాలా తక్కువగా మొత్తములు కేటాయించినామని కన్పడుచున్నది. నీటిపారుదల సౌకర్యములు కలిగించే ఉద్దేశ్యములు రెండువిధాలుగా ఉంటవి. ఒకటి మనకు సౌకర్య మున్నదికాబట్టి ఎక్కువ పంటలు పండించడం. రెండవది, మనకు సరిపోయే తినుబండారాలను పండించుకోవడం. ఐతే తక్కువ ఖర్చుతోటి ఆహారాన్ని ఎక్కువగా ఉత్పత్తిచేయడమనేదే ముఖ్యమైన ధ్యేయం.

కాని ఇప్పుడు తరతరాలనుంచి ఉన్న **sources** అన్నిటినీ కూడా బాగు చేయకుండా, వాటినుంచి **maximum benefit** తీసుకోకుండా కేవలం పెద్దపెద్ద **projects** గురించే లక్షలాది, కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టడం జరుగు తున్నది. ఈ విధంగా ఖర్చుపెట్టడంవల్ల ఇదివరకు ఉన్న **sources** అన్నీ చెడిపో తున్నాయి. వాటినుంచి రావలసిన ఫలితము తగ్గుతున్నది. ఈ పెద్ద **project** వల్ల రావలసిన ఫలితములు **immediate** గా రావడంలేదు. తెలంగాణాలో

ఎన్నో **medium projects** ఉన్నాయి. ముఖ్యంగా కాకతీయుల కాలములో కట్టబడిన పెద్దపెద్ద చెరువులు, పాకాల, లక్నారం, రామప్ప, ఘనపురము ఈలాంటి పెద్దపెద్ద చెరువులు ఉన్నాయి. అవి పాతవికాబట్టి ప్రస్తుత **plan** ప్రకారంగా లేవు. అందువల్ల దాంట్లో నీరు వృధాపోతున్నది. ఉండే కాలువలకు తగిన మరమ్మతులు లేకుండా తెగిపోవడంచేత, వర్షాలవల్ల ప్రతి సంవత్సరం పంటలు నష్టమవుతున్నాయి. ముఖ్యంగా పాకాల చెరువుక్రింద పదివేల ఎకరాలు ఆయకట్టు ఉంది. కాబట్టి ఆ పదివేల ఎకరాలలో సగము ఆయకట్టుకు ఒక కాలువతోటి నీరు సప్లై అవుతుంది. దానినే సంగినకాలువ అంటారు. అది **high level canal.** ఆ చెరువులో 30 అడుగుల లోతుంటె కనీసం 20 అడుగులైనా నీరు వస్తేతప్ప కాలవవల్ల ప్రయోజనంలేదు. దాన్నిగురించి ఆ తాలూకాప్రజలు ఎన్నోసార్లు కమిటీలద్వారాను, **conferences** ద్వారాను ఇంతకుముందు హైదరాబాదు ప్రభుత్వానికి, మంత్రులకు కూడా విజ్ఞప్తి చేసుకొన్నారు. కాని ఇదివరకు ఏమీ చర్య తీసుకోలేదు. ఆ **canals** ను గనుక బాగు చేసినట్లైతే ఇప్పుడు పదివేలఎకరాలు సాగైతే, ఇంకా 2500 ఎకరాలు అయినా సాగుఅయే అవకాశము ఉన్నది. తరువాత మానేరుప్రాజెక్టు ఉంది. నర్మల్ ప్రాజెక్టు **construction** జరిగిందిగాని కాలువలు తయారుకాలేదు. మనము ఎప్పుడూ పత్రికలలో వింటూఉంటాము, తుంగభద్ర, కడియము ప్రాజెక్టులగురించి. ప్రాజెక్టు కట్టడం అయినాగాని, ఆ ప్రాజెక్టువలన రావలసిన నీరు కాలవలు లేనందువలన రావడంలేదు. ఆ విధంగా ప్రాజెక్టుయొక్క ఉపయోగాన్ని తీసుకోలేకుండా పోతున్నాము. ఈ విధంగా ప్రభుత్వానికి ఒక **integrated,** ఒక **co-ordinated policy** లేనందువలన, ఈ **projects** నిర్వహణం జరుగుతున్నప్పటికి, వాటి ఉపయోగం మనకు సక్రమంగా కావడంలేదు. కనుక మనము ఏ **plan** వేసినాగాని, అది **integrated** గా, **co-ordinated** గా ఉండేటట్లు, దానివల్ల **maximum** ఫలితాలు ఏ విధంగా పొందగలుగుతామో ఆలోచించి, ఆ విధంగా చేయడానికి ప్రభుత్వము ప్రయత్నం చేయాలని నేను కోరుతున్నాను.

తరువాత, **corruption** గురించి ప్రతివారు చెప్పుతున్నారు. ఆర్థిక మంత్రిగారు ఒక ఉర్దూపాహారిని **quote** చేస్తూ మనకు కష్టాలు బాగా అలవాటైపోయినాయి, కష్టాలు వచ్చినా పెద్దగా కన్పడడంలేదు, అన్నట్లు, ఈ లంచగొండితనం గురించి కూడా ఊరికే అంటూ ఉండటం మనందరికి కూడా అలవాటైపోయింది. ఈ మధ్యన ముఖ్యంగా కొన్ని వార పత్రికలలో ఈ **Irrigation Department** గురించి, **major projects** గురించి, నాగార్జున సాగర్ గురించి, సీతానగర్ **Work-shop** గురించి, ఇక్కడ హైదరాబాదులో ఉండే **transport store** గురించి చాలా వివరంగా **facts & figures** వింటూ

ఉన్నాము. వాటి విషయంలో ఏవిధంగా లక్షలాది రూపాయలు నష్టము జరుగుతూంది, ఏవిధంగా అందులో పెద్దపెద్ద ఉద్యోగులు **involve** అయి ఉన్నారు అనే విషయాలను గురించి విచారణ చేయకుండా, ఏమిచర్య తీసు కోకుండా ముఖ్యంగా బాధ్యతగల పత్రికలు **Chief Engineer** గురించి, **Executive Engineer** గురించి, **Supervisor** లను గురించి ఇటువంటి వాళ్లందరి గురించి **facts and figures** తో సహా ప్రకటిస్తున్నప్పుడు, వాటిని గురించి ప్రభుత్వము ఏమి తెలుపకుండా, కనీసం ఆ ప్రకటనలను **contradict** చేయకుండా ఉంటే ఏమి అనుకోవాలి? ఇందులో కొంతైనా యదార్థం ఉండక తప్పదని ప్రజలు భావించడం జరుగుతుంది. దానివలన ప్రజలకు ప్రభుత్వ యంత్రాంగంమీద ఏమాత్రం విశ్వాసం లేకుండాపోవడం జరుగుతుంది. ప్రత్యేకంగా సీతానగరం **Workshop** గురించి **Chief Engineer** గారు అక్కడ లక్ష, 50 వేల రూపాయలు ఖర్చుపెట్టి ఏమి పనికిరానటువంటి ఒక **machine** ను బొంబాయి **firm** కు సంబంధించినటువంటిది మద్రాసునుంచి తెప్పించారు. ఆ **machine** ఏమి ఉపయోగానికి రావడంలేదు. ఇంకొక 2, 3 లక్షలు ఖర్చుపెడితే ఆ **machine** ఉపయోగానికి వస్తుందనే, విషయం ఒక పత్రికలో ప్రకటించబడింది. అదేవిధంగా నాగార్జునసాగర్‌కు సంబంధించిన **store** గురించి దాంట్లో వేలకొలదిబస్తాల సిమెంటు, రేకులు ఇవన్నీ **Mr. Nathuni** అనే ఒక **supervisor** కాజేసినట్లు పత్రికలలో ప్రకటించారు. కాని అటువంటి ఆయనమీద ఏమి చర్యతీసుకోకుండా, ఇంకా అతనికి **promotion** ఇచ్చి ఎక్కడనో ఒక **machinery** ఖరీదు చేసేదానికోసం కొన్ని లక్షలు ఖరీదు చేయవలసి నటువంటి బాధ్యతగల **job** మీద పంపించినట్లు పత్రికలలో చూస్తుఉంటే ఈ విషయంలో ప్రభుత్వము ఏమీ చర్యతీసుకోకుండా ఉన్నట్లయితే, ప్రభుత్వ యంత్రాంగంమీద ఏ విధమైన విశ్వాసం ఉండగలదు? ఇటువంటి విషయాలలో వీరందరికి **interest** ఉన్నదా అనే అనుమానం కలుగక తప్పదు. కనుక ఇటు వంటి విషయాలలో ప్రభుత్వము ప్రత్యేకంగా చర్యతీసుకోవలెనని కోరు తున్నాను.

తరువాత తెలంగాణాలో చాలా చెరువులు ఉన్నాయి. 500 రూపా యలనుంచి 10 వేల రూపాయల వరకు వీటియొక్క **maintenance works** జరుగుతూ ఉంటాయి. ఇవి కేవలం నామకః **maintenance works** గాని పని మాత్రం ఏమీ జరుగదు. వాటిని **contractors** కు ఇవ్వడం జరుగుతుంది. **Sanction** చేసిన మొత్తంలో 50 **percent** ఎక్కడనో పోతుంది. మిగిలింది **contractor** కాజేస్తాడు, గాని అసలు పని ఏమీ జరుగదు, కాస్త మట్టి పోయడం తప్ప. కాబట్టి ఇటువంటివిషయాలలో **Labour Co-operative Societies** ను బాగా ప్రోత్సహించి, ఇటువంటి పనులు ఆ **Societies** కు అప్పగించినట్లయితే

వాళ్ళకు అక్కడ local interest ఉంటుంది కాబట్టి ఆ పనిని వారు సక్రమంగా నిర్వహించడం జరుగుతుంది. లేకపోతే పంచాయతీ కమిటీలు, భారత సేవక సమాజము ఇటువంటి agencies ద్వారా ఈ maintenance works అన్నీ జరిపించాలని మంత్రిగారిని కోరుతూ నేను సెలవుతీసుకొంటున్నాను.

శ్రీ ఆర్. నాథమునిరెడ్డి (తిరుపతి) : అధ్యక్షా, ప్రభుత్వమువారు చాలా గొప్పఎత్తున కోట్లకొలది రూపాయలు వ్యయముచేసి జీవనదులపైన గొప్ప ప్రాజెక్టులు కట్టి, ఆ నదీనీరును ఉపయోగించి లక్షలాది ఎకరాలను సాగుకుతెచ్చి అధికాహారోత్పత్తి చేయవలెనని పూనుకున్నారు. చాలామంచిదే. కాని ప్రభుత్వముయొక్క ఈ ఉద్దేశము ఇరవైయేళ్ళకుగాని నెరవేరదు. ఈ ఉద్దేశంతో ప్రభుత్వమువారు ఎక్కువ మొత్తాలను ఈ పెద్దప్రాజెక్టులకుగాను కేటాయిస్తూ, కొన్ని లక్షలుమాత్రం minor irrigation కున్నూ, మరి కొన్ని లక్షలు మాత్రము medium schemes కున్నూ కేటాయించారు. ఈ విధముగా చేయడంవల్ల, పెద్ద ప్రాజెక్టులవల్ల లాభము పొందని ప్రాంతాలు చాలా దెబ్బ తింటాయి. ముఖ్యంగా ఈ medium schemes కు minor irrigation schemes కు కేటాయించిన డబ్బు, చాలాతక్కువ గనుక ఈ విషయాన్ని గుర్తు పెట్టుకొని వీటికి అధికంగా డబ్బు కేటాయించాలని కోరుతున్నాను. తరువాత డెల్టాప్రాంతాలలోను, ప్రాజెక్టులక్రింద ఉపయోగపడేటటువంటి ప్రదేశాలలోను, immediate గా కాకపోయినా, ఇకమీదనైనా ఈ ప్రాజెక్టులవల్ల ఉపయోగపడే ప్రాంతాలలోను ప్రస్తుతము ఉన్న medium schemes ను ఆపుదలచేసి ఈ projects వల్ల ఉపయోగం లేనటువంటి ప్రాంతాలకు medium schemes ను అమలు జరిపేటట్లు ప్రభుత్వము ప్రయత్నం చేయవలెనని కోరుతున్నాను. ముఖ్యంగా చిత్తూరుజిల్లాలో కల్యాణి రిజర్వాయర్ స్కీము ఉన్నది. దీనికి 1949 సంవత్సరంనుంచి కూడా బడ్జెటులో అంతో ఇంతో provision చూపిస్తున్నారు. దాని investigation కూడా అయింది. ఇంతవరకు రాష్ట్రాలలో ఉన్నటువంటి Irrigation Ministers కూడా ఈ ప్రాంతానికి వచ్చి చూచి, ఈ స్కీము తప్పక జరగవలసిందే, దీనివల్ల తిరుపతి నీటిసౌకర్యము ధారాళముగా ఉండడమే కాకుండా అక్కడ చుట్టుపట్ల ఉండే 20, 30 గ్రామాలకు బావులద్వారాను, కాలువల ద్వారాను perenniel water supply ఉండగలదని, రైతులకు చాలా అనుకూలంగా ఉంటుందని వారు అభిప్రాయపడ్డారు. దీనికి ప్రతిసంవత్సరం ఒక token grant Budget లో provide చేస్తూఉంటారు. ఈ సంవత్సరం అదీ కూడా చేయలేదు. కనుక ప్రభుత్వంవారు ఈ పనిని అతిత్వరగా తీసుకోవలసిందని కోరుతున్నాను. మా తాలూకాలో మూలవానిచెరువు, మూలపల్లిచెరువు చిత్తూరు తాలూకాలో గూటాలవంక ఈ schemes కూడా investigate చేయబడి ప్రభుత్వంవద్ద ఉన్నాయి. వీటినికూడా త్వరగా తీసుకొని, ప్రాజెక్టుల

వల్ల సహాయం పొందనటువంటి బీదప్రాంతాలలో కూడ ప్రభుత్వము ఈ చిన్న స్కీములను శ్రద్ధతో జరిపించవలెనని కోరుతున్నాను. మాది చాలవరకు బావుల సేద్యము. **Irrigation facilities** తక్కువ. కొన్నిలక్షలు ఖర్చుపెట్టి **electricity main lines** వేసినారు. **Rural electrification** మాత్రం నిలిచిపోయింది. ఏవిధంగానైనా కొంత డబ్బు కేటాయించి **rural electrification** పూర్తి చేస్తారని కోరుతున్నాను. మా జిల్లాలో తిరుత్తణి, పుత్తూరు తాలూకాలలో కొన్ని జీవనదులున్నవి. కొన్ని ప్రాజెక్ట్సు యిదివరకే **investigate** చేయబడి ప్రభుత్వ **sanction** కొరకు ఉన్నవి. వాటిని కార్యరూపంలో వెంటనే **take up** చేయవలెనని కోరుతున్నాను. ఈ రాజధానీ నగరము మాజిల్లాకు చాలా దూరము అయిపోయినది. ఇదివరకు మద్రాసు దగ్గరగాయుండి బీదరైతులు పై ఇంజనీర్లు, ఆఫీసర్సువద్దకు పోయి పనులు త్వరగా జరుగుటకు ప్రయత్నించెడివారు. ఇప్పుడు ఈ రాజధానినగరం దూరమయిపోయినది. అది దృష్టిలో పెట్టుకొని శ్రద్ధ వహించి ప్రజలకు కావలసిన సౌకర్యములు సత్వరం కలుగజేయాలని కోరుతున్నాను.

శ్రీ రంగారెడ్డి (బాలకొండ) : అధ్యక్షా, ఆంధ్రప్రదేశ్‌లో నీటి సంపద విపరీతముగా యున్నదని మనకందరకు తెలుసు. పెద్దపెద్ద ప్రాజెక్ట్సు కట్టబడుతున్నాయి. అయితే నిజామ్‌సాగర్ ప్రాజెక్టు కట్టిన తరువాత యీ 20 సం. ల అనుభవమునుబట్టి పరిశీలించి చూస్తే టెక్నికల్‌గా కొన్ని లోపాలు ఉన్నవని కనబడుతున్నది. నిజామ్‌సాగర్ వల్ల 2,75,000 ఎకరాలు సాగుచేయవచ్చునని చెప్పారు. కాని యదార్థంగా నేడు 1,75,000 ఎకరాలు కూడ సేద్యంచేసే పరిస్థితిలో లేమని, **saturation point** యిదివరకే అయినదని, ముందు డెవలప్ చేయకూడదని అంటున్నారు. ఈ ప్రాజెక్టు నిర్మాణ విషయంలో చేసిన అవకతవకలు బయటపడుతున్నాయి. నీరు సేద్యము చేయుటకు సరిపోతుందని అంచనాలు వేశారు. అది తప్పయియుండవచ్చును. కొన్ని ప్రదేశాలలో రైతులు విపరీతంగా ధనము పెట్టుబడి పెట్టి శ్రమపడి భూములను సేద్యయోగ్యంగాచేస్తే, నీటి కొరత ఉన్నదని, నీరు యివ్వలేమని చెప్పుటవల్ల రైతులకు నిరుత్సాహం కలుగుతోంది. ఆహారధాన్యాల కొరత ఉన్నప్పుడు నీటిని జాగ్రత్తగా వాడుకొనుట మన ధర్మం. పెద్దపెద్ద ప్రాజెక్ట్సు కట్టినంతమాత్రాన మన ధర్మం పూర్తికాదు. నీరు ఒక్క బొట్టుకూడా వృథాపోకుండా వాడుకోవాలి. ఇక్కడ ఎంతో నీరు నిర్లక్ష్యంగా వృథాచేయబడుతున్నదని చెప్పకతప్పదు. కాల్వలలోని నీరు వృథాకాకుండా **effective supervision** ఉండాలి.

పెద్ద ప్రాజెక్ట్సు కట్టిన తరుపరి వాటిక్రింద ఆయకట్టు ఎంతవరకు విస్తరణ కాగలదో అంతవరకు డెవలప్ చేసి మనం లాభం పొందాలి. కోట్లకొలది డబ్బు

వ్యయంచేసి ప్రాజెక్టులు కట్టి, వానిక్రింద భూములు పూర్తిగా డెవలప్ చేసి లాభం పొందకపోవటం చాల విచారకరంగా యున్నది. సామాన్యంగా ప్రాజెక్టులకు tail-ends లో యున్న భూములకు నీటికొరత క్రమేపి కలుగుతోంది. 100, 150 మైళ్ళు పోయినతదుపరి, సామాన్యంగా మనిషి అదుపులో లేనికారణాలవల్ల కాలవ తెగిపోవుటవల్ల నీరు అందుటలేదు. అక్కడ యున్న వ్యవసాయదారులకు విపరీతంగా హాని, నష్టం కలుగుతున్నది. నేను ఒక సూచన చేస్తున్నాను. Tail-end లో యున్న భూస్వాములకు నష్టము వాటిల్లకుండా, మైలెండుకు 20, 25 మైళ్ళపైన reservoir కట్టించాలి. అప్పుడు, క్రింది భూములకు నీటిసౌకర్యం కలుగుతుంది. క్రిందయున్న కాలవలు పూర్తిగా చెడిపోయాయి. లైనింగ్ చేసిగాని, మరొకవిధంగాగాని వాటిని మంచి పరిస్థితిలోకి తేవటం అవసరం. అది లేకుండా పంటలు బాగా పండాలను కొనటం వృధాఅవుతుందని మనవిచేస్తూ యింతటితో సమాప్తము చేస్తున్నాను.

శ్రీ యన్. రాములు (బ్రహ్మంతర్ల) : అధ్యక్షా, గౌరవనీయులైన ఇర్రిగేషన్ శాఖామాత్యులు ప్రవేశపెట్టిన డిమాండ్సులో, నెం. 8. డిమాండులో రు. 1,95,39.100; నెం. 37 లో రు. 4,40,40,000; నెం. 41 డిమాండులో రు. 7,78,25,000 లు, కోరారు. మనదేశం పూర్తిగా వ్యవసాయం మీదనే ఆధారపడియున్నది. Irrigation సౌకర్యములు భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలోకంటె మన రాష్ట్రములో ఎక్కువ ప్రకృతి ప్రసాదించి యున్నది కనుక మన రాష్ట్రము భారతదేశమునకు ధాన్యాగారముగా తయారు కావలసిన అవసరం ఏర్పడియున్నది. అటువంటి సమయంలో ఇర్రిగేషన్ డిమాండ్సు క్రింద కోరబడిన మొత్తం చాలా తక్కువగా, నిరుత్సాహకరంగా యున్నదని చెప్పక తప్పదు. మనరాష్ట్రం పుష్కలంగా ఆహారధాన్యములు పండించవలెనన్న నీటి వనరులు ఏర్పరచవలసిన అవసరం ఉన్నది. లేనిచో రైతు నష్టపడటమేకాకుండా ప్రజలందరికీ తీరని నష్టము కలుగును. స్వల్ప వేతనాలు తెచ్చుకునే ఉద్యోగస్థులు ఆహారధాన్యాల ధరల పెరుగుదలవల్ల యిక్కట్లపాలై ఆందోళన జరపవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. N.G.O. లు చేస్తున్న ఆందోళనప్రత్యక్ష నిదర్శనం. మరల రైతుమీద మరొక విధంగా పన్నులువేసే అగత్యం ఏర్పడవచ్చును. ఆహారధాన్యాల ధరల పెరుగుదలవల్ల సామాన్య రైతుకు ఎటువంటి లాభము కలుగలేదని చెప్పక తప్పదు. ఎందుచేతనంటే, రైతుకు కావలసిన యితర వస్తువుల ధరలు కూడ పెరిగినవి. పుష్కలంగా పంటలు పండించుటకు నీటివనరులు బాగుచేసుకోవాలి. నీటివనరులు బాగుచేసుకొనిననాడు, యితర రంగాలలో కూడ సమృద్ధిగా యుండుటకు పునాదులు వేసినవారమగుదుము. ఆహార ధాన్యాల ధరలు తగ్గించటానికి కూడ యిదియొకటే మార్గము.

మా శ్రీకాకుళంజిల్లా చాలా వెనుకబడిన ప్రాంతం. ప్రభుత్వంచే చాలా కాలంనుంచి నిర్లక్ష్యము చేయబడింది. ఇది చాలాకాలం జమిందారీ ప్రాంతంగా యుండటంవల్ల ఇర్రిగేషన్ సౌకర్యాలు నిర్లక్ష్యం చేయబడ్డాయి. కావలసిన ఆహారధాన్యాలు పండించుకునే అవకాశం లేకుండా పోయింది. అక్కడ వంశధార ప్రాజెక్టు విషయం గమనిస్తే దానికి 115 సంవత్సరముల చరిత్రయున్నది. ఇంతకాలంనుంచి ఆందోళనచేస్తున్నా, యింతవరకు నిర్మాణం కావింపబడలేదు. అంతేగాక చిన్నచిన్న మైనర్ ఇర్రిగేషను పనులు, చెరువుల మరమ్మతులు కూడ చాలకాలంనుంచి చేయబడకుండా యున్నవి. అవి జమీందారుల కాలములో ఏర్పాటై, తరతరాలనుంచి మరమ్మతులు లేక చాలా శిథిలావస్థ పరిస్థితిలో యుండి యున్నవి.

ఈ మైనర్ ఇరిగేషన్ పనులను వెంటనే మరమ్మతుచేయకపోతే, కొద్ది రోజులలోనే అవి పూర్తిగాశిథిలావస్థచెంది, వాటిని క్రొత్తగా నిర్మాణంచేస్తే ఎంత ఖర్చుచేయవలసివస్తుందో, అంతఖర్చు తిరిగి చేయవలసివస్తుంది కాబట్టి యీ మైనర్ ఇరిగేషన్‌కు ప్రత్యేకశ్రద్ధ చూపించాలని కోరుతున్నాను. మా టెక్కలి తాలూకాలో, నా నియోజకవర్గానికి సంబంధించినంతవరకు మూడు మీడియమ్ ఇరిగేషన్ ప్రాజెక్టులు ఉన్నవి. వరహాలకేటకి కొంటికాయ దగ్గర రిజర్వాయరు, పద్మనాభంసాగర్ రిజర్వాయర్, రేవులగడ్డ రిజర్వాయరు అని యీ స్కీములున్నవి. వీటికి ఎస్టిమేట్సు రెండు మూడు సంవత్సరాల క్రిందటే చేయబడినవి. కాని ఇంతవరకు ఎటువంటి కార్యక్రమములు సాగింపబడలేదు. వీటిని నిర్మిస్తే ఎన్నో వేల ఎకరాలు సాగుబడిలోకి రావటానికి అవకాశం ఉన్నది. ప్రభుత్వం యీ మైనర్ ఇరిగేషన్‌వర్క్సుకు, మీడియమ్ ఇరిగేషన్‌వర్క్సుకు తగు చర్య తీసుకోవలసినదిగా మంత్రిగారిని కోరుతున్నాను.

శ్రీ కె. రామచంద్రారెడ్డి : అధ్యక్షా, ఇప్పుడు ఇరిగేషన్‌పద్దుమీద చర్చలు జరుగుచున్నవి. అనేకమంది గౌరవసభ్యులు ప్రధానంగా మైనర్ ఇరిగేషన్ వర్క్సును ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తోందని, యీ మైనర్ ఇరిగేషన్‌కు శ్రద్ధ వహించి, ఎక్కువ డబ్బు వీటికొరకు ఖర్చుపెట్టాలని తెలియజేశారు. ఆంధ్ర ప్రాంతం గురించి నాకు ఎక్కువ తెలియదు. ప్రభుత్వం ఇచ్చిన లెఖ్ఖల ప్రకారంగా తెలంగాణాప్రాంతంలో ఒకకోటి ఐదులక్షల ఆరువేల ఎకరాలు భూమి సేద్యముఅవుతోంది. తరిభూమి 13.7 పర్సెంటు సేద్యము అవుతోంది. మంత్రిగారు 10 పర్సెంటుఅవుతోందని చెప్పారు. ఆ లెఖ్ఖలలో పొరపాటు ఎక్కడ ఉన్నదో వారు చూసుకోవలసిఉన్నది. అయితే, తెలంగాణాలో 33వేల చెరువులు ఉన్నట్లు వారు లెక్కలో చూపెట్టారు. కాని మొత్తంతెలంగాణాలో 43,027 చెరువులు ఉన్నాయి. ఇదివరకు చూపిన లెక్కల ప్రకారంగా, 10 ఎకరాలు లోపు గలిగిన చెరువులు 12,438 ఉన్నవి. 10ఎకరాలు నుంచి 200ఎకరాలు

కలిగిన చెరువులు 19,589 ఉన్నవి. 200 పైన ఎకరాలు కలిగిన చెరువులు 11,000 ఉన్నవి. వీటిలో మొత్తం 3,700 చెరువులు తెగిపోయిఉన్నాయి. ప్రభుత్వ లెఖ్ఖల ప్రకారమే 3,700 తెగిపోయిన చెరువులు ఉన్నాయి. వీటి క్రింద ఆయకట్టు 2,30,000 ఎకరాల భూమి ఉన్నది. మొదటి పంచవర్ష ప్రణాళికలో తెలంగాణాలో 5 మీడియమ్ ప్రాజెక్టులను ప్రభుత్వం తీసుకొంది. ఆ 5 ప్రాజెక్టులు, కోయిల్ సాగర్, సరళాసాగర్, భీమన్నపల్లి, మూసా, సరళా ఈ 5 ప్రాజెక్టులలో రెండుమాత్రమే ప్రభుత్వము పూర్తిచేసింది. అవి భీమన్న పల్లి, కోయల్ సాగర్ ప్రాజెక్టులు. మిగతా 3 ప్రాజెక్టులు ఇంకా అలాగే ఉన్నాయి. ముసాప్రాజెక్టును మూడుసంవత్సరాలలో పూర్తిచేసి, ప్రజానీకానికి నీరు అందిస్తామని ప్రభుత్వం వాగ్దానంచేసింది. ఆ ప్రకారం అది మూడు సంవత్సరాలలో పూర్తిచేయకపోగా, అది పూర్తిచేయటానికి ఈ రెండవ పంచవర్ష ప్రణాళికాకాలంలోని ఐదు సంవత్సరాలు కూడా సరిపోనట్లు తెలుస్తోంది. ఇంతవరకు ఆ డామ్ లో మూడోవంతుకూడా పూర్తికాలేదు. ఈ విధంగా ఆ ఐదు మీడియమ్ ప్రాజెక్టుల పరిస్థితి ఉన్నది. రెండవ పంచవర్ష ప్రణాళికలో అదనంగా 11 మీడియమ్ ప్రాజెక్టులు తీసుకొంటామని సెలవిచ్చారు. ప్రస్తుతం అవి కాగితాలమీద మాత్రమే ఉన్నవి. ఈ సంవత్సరం ఏ ఒక్కదానికి డబ్బు కేటాయించలేదని సెలవిచ్చారు.

మొదటి పంచవర్ష ప్రణాళికలో, 1,50,000 ఎకరాల ఆయకట్టుగల 1927 తెగిపోయినచెరువులను మరమ్మతుచేయటానికి 1,47,78,000 రూపాయలు కేటాయించబడినది. అందులో ఎన్ని మరమ్మతు అయినవో ప్రభుత్వం లెక్కలు చూపించలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికలో కూడ అదనంగా 1245 తెగిపోయిన చెరువులను తీసుకోవాలని 1,06,13,000 రూ. తో వాటిని బాగుచేయాలని లెక్కలలో చూపెట్టబడినది. ఆ విధంగా చేయించినా, యింకా తెగిపోయిన చెరువులు మిగిలేఉంటాయి. వెనుకబడిన తెలంగాణా ప్రాంతంలో ఇరిగేషన్ తక్కువ. ప్రభుత్వ కాలవల ద్వారా తెలంగాణాలో 2,24,585 ఎకరాలు సేద్యము అవుతోంది. ప్రయివేట్ కాల్వలక్రింద 10,130 ఎకరాలు, చెరువుల క్రింద 10,66,179 ఎకరాలు, ట్యూబ్ బావుల క్రింద 6,496 ఎకరాలు, ఇతర బావులక్రింద 2,37,876 ఎకరాలు ఇంకా ఇతర విధాలుగా అంటే చిన్నచిన్న వుడ్కీ, వాగుల క్రింద 41,315 ఎకరాలు యీ విధంగా మొత్తం 15,86,381 ఎకరాలు ఉన్నది. ప్రయివేటు కాల్వలక్రింద సేద్యం అవుతున్న తరి భూములు ప్రభుత్వ కాల్వలక్రింద 14.8 పర్సెంటు తరి భూమి సేద్యముఅవుతున్నది. మిగతాది, 85.2 పర్సెంటు చెరువులక్రింద బావులక్రింద సేద్యం అవుతుంది. మైనర్ ఇర్రిగేషన్ వర్క్సు చాలా ప్రధానమైనవి. గత పంచవర్ష ప్రణాళికా కాలంలో జరిగిన అనుభవం చూస్తే, మైనర్ ఇరిగేషన్

ఎడల ప్రభుత్వం నిర్లక్ష్యభావం వహిస్తున్నట్లు మనకు స్పష్టంగా తెలుస్తుంది. ప్రభుత్వం పెద్దపెద్ద ప్రాజెక్టులు కడుతూ, వాటి కొరకు ఎక్కువ డబ్బు ఖర్చు చేస్తోంది గనుక, మైనర్ ఇరిగేషన్ వర్కు్సను బుద్ధిపూర్వకంగానే వెనక్కు నెట్టివేస్తోందేమోననే అనుమానం కలుగుతోంది. మేజర్ ప్రాజెక్టులు అవసరము లేదని నేను చెప్పటంలేదు. అవి అవసరమే, కాని ఇదివరకే చెడిపోయిన కుంటలు, చెరువులు, కాలవలువగైరా నీటివనరులను బాగుచేయిస్తే ఎంతోవిశాల మైన ప్రదేశాన్ని తక్కువ డబ్బుతో సాగులోనికి తీసుకువచ్చే అవకాశం ఉన్నది. ఆ విధంగా అధికోత్పత్తి చేసే అవకాశం ఉన్నది. తక్కువ డబ్బు ఖర్చుపెట్టి ఎక్కువ ప్రజానీకానికి సౌకర్యం కలిగించినట్లు అవుతుంది. దీని విషయంలో ప్రభుత్వం అశ్రద్ధగా చూడటం భావ్యంకాదు. దీనిని గురించి ఎక్కువ డబ్బు కేటాయించాలని నేను మనవిచేస్తున్నాను. నల్లగొండ జిల్లాలో చూస్తే, అక్కడ కూడా తెగిపోయిన చెరువులు చాలా ఉన్నాయి. ప్రభుత్వ లెక్కల ప్రకారంగా 180 చెరువులు తెగిపోయి ఉన్నాయి. వాటిక్రింద 23,380 ఎకరాల భూమి ఉన్నది. ఈ తెగిపోయిన చెరువుల సంగతి గత ఐదు సంవత్సరాలుగా హైదరా బాదు ప్రభుత్వములో కూడ చెపుతూవచ్చాము.

కాని ఆ ప్రభుత్వం కొన్నిచెరువులకుమాత్రమే మరమ్మతులుచేయించింది. పది పర్సెంటు, 15 పర్సెంటు చెరువులను మాత్రమే బాగుచేయించింది. మిగతా తెగిన చెరువులను ఇంతవరకు బాగుచేయలేదు. అక్కడి భూమి సాగుకు పనికి రాకుండా ఉన్నవి. ఈ తెగిపోయిన చెరువులన్నీ తక్కువ డబ్బుతో మరమ్మతు లవుతాయి. "దానివల్ల ఎంతోభూమి సాగులోకి తెచ్చి ఎక్కువ పంట పండించ గలుగుతాము; అధికోత్పత్తి చేయగలుగుతాము, ఎక్కువ ప్రజానీకానికి లాభం కలిగిస్తాము" అన్న దృష్టితో ప్రభుత్వం చూస్తే బాగుంటుందని నా మనవి. మా రామన్నపేట నియోజకవర్గములో ఉన్న మూసాంపల్లి చెరువు గురించి గత ఐదు సంవత్సరాలనుంచి ప్రభుత్వానికి చెబుతున్నాము. ఆ చెరువు మరమ్మ తుకు 85 వేల రూపాయలు మంజూరు అయినదని అప్పటి ప్రభుత్వం చెప్పింది. అప్పుడు దానికి సర్వే చేయబడింది. ఇంతవరకు ఆ చెరువు మరమ్మతు చేయబడ లేదు. ఇంతవరకు పనికూడ ప్రారంభించలేదు. అదేవిధంగా దేవరకొండ తాలూ కాలో మేలమ్మ చెరువు ఉన్నది. ఆ చెరువు తెగిపోయినది. ఆ చెరువు మరమ్మతు గురించి ప్రభుత్వంకు రిప్రజెంటేషన్ యివ్వడం జరిగింది. వందల ఎకరాల భూమి అక్కడ సేద్యం అయ్యేది ఉన్నది. ఇంకా శేతవోలు చెరువు ఉంది. వరంగల్ జిల్లాలో లక్కవరం చెరువు, రామప్ప చెరువు, పాకాల చెరువులున్నాయి. పాకాల చెరువుక్రింద సంగం అనే కాలవగురించి ఇదివరకు మిత్రులు చెప్పారు. ఆ కాలవక్రింద ఆరువేలఎకరాల భూమి సేద్యం అవుతుంది. ఆ కాల్వ మెట్టగా ఉన్నది. అది పల్లం చేస్తే, అదనంగా రెండువేల ఎకరాలు సేద్యం అయ్యే

అవకాశం ఉన్నది. ఇప్పుడున్న ఆరువేల ఎకరాలు సేద్యం కావటంలేదు. చెరువులో మొత్తం 30 అడుగుల నీరు ఉంటుంది. అందులో 10 అడుగుల నీరు చెరువులోనుండి బయటికిరాదు. అందులో 20 అడుగుల నీరు మాత్రమే ఉపయోగానికి వస్తవి. కాబట్టి దానిని వల్లము చేయాలని చెబుతున్నాను. అక్కడి చెరువుల గురించి నా దగ్గర ఒక పుస్తకం ఉన్నది. ఆ పుస్తకాన్ని అధ్యక్షుల ద్వారా మంత్రిగారికి సమర్పిస్తున్నాను. ఒక ముఖ్యవిషయము. ఇప్పుడే ఒక టెలిగ్రాం వచ్చింది. అది కడపనుంచి వచ్చింది. ఈ కే. సి. కెనాల్‌లో పూర్తిగా నీరు లేదు. దానిక్రింద 80 వేల ఎకరాల మాగాణి యీ సంవత్సరం సేద్యం కాకుండా ఉంది. తుంగభద్ర ప్రాజెక్టునుంచి వారికి నీరు కావాలని అక్కడి రైతులుకోరుతూ టెలిగ్రామ్ పంపించారు. అందుకొరకు యీ సమస్యను మంత్రిగారు హృదయపూర్వకంగా సానుభూతితో పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. సమయం లేనందువల్ల అన్ని సమస్యలను గుఱించి చెప్పజాలకపోతున్నాను. ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు (నరసీపట్నం—జనరల్): అధ్యక్షా! యివ్వాళ నాకు యీ ఉపన్యాసమునకు అవకాశం యిచ్చినందుకు నాకృతజ్ఞత మీకు తెలియజేసుకుంటున్నాను. ఇంకో విషయం యేమిటంటే శ్రీ పిడతల రంగారెడ్డిగారు **Chief Whip** గా వచ్చిన తరువాత నేను వారిని అనేక విధాలుగా మూడు, నాలుగు డిమాండ్లమీద అవకాశం యిమ్మని అడిగితే యివ్వాళ నాకు తప్పకుండా అవకాశం యిస్తానని శలవిచ్చినప్పటికీ పది నిముషాల అవకాశం రాలేదు. 3 నిముషాల అవకాశమైనా రాలేదు. కనుక తమరు రెండు నిముషాలైనా యిస్తారేమోనని ఆశిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : Time లేదు. మంత్రిగారు $1\frac{1}{2}$ గంటలకి జవాబు చెబుతారు. మీరు రెండు నిముషాలలో ముగించండి.

శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు : **P. W. D.** మంత్రిగారు యివ్వాళ ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తున్నాను. ఒకచిన్న విషయంమాత్రం మా నియోజకవర్గంగురించి అత్యవసరంగా మనవి చేయవలసివుంది. గంటావారి కొత్తగూడెం, గాదిగుమ్మి, రేకవానిపాలెం స్కీము అని తాండవనదిమీద మూడు ప్రాజెక్టులు యిదివరకే పూర్తిగా పరిశీలనకావింపబడి వున్నవి. కాని యింత వరకు వాటికి ఏవిధమైన **sanction** ఇవ్వకపోవుట మాత్రము మా దురదృష్టమని నేను భావిస్తున్నాను. కళ్యాణపులోవవద్ద వరహానదిమీద ఒక ప్రాజెక్టుకు ప్రపోజల్ వుంది. ఆ ప్రాజెక్టు కూడా యిదివరకె పూర్తి పరిశీలన జరిగికూడా ఇప్పటి వరకు అవకాశం కలుగలేదు. కాని గోవాడగెడ్డ స్కీము, కైలాసపట్నం, మువ్వలగెడ్డ స్కీము, బలిఘట్టం దగ్గర, రాచపల్లి బొబ్బిలిగెడ్డ స్కీము - యివి

కూడా యిదివరకే పూర్తి పరిశీలన అయినప్పటికీ, యీ మూడు minor irrigation స్కీములలో ఒకటయినా anction యివ్వకపోవడం మా దురదృష్టమని మనవి చేస్తున్నాను. మా కవరంపాలెం, చవిటిగెడ్డ స్కీము, రామచంద్రపురం గెడ్డ, పందూరుగెడ్డ వగైరా, కొండలగ్రహారం ఆనకట్టు యిలాంటి ఆనకట్టలు ఎన్నో మరమ్మతులుగాకుండగావుండగా మా విశాఖపట్నం జిల్లాలో ఈమాత్రం అవకాశం అయినా యివ్వకపోవడానికి కారణం ఏమిటంటే - శ్రీ విశ్వనాథం గారు మంత్రిగావున్నప్పుడు ఎంతో బాధపడి 10 లక్షల రూపాయలు చేసే స్కీము వారి నియోజకవర్గంలో చేయించుకున్నారు. అయితే మా విశాఖపట్నం జిల్లాలో ఒక మంత్రి అయినా లేకపోవడంచేత యీమాత్రం minor irrigation స్కీములకు అవకాశంలేకుండా వచ్చిందేమోనని నేను మనవి చేయవలసివస్తుంది. కాని ముఖ్యమంత్రిగారు 1956వ సంవత్సరంలో మా ప్రాజెక్టు ప్రదేశాలన్నింటికి specialగా దయచేసి అన్నింటినీ పరిశీలించి వెళ్ళిపోయారు. వారు రాయలసీమ ప్రాంతంవారు. వారితరువాత P. W. D. మినిష్టరుగా తెలంగాణా ప్రాంతంవారు వచ్చారు. ఇంకా వారు ఇప్పటికీ మా ప్రాంతం దయచేసి ఆ అవకాశాలు చూడడానికయినా మాకు అదృష్టం కలుగలేదు. అందుచేత వారు దయచేసి మా ప్రాంతంయొక్క మంచి చెడ్డలు పరిశీలించి మాకు మంత్రిగారు లేనిలోపం వారు తీర్చి అందులో కొన్ని స్కీములయినా మాకు యీ సంవత్సరం యివ్వకపోయినట్లయితే వచ్చేమారు మేము మెంబర్లుగా రావడానికి అవకాశంలేదని మనవిచేస్తూ శలవు తీసుకుంటున్నాను.

**శ్రీ జె. వి. నరసింగరావు :** అధ్యక్షా ! నేడు సభాసమావేశం అరగంట పొడిగించారు. ఎక్కువమంది సభ్యులు చాలా ఉత్సాహంతో ఎన్నోవిషయాలు చర్చించారు. నేను ప్రారంభంనుంచీ కూడా జవాబు చెప్పడానికిబదులు కొన్ని విషయాలు వారిదగ్గర నేర్చుకుంటున్నాను. ప్రతి నియోజకవర్గంలో మనం ప్రజా ప్రతినిధుల మైనప్పుడు వారి అవసరాలు యేమి ? నిజముగా ఆ అవసరాలను ముందుపెట్టుకొని యీ సభాసభ్యులందరూ కూడా నడచుకుంటున్నారని చాలా సంతోషించవలసిన విషయం. వారికెంతనిరాశో నాకూ అంతే నిరాశ, వారికెంత ఆనందమో నాకూ అంతే ఆనందం. ప్రతి పల్లెలో ప్రతి చిన్నచెఱువుకూడా మరమ్మత్తు అయితే ఎంత బాగుండేది ! ఎన్నిఎకరాలు సేద్యంఅయ్యేది ! దేశం ఎంతబాగుండేది ! అని నాకుకూడా ఉత్సాహం వుంది. డబ్బు లేదుకదా అనే నిరాశ వారికెంతవుందో నాకుకూడా అంతేవుంది. కాని పరిస్థితులనుబట్టి మనదేశము ఒక పద్ధతిలో అభివృద్ధి చెందదలచుకున్నది. అది ప్రణాళికాపద్ధతిలో. పూర్వకాలంలో, ప్రణాళికాపద్ధతి ఒక్క నియంతృత్వ ప్రభుత్వాలే అవలంబించేవి. ప్రజాస్వామిక సిద్ధాంతాలకూ యీ ప్రణాళికా పద్ధతికి యేమీ సంబంధం లేదనుకునేవారు. కాని ప్రపంచంలో మనం కొత్త

experiment చూపెడుతున్నాం. ప్రణాళికా పద్ధతితో ప్రజాస్వామ్యంలో కూడా ముందుకు పోవచ్చుననీ, యితరదేశాలలో ఎక్కడయితే వారు ప్రణాళికాపద్ధతిలో ముందుకు పోయినారో వారు నియంతృత్వ ప్రభుత్వాలే అయినప్పటికీ ప్రజాస్వామ్య సిద్ధాంతాలతో కలిపి సమన్వయించి ముందుకు పోజాలుదుమని మనము నిరూపించుచున్నాము. మనం ప్రతి అయిదు సంవత్సరాలకు ఒక ప్రణాళికను సిద్ధం చేసుకుంటున్నాం. రష్యావారైనా అమెరికావారైనా ఏ దేశానికి చెందినవారైనా నిపుణులు యిక్కడకువచ్చి సలహాయిస్తున్నారు. ఏ తీరుగా వుండాలి ? ఏతీరుగా అభివృద్ధికరంగా ముందుకు రావాలి ? పెద్దప్రాజెక్టులు ఎన్నివుండాలి ? చిన్నప్రాజెక్టులు ఎన్నివుండాలి ? దేశాభివృద్ధికి, దేశం సస్యశ్యామలం అగుటకు, శ్రేయోరాజ్యాన్ని తొందరగా స్థాపించుకొనుటకు ఏఏ పద్ధతులలో ముందుకుపోవాలనే విషయాలు ఆలోచించాలి. ఒక క్రమపద్ధతిలో ఒక ప్రణాళిక సిద్ధంచేస్తాము. ఆ ప్రణాళిక సిద్ధం అయినతరువాత అందరి అభిప్రాయాలుకూడా తీసుకుని తుదితీర్పు జరుగుతుంది. దాని తరువాతమాత్రం అదిలేదు, యిదిలేదని చెబితే చెప్పుకోవచ్చు. ఆ లోట్లు రెండవ ప్రణాళికలో తీర్చుకోవడానికి సాధ్యం అవుతుంది. ఇక్కడ ప్రణాళికలో మనం పెట్టిన (targets) అంచనాలుమాత్రం పూర్తిచేయడానికి మనం సర్వవిధములా తోడ్పడవలసి వుంటుంది. ఆ పద్ధతిలోచూస్తే మనం ఎన్నో రంగాలలో కొన్ని మాత్రమే పూర్తి చేయగలుగుతున్నాం. కొన్ని చేయజాలక పోతున్నాము. దానికి ప్రభుత్వంపైననే బాధ్యతకాదు. ఆ వాతావరణం కావాలి. ప్రజలలో ఆ విశ్వాసం రావాలి. ప్రజలలో ఆ విశ్వాసం రావాలంటే శాసనసభ్యులలో బాధ్యత హెచ్చుకావాలి. వారు 'యిది మన దేశం, దేశం అభివృద్ధికరంగా ముందుకు పోతున్నది. ఏ రాజకీయపార్టీ అధికారంలో వుండినా ప్రజల బాగోగులే మాకు ముఖ్యమని' భావించి ముందుకు పోయి అన్నిపనులను, యీ ప్రణాళికను కూడా, జయప్రదంగా నడపడానికి చర్యలు జరుపాలి. అట్లయితే మనం అనుకున్నంత నిరాశకు ఎంతమాత్రం కారణాలుండవు. రెండవప్రణాళిక గురించి కొన్ని నిర్ణయాలు తీసుకున్నాం. ప్రతిజిల్లాకు అక్కడక్కడ అభిప్రాయాలు కనుక్కొన్న తరువాతనే కొన్ని నిర్ణయాలు జరిగినాయి. మనం అందుబాటులో నున్నంతవరకు ఏ పనీ సక్రమంగా జరగాలనే ఉద్దేశ్యంతోనే కొన్ని స్కీములు మాత్రం తీసుకున్నాము. ఇంతవరకు మిత్రులు చాలా విషయాలు చెప్పారు. ఇప్పుడే ఇంజనీర్లను అడిగి జవాబులు తెప్పించుకున్నాను. కొన్ని స్కీములు investigation దశలో వున్నాయి, కొన్ని investigation అయిపోయినవి. తరువాత డబ్బులేక తీసుకోనివి కొన్ని వున్నాయి. కొన్ని నిజంగా remunerative scheme లు కావని త్రోసివేసినవి వున్నవి. ఆ విషయాలన్నీ తెలుసుకోవాలంటే మిత్రులందరూ నన్ను కలుసుకోవచ్చు. ఈ విషయాలు అందజేస్తాను. ముఖ్యంగా

చిన్నచిన్న విషయాలెన్నో చెప్పారు. అక్కడ సిమెంటు దొంగతనం జరిగిందనీ యిక్కడ మరమ్మత్తులు కావడంలేదనీ చెప్పారు. నేను కొన్ని దినాలనుండి దీనిపై ఆలోచిస్తున్నాను. ప్రతిజిల్లాకు ఒక Irrigation Consultative Advisory Committee వంటి దానిని స్థాపించి అక్కడ శాసన సభ్యులందరూ కూడా పాల్గొని యీ విషయాలు Chief Engineer తో, కలెక్టరుతో ఆలోచించడానికి అవకాశం కలిగించాలని ఉంది. అచిరకాలంలోనే ఆ విషయంలో ప్రభుత్వం ఒక నిర్ణయానికి వచ్చును. దానితో యింతకుముందు చెప్పిన చిన్న విషయాలు పరిష్కార మవుతాయి. ఇది public enemy number one అని ఎవరో అన్నారు. కాని శ్రీ రాజగోపాలాచారి గారు public enemy number one అని ఎవరిననారో, సభ్యులు జ్ఞాపకం చేసికోవచ్చును. Public enemy number two is P. W. D. అన్నారు. Number one అని ఎవరిననారో నేను చెప్పదలచుకోలేదు. దాని తరువాత Travancore - Cochin Minister గారు ఒకరు మాత్రం public enemy number one is P. W. D అన్నారు. ఏదో పాతకాలం నుండీ కూడా వుండే ఒక P. W. D. "Toast" నాకు జ్ఞాపకము వస్తున్నది. Two inches for the road, two inches for the contractor and two inches for the engineer" ఇది పాతకాలంనుంచీ వస్తున్న వాడుక. కాని ఆ కాలం, ఆ పరిస్థితులు, ఆ వాతావరణం అవన్నీ చూసుకోవాలి. అప్పుడు ఆక్రమణ సమాజంలో, (acquisitive society) లో తన లాభం, తాను పైకిపోవాలి, తన struggle for existence లో ఆ తీరుగా ముందుకుపోవాలి, అనుకునే వాతావరణంలో అన్నిరంగాలలో corruption వుండేది. ఏదయినా తాను ముందుకు పోయేదే తనధర్మం అనుకునే పరిస్థితులలో ఆ వాతావరణం వుండేకాలంలో ప్రతిరంగంలోకూడా యిటువంటి వ్యక్తులు కనపడతారు. కాని అదేతీరు ఎప్పటికీ ఉండదు. P. W. D. అంటే Public Wastage Department అనీ దానిని Public Welfare Departmentఅనడానికి అర్హతేలేదనే భావాలతో ఏదయితే ఆలోచిస్తున్నామో అది చాలాతప్పు. నాకుకూడా ఒకనాడు ఇట్లావుండేది. తమాషాగా, నన్ను మంత్రిగా తీసుకున్నతరువాత ఏ portfolio అని నిర్ణయించుకోకముందు ఒక Chief Engineer నాదగ్గరకువస్తే 'నేను చాలా prejudiced గా వున్నాను. మీ portfolio మాత్రం తీసుకోను' అని చెప్పాను. ఇదీ నిజమైనసంగతి. రెండవ దినం వచ్చి మీరే మా మంత్రి అయినారుకదా అని చెప్పారు. దానిని బట్టే యీ శాఖగురించి నేను ఏ ధోరణిలో ఆలోచించినానో తెలుస్తుంది. ఇందులో చాలా లోపాలున్నాయనే భావంతోనే మొదటనుంచి చూస్తున్నాను. ఏమైనా మనం ఒక పద్ధతిలో పోవాలి. మంత్రులు పత్రికలు చదవరా అని ఒక మిత్రుడు ఇప్పుడే చెప్పారు. నేను 7 పత్రికలను చదువుతాను. ఒక దినం తీరిక లేకపోతే రెండవ దినం, లేకపోతే మూడవ దినమైనా చూసితీరుతాను. పైగా Information Department నుంచి cuttings వస్తాయి, అందులోకూడా సీతా

నగరం workshop సంగతి ఇంతవరకు రాలేదు. హైదరాబాదులో ఎన్నో ఉర్దూ పత్రికలు వస్తుంటాయి. వీటినే చిల్లిమ్ "గెజెట్ పేపర్లు" అంటుంటాము మేము. రు. 200 లు దొరికితే చాలును పత్రికలు ప్రారంభిస్తారు. డిక్లరేషన్ ఇచ్చి, ఆ దినం వేస్తాడు, మరునాడు డబ్బు దొరకకపోతే 'మీకు వ్యతిరేకంగా నా దగ్గరకు news వచ్చింది' అంటే ఎవరైనా ఏమైనా ఇస్తే ఆ డబ్బుతో మరల ప్రారంభిస్తాడు. ఇటువంటి పత్రికలలో ఏమైనా వస్తే దానిని చూచే బాధ్యత నాపై లేదు. అటువంటివాటిలో ఏమైనా వస్తే సత్యదూరమా, సత్యసమ్మతమా అనే విషయంకూడా ఆలోచించడానికి అవకాశంలేదు. ఇటువంటి పత్రికలను చూడకూడదని నేను భావిస్తున్నాను. సామాన్యంగా బాధ్యతారహితంగానే వ్యవహారం జరుగుతుందని అనుకోనక్కరలేదు. మొన్ననే నాగార్జున సాగర్ దగ్గర శ్రీ ఎస్. కె. పాటిల్‌గారితో చెప్పవలసి వచ్చినది. మనం కుడి కాలువకు alignment ఇచ్చాము - ఇన్ని కోట్లు ఇన్ని లక్షలు అని చెప్పాము. పాతకాలపు ఇంజనీర్లు అయితే కంట్రాక్టరును పిలిచి tunnel కావాలి, ఇన్ని లక్షల రూపాయలు మంజూరైనది అని చెప్పేవాడు. కాని నవీన యువకులైన ఇంజనీర్లు కొందరు, ఛీఫ్ ఇంజనీరు అధ్వర్యాన ఎన్ని alternatives సాధ్యం అవుతాయో ఆలోచించి ఏతీరుగా పనిచేస్తే తక్కువ ఖర్చు అవుతుందో పరిశీలించారు. తుదకు వారు సూచించిన దానివల్ల మనకు 47 లక్షల రూపాయిలు తక్కువ ద్రవ్యం ఖర్చు అవుతున్నది. ఈ సూచనలను వెంటనే C.W.P.C. కూడా ఒప్పుకున్నది. అందుచేత P.W.D. శాఖలో దేశభక్తులెవరూ లేరనుకోవడం పొరపాటు. ప్రతి రంగంలోను మంచివారున్నారు. చెడ్డవారూ ఉన్నారు. సభ్యులకు ఏదో ఒక రకమైన భావన ఉంటే అది చాలా పొరపాటు అని నేను సవినయంగా మనవిచేస్తున్నాను. మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టుల విషయమై చాలామంది సభ్యులు మాట్లాడారు. వారు చెప్పినది నిజమే. నేను, నా మిత్రులు, వ్యవసాయశాఖా మంత్రిగారైన తిమ్మారెడ్డిగారు ఒకసారి ఆలోచించాము - grow more food ప్రణాళికలు ఇన్ని రకాలుగా అమలు చేస్తున్నా పల్లెటూళ్ళలో చెరువులు మరమ్మతు చురుకుగా కావడంలేదు; దానిని తొందరగా చేయించడానికి డబ్బు కావాలని అనుకున్నాము. మీమీ ప్రాంతాలలో ఎన్ని చెరువులున్నవి; ఎన్ని చెరువులు మరమ్మతు కావాలనే విషయమై తిరుపతి క్యాంపునుంచే కలెక్టర్లకు వ్రాశాను. నేను ఇక్కడకు వచ్చేసరికి figures అన్నీ వచ్చాయి. వాటిని తీసుకుని నేను, శ్రీ తిమ్మారెడ్డిగారు ఢిల్లీ వెళ్ళాము. అక్కడ వ్యవసాయశాఖ మంత్రిగారిని కలుసుకుని అంతా చెప్పాము. వారు ఇక్కడకు వచ్చారు. వారికి ఒక నోటు (note) ఇచ్చాము, వారు ఈ విషయం చాలా అవసరమైనదని తెలుసుకోగలిగారు. సాధ్యమైనంతవరకు సహాయం చేస్తామని చెప్పారు. సహాయం తప్పకుండా వస్తుంది కాని ఎంతవస్తుందో చెప్పలేము. ఒక్క విషయం మాత్రం తెలంగాణా సభ్యులకు మనవిచేయవలసియున్నది. నిజంగా

**facts and figures** ఎక్కడైనా పెడితే సిగ్గుగా ఉన్నది. మైనర్ ఇరిగేషన్ స్కీములు ఎన్నో మంజూరై ఉన్నాయి. పనులు చేయడానికి కంట్రాక్టర్లు ఎవ్వరూ ముందుకు రాలేదు. గ్రామాలలో ఉన్న ముఖ్యులు, ప్రజాసేవకులైనవారు ముందుకువచ్చి పనులను పూర్తిచేయించడానికి ప్రయత్నాలు చేయలేదు. దీనివల్ల ఎంతో **short fall** అయినది; ఎంతో వెనుకబడిపోయారు. **G.O.** ఉన్నదో లేదో నాకు తెలియదుకాని ఎక్కడైనా పంచాయితీ కమిటీలు ముందుకు ఏ చిన్న పనినైనా 'మేము చేస్తాము' అంటే తప్పకుండా వారికి ఇచ్చితీరాలి; తప్పకుండా ఇస్తారు. ఇక్కడ ఉపన్యాసాలు ఇచ్చినట్లే మన కష్టాలకు పల్లెటూళ్ళలో చెప్పడమే కాకుండా ప్రభుత్వంనుంచి ఏ లాభాలు కావాలో తేల్చుకుని ప్రభుత్వంతో సహకరించి కార్యక్రమమును ముందుకు తీసుకుపోవాలి. ఈ భావంతో ప్రతినియోజకవర్గంలోను ఆలోచించి కంట్రాక్టరులు అవసరమే లేదు. కార్మికులందరు ఒక సంఘంగా ఏర్పడి, ఒక సహకార సంఘముపెట్టుకుని, ఇటువంటి పనులను తీసుకోవచ్చును, సాధ్యమైనంతవరకు వీటిలో పూర్తిగా సహకారం ఇవ్వడానికే ప్రయత్నిస్తాను, కొన్ని ప్రత్యేక సమస్యలను గురించి కూడా సభ్యులు చెప్పారు. ధవిళేశ్వరం ఆనకట్ట గురించి చెప్పారు. కొందరు తెలంగాణా అని, రాయలసీమ అని, సర్కారు ప్రాంతము అని అంటూచెప్పారు. నాకు నచ్చలేదు. అయినా వెనుకబడిన ప్రాంతాలవారు ముందుకు రావాలనుకోవడం సహజం, అందులో ఏమీ ద్వేషభావాలు లేవు. మంత్రులమందరమూ ఆంధ్ర ప్రదేశ్‌కు చెందినవారమే కాని తెలంగాణ వారమో, రాయలసీమ వారమో, సర్కారుజిల్లాల వారమో కాదు. అన్ని ప్రాంతాలవారి అవసరాలను గమనించి వాటిని సాధ్యమైనంతవరకు తీర్చడం మావిధి. ధవిళేశ్వరంలో **shutters** పెంచడానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నది. వీటిని ఒకసారి పెంచినామంటే సంవత్సరానికి, రెండు సంవత్సరాలకు మార్చడానికి వీలుండదు. అందుచేత ఒక **experiment** ను చేస్తున్నాము. ప్రత్యేక **model** ను సిద్ధంచేసి ఏతీరుగా చేస్తే చాలాకాలం **permanent** గా ఉండడానికి వీలుంటుంది అనే విషయమై ప్రయత్నాలు జరుగుతున్నాయి. సాధ్యమైనంత తొందరలో పని పూర్తిచేస్తాము. ఏమిజరుగుతున్నదో తెలుసుకొనకుండా ఏదో **ignore**చేశారు, **neglect** చేశారు అనేభావంతో ఉండ కూడదని నేను మనవిచేస్తున్నాను. నెల్లూరు జిల్లాకు నేను, కేంద్రప్రభుత్వంలోని ఉపమంత్రిగారు మొన్ననే వెళ్లాము. అక్కడ అన్నీ చూశాము; సోమశిల ప్రాజెక్టు, ఇతర వసతులు విషయమై చూశాము. సోమశిల ప్రాజెక్టు విషయమై రెండవ పంచవర్ష ప్రణాళికలో ఉన్నది. **C.W.P.C** నుండి తొందరగా **sanction** తీసుకొనడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ విమర్శించిన మిత్రునికి కూడా ఈ సంగతులన్నీ తెలిసినవే. **Breached tanks** గురించి నేను మనవిచేశాను. అచ్యుతరెడ్డిగారు ఏవో కొన్ని విషయాలు చెప్పారు. డిపార్టుమెంటులో తెలంగాణా, ఆంధ్ర భాగాలని ఉన్నవని ఏవో చెప్పారు, నేను

చూడలేదు. ఆ భాగాలేవో పరిశీలించి చూస్తాను. P. W. D. కి సంబంధించినంత వరకు అటువంటి భాగాలకు తావులేదని చెప్పగలను. నేను ఉన్నాను; నాక్రింద ఉన్న ఇద్దరు డిప్యూటీ సెక్రటరీలు తెలంగాణాకు చెందినవారే; చీఫ్ ఇంజనీరు (జనరల్) కూడా తెలంగాణాకు చెందినవారే. మంత్రి మొదలు చీఫ్ ఇంజనీరు వరకు తెలంగాణాకు చెందినవారే అయినప్పటికి ఆంధ్ర, తెలంగాణా అనే భేదం ఎక్కడైనా ఉంటే నేను స్వయంగా తెలుసుకుంటాను. అటువంటి దేదైనా ఉంటే దూరపరుస్తాను. ఒక విషయం మనవిచేస్తున్నాను. కొందరు ఏదో రాజకీయాల కారణంగా ఏదో లాభంకొరకు కొన్ని ఊహించి, ప్రచారాలు చేస్తున్నారు. ఊహించి చేసే ప్రచారాలలో ఎంతవరకు నిజంఉన్నదో కనుక్కొని ఏమైనా నిజం ఉంటే నా దృష్టికి కాని, ముఖ్యమంత్రిగారి దృష్టికి కాని తీసుకువస్తే పరిష్కరించనపుడు ఆ విషయమై ఏదైనా అనవచ్చును. అప్పారావుగారు నాగవరం ప్రాజెక్టు విషయంలో ఏదో లంచగొండితనం జరిగిందని చెప్పారు. దానిని గురించి రిపోర్టు ఇంకా రాలేదు. అందిన తరువాత చర్య తీసికొనడానికి అవకాశం ఉంటుంది. సీతారామస్వామిగారు సీతానగరం విషయమై చెప్పారు. దాని విషయమై ఒక note తెప్పించాను. దాని ప్రకారం-

"The balance of the work is proposed to be completed before the second crop season, but considering the work already completed water is proposed to be let down in the left side channel and the first distributary of the right side channel upto mile 3 during the first crop season."

ఏదో శ్రీకాకుళం జిల్లా కాబట్టి కంట్రాక్టరు లేక ఇతర కారణాలవల్ల పని ఆగిపోయింది. చాలా విచారకరమైన విషయం. నేను ఆలస్యాన్ని సమర్థించి చెప్పేవాణ్ణికాదు. సాధ్యమైనంత వరకు పూర్తిచేసే ప్రయత్నం చేస్తాము. శ్రీ సూర్యనారాయణరాజు గారు అన్నారు- వారి జిల్లా నుంచి మంత్రి ఎవరు లేరే అని. వారు adopt చేసుకుంటే విశాఖపట్నం జిల్లావాణ్ణి అని చెప్పుకోడానికి సిద్ధంగా ఉన్నాను. ఆంధ్రప్రదేశ్‌కు అంతకు సేవచేసేటపుడు ఏ జిల్లా వారమని అనుకున్నా అనుకోవచ్చును. అందులో వేరే అభిప్రాయాలకు ఎంతమాత్రం అవకాశంలేదు.

మిస్టర్ స్పీకర్ : వారి జిల్లాకు త్వరలో వెళ్లాలని వారు కోరుతున్నారు.

శ్రీ జె. వి. నరసింగరావు : రాజోలిబండ ప్రాజెక్టు కాలువ పని జరుగుతోంది, డాము పని ఇదివరకు హైదరాబాదు ప్రభుత్వం ఎంతవరకు చేసినదో అంతటితో ఆగిపోయినది. ఆ విషయాలు కనుక్కోడానికి మంత్రులు సమావేశం ఒకటి జరుగనున్నది. అక్కడ తీర్పుచేస్తాము. బహుశా ఆగస్టు 10 నాడు నేను రాజోలిబండకు స్వయంగా పోయి డామును చూస్తాను. తరువాత మైసూరు మంత్రిగారితో సంప్రదింపులు చేయాలి. తుంగభద్రప్రాజెక్టు విషయమై మిత్రులు

చెప్పారు. ఎన్నో సంవత్సరాల నుంచి కార్మికులకు రావలసిన డబ్బు రాలేదు అని మేము ఏమీచేయడంలేదని చెప్పారు. నిజానికి ఈవిషయంతో నాకేమీ సంబంధం లేదు, ఆ వ్యవహారం మైసూరుకు సంబంధించినది. ఈమధ్యనే నాలుగు దినాల క్రిందట ఇద్దరు శాసనసభ్యులు- వారు ఇక్కడ లేరు, నాదగ్గరకు వచ్చి చెప్పారు ఈవిషయమై. వారు చెప్పగానే మారుమాట్లాడకుండా చక్కగా మైసూరు మంత్రిగారికి ఉత్తరం వ్రాశాను. వారి సమాధానంకూడా వచ్చింది. ఆ విషయం పరిష్కారం చేస్తామని వారు వ్రాశారు. నాకు సంబంధంలేకపోయినా శాసన సభ్యులు కోరినారు కాబట్టి ఈవిధంగా చేశాను. అంతకుమించి చేసేదిఏమీలేదు.

నాగార్జునసాగరం గురించి కొన్ని విషయాలు చెప్పారు. అక్కడ పని సక్రమంగా జరుగుతుంది. మొన్న పాటిల్‌గారు వచ్చి, సక్రమపద్ధతిగా పని జరగటంచూచి చాలా సంతోషించారు. యింకా దానిగురించి వివరాలు కావాలన్నా చెపుతాను. ఇతర ప్రాజెక్టులతో పోల్చిచూచుకొంటే చాలా చౌకగా ఇక్కడ పని జరుగుతోంది. పని జరిగే సమయంలో సూపర్‌వైజర్ ఏదోచేశాడు, ఎవరో ఏదో చేశారు అనే విషయాన్ని చూపించినప్పుడు మేము చర్య తీసుకోకపోయినట్లయితే మీరు నిందారోపణ చేయవచ్చు. తప్పు ఏదో చెప్పక పేపర్లలో వచ్చింది చూచుకోండి అంటే సాధ్యంకాదు. కనుక ఫలానా వ్యక్తి ఫలానా తప్పుపని చేస్తున్నాడని మాతో చెప్పటం భావ్యం.

గున్నయ్యగారు పెద్ద కేటలాగు ఇచ్చారు. వారు రోజూ ఎన్ని ప్రశ్న లడిగినా, యింకా యేమైన మిగిలినవా? కొత్త విషయాలే వ్రాశారో, లేక వాటినే రిపీట్ చేశారో నాకు తెలియదు కాని వాటికి చాలావరకు ప్రశ్నలలో జవాబువచ్చే వుంటుంది కనుక దాని విషయం కొత్తగా చెప్పవలసిన అవసరం లేదు. గోదావరి ప్రాజెక్టుకు ముందు ఇతర ప్రాజెక్టులేవైనా, సోమశిల ప్రాజెక్టు వంటివి తీసుకోవాలని కొందరు సభ్యులు చెప్పారు. పోచంపాడు విషయం గురించి నేనొక విషయం మనవిచేయదలిచాను. హైదరాబాదు ప్రభుత్వము దానినిగురించి చాలావరకు సర్వే చేయించింది. ఎస్టిమేట్స్ సిద్ధమైనవి. కాని దురదృష్టవశాత్తూ అప్పటి ముఖ్యమంత్రి ఎవరో-లైఖాలి అనుకొంటాను, కడంనుండి నీరు రామగుండం తెప్పించుకొని థర్మల్ స్టేషన్ నడుపుదామని చెప్పారట. ఆ విషయంగురించి నేను 'ఏమయ్యా! 'Putting the cart before the Horse' పని చేశావు?' కడం ప్రాజెక్టు మొదటచేశావు. అసలు ప్రాజెక్టును ముట్టలేదేమి? అని ఛీఫ్ ఇంజనీరును అడిగాను. 'నేను ప్రాజెక్ట్ నిర్మించాను, కాని ప్రభుత్వం అట్లా చేసింది కనుక కడం ప్రాజెక్టు నిర్మించామని' వారు చెప్పారు. దానిక్రింద 60,000 ఎకరాలు సేద్యంక్రిందికి రావాలి. పని సక్రమంగా జరుగుతోంది. కొన్ని షట్టర్స్ పెట్టవలసి ఉంది. ఆ పనికూడా పూర్తి అయినదనే అనుకోవచ్చు. కాని 66,000 ఎకరాలకు పూర్తిగా నీరు రావా

లంటే గోదావరి నార్తు కెనాలు వచ్చితీరాలి. ఇప్పుడు నిజాంసాగర్ సరిగా పని చేయటంలేదని, కొందరు మిత్రులు చెప్పారు. నీరు వచ్చి, నిజామ్ సాగర్ పవర్ స్టేషన్ సక్రమంగా నడవాలంటే దేవునూరు ప్రాజెక్టును పూర్తి చేయాలి.

ఆ పని పూర్తిఅయితే ఈ కొరతలుండవు. 4 కోట్ల రు. ఖర్చుపెట్టిన తరువాత ప్రాజెక్టు సక్రమంగానడవాలంటే గోదావరి నార్త్ కెనాల్ అవసరము. దానికి పోచంపాడు డాము అవసరము అనిపిస్తుంది. పోచంపాడు ప్రాజెక్టు వస్తే మహబూబ్‌నగర్‌లో కొంత, నల్గొండజిల్లా తప్పితే, తెలంగాణాలోని అన్ని జిల్లాలు సేద్యం కావటానికి అవకాశముంది. మూడుసార్లూ సర్వేలో డాము ఎక్కడవుండాలనే విషయంలో అభిప్రాయభేదాలు వచ్చాయి. చివరకు పోచంపాడు మంచిచోటు అని నిర్ణయించాము. డాక్టర్ కె. ఎల్. రావుగారు వచ్చి పరిశోధించి అది సరైన చోటని చెప్పారు. ఎన్ని స్కీములు వేసినా, పూర్తిగా ఎస్టిమేట్స్ వచ్చినా, ఆ ప్రాజెక్టుకు సంబంధించిన రికార్డును **C. W. P. C.** కేంద్ర ప్రభుత్వంవారు **check up** చేయాలి. సర్వే పనులు మనం తొందరగా పరిశీలించి ఈ సంవత్సరం ప్లానింగ్ కమిషన్ వారికి ఒక నివేదిక అర్పించగల్గితే, రెండవ ప్లాన్ ఆఖరులో కాని, లేదా మూడవ ప్లాన్ మొదట్లో గాని పని జరగవచ్చును. ఆ విషయం నేను శ్రీ ఎస్. కె. పాటిల్‌గారికి మనవి చేశాను. యింకా చర్చలు జరుగుతున్నాయి. అక్కడవున్న మన **M. P.** లకు ఈ విషయం చాలా శ్రద్ధగా చెప్పి, నోట్ చేసుకోమని వారికి ఒప్పచెప్పాము. నాగార్జునసాగర్ డాము పని పూర్తికాగానే అక్కడనుండి విడుదలైన యంత్రాలు ఇక్కడ ఉపయోగించటానికి అవకాశం వుంటుంది. నాగార్జున సాగరం ప్రాజెక్టు అయినప్పటికి నల్గొండ జిల్లాలో కొంతభాగము, ఖమ్మంలో కొంత భాగము తప్పితే తెలంగాణాలో వెనుకబడిన జిల్లాలకు నీరు రావాలంటే పోచంపాడు ప్రాజెక్టు తప్ప యింకొకటి లేదు. తెలంగాణా సభ్యులందరు కూడా మాకు పోచంపాడు ప్రాజెక్టు కావాలంటున్నారు.

మౌలాసాహెబ్‌గారు చెప్పినట్లు ఈ 5 సంవత్సరాలలో సభాసభ్యులు పోచంపాడు ప్రాజెక్టు పొందగల్గారనే కీర్తి దక్కేటట్లు చేసుకోవాలి.

కళ్యాణి రిజర్వాయర్ రెండవ ప్లానులో చేర్చబడింది. నేను స్వయంగా నాదమునిరెడ్డిగారితో వెళ్ళి చూచివచ్చాను. సాధ్యమైనంత త్వరగా ఆ పని పూర్తిచేయించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. నిజామ్‌సాగర్ ప్రాజెక్టులో కొన్ని లోపాలు వున్నాయి. నదిలో నీరు తక్కువగా వుండటంవలన 2 వ **crop** కు తక్కువ ఏరియాకే నీరు ఇస్తున్నారు. దానికంటె ఎక్కువ ఏరియా

భూమి సేద్యం కావటానికి కొన్ని ఇబ్బందులు వున్నాయి. దేవనూరుప్రాజెక్టు సిద్ధంకాగానే ఆ ఇబ్బందులు తొలగిపోతాయి.

ఇక ముఖ్య విషయాలు ఏమిలేవు. ప్రతి సభ్యుడు తన నియోజకవర్గము నకు కావలసినవసతుల గురించి చెప్పినాడు. వాటిని నోట్ చేసుకొన్నాను. ద్రవ్య ఇబ్బంది తొలగిననాడు వాటిని పూర్తిచేసుకోగల్గుతాము.

ఇవాళ చర్చ ఒక అరగంట పెంచాము. సభ్యులందరు ఏకగ్రీవంగా ఏ డివిజను కోరకుండా. ఈ డిమాండును ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

ఒక గౌరవ సభ్యుడు : మూసి ప్రాజెక్టు సంగతి ఏమిటి ?

శ్రీ జె. వి. నరసింగరావు : మూసి ప్రాజెక్టు 1956 సెప్టెంబరుకు పూర్తికావలసివుంది. నేను, ఛీఫ్ఇంజనీరు 30-4-56 న అక్కడకు వెళ్లాము. చూచినప్పుడు అక్కడ పని మొదటిదశలోనే ఉంది. 100 కి 75 వంతుల పని డిపార్టుమెంటల్ గా చేయాలని కంట్రాక్టరునుండి తీసుకొన్నాము. 1958 జూన్ టార్జెట్ డేట్ గా ఫిక్సుచేశాము. ఒక తమాషా జరిగింది. మిత్రుడు జ్ఞాపకం జేశాడు గనుక ఆ సంగతి చెబుతాను. నేను తిరిగివస్తుంటే కొందరు రైతులు అక్కడకు వచ్చారు. వెంకటకృష్ణయ్యర్ గారునా ప్రక్కనే వున్నారు. 'రైతులు ఆశతో వచ్చిరి. జూన్ 1957 లో నీరు ఇస్తామని ఇవ్వలేదు, నిరాశలో పడు తున్నారని' నేను అంటిని. 'నీరు ఇవ్వదలచుకొన్నారా?' అని వెంకటకృష్ణయ్యర్ గారు అడిగిరి. 'ఇవ్వదలచుకొన్నాను, ఎట్లుఇవ్వగలుగుతారని' నేనంటిని.'ఎన్ని వేల ఎకరాలకు ఇచ్చే ఇష్టమున్నదని' వారు అడిగిరి. '2000 ఎకరాలకు ఈ సంవత్సరం నీరు ఇచ్చితీరాలని' నేనంటిని. కలెక్టరు నా ప్రక్కనే ఉండిరి. వెంకట కృష్ణయ్యర్ గారు నీరు ఇస్తామన్నారు. 'మీరు డెవలప్ చేయగలరా ?' అని కలెక్టరును నేనడిగాను. ఉత్సాహవంతుడైన కలెక్టరు శాస్త్రి తప్పక చేస్తానన్నారు. నేను తిరిగి వచ్చేశాను. అక్కడ వారికి కావలసిన వసతులు, సహకారము, రెవిన్యూ బోర్డు నుండి లభించేటట్టుచేశాము. దాదాపు నెలా పదిహేను రోజులలోనే ఆల్టర్ నేట్ గా నీరు వచ్చే సదుపాయంచేసి నీరు ఇస్తున్నారు. ఇంతవరకు 1,200 ల ఎకరాలకు ఇచ్చారు. యింకా 800ల ఎకరాలకు ఇస్తారు. ఇందుకు అక్కడ పనిచేసిన ఇంజనీర్లకు, కలెక్టరుకు, మిగతావారికి ధన్యవాదాలుచెప్పాలి. అసలు నాకీ idea ఎట్లా వచ్చిందంటే- చైనాలో రివర్ ప్రాజెక్టులు ఎట్లాఅభివృద్ధి లోనికి వచ్చినవి ? అనేదానిని గురించి కె. ఎల్. రావుగారు వ్రాసిన పుస్తకం చదువుతుంటిని. అక్కడ పెద్దకెనాలును 5 సం. లలో కూడా చేయలేనిదానిని 75 దినాలలో పూర్తిచేశారు. ఇంకొకచోట కెనాల్ స్లూయిస్ వర్క్సు, రెగ్యు లేటర్ వర్క్సు 80 దినాల్లో చేశారు. వారు అట్లా చేయగలిగితే మనం ఎందుకు చేయలేమని, తప్పకుండా చేసితీరాలనే ఉత్సాహం నాకు కలిగింది. కలెక్టరు

మరియు సూపరింటెండింగ్ ఇంజనీరు ఇబ్రహింగారు రాత్రింబవళ్ళు పనిచేసి, ఆ పని పూర్తిచేశారు.

శ్రీ వి. విశ్వేశ్వరరావు : కె. సి. కెనాల్‌లో నీరు లేదని టెలిగ్రాము వచ్చింది.

శ్రీ జె. వి. నరసింగరావు : దురదృష్టవశాత్తు ఆ టెలిగ్రాము మంత్రులకు, ప్రభుత్వముకు రాక సభ్యులకు వచ్చింది. అది ప్రభుత్వానికి వస్తే ఆలోచించవలసిన అవసరం వుంటుంది.

ఒక గౌరవ సభ్యుడు : సిద్ధేశ్వరం ప్రాజెక్టు ఏ స్టేజిలో వున్నదో చెప్పలేదు.

శ్రీ జె. వి. నరసింగరావు : ఇన్వెస్టిగేట్ చేసే స్టేజిలో వుంది. సభ్యులు రేపు కల్సుకొంటే, details ఇస్తాను.

శ్రీ కె. జనార్దనరెడ్డి(నాగర్‌కర్నూలు-జనరల్) : అప్పర్-కృష్ణ విషయం మంత్రిగారు చెప్పగల్గుతారా ?

శ్రీ జె. వి. నరసింగరావు : ప్రాజెక్టుల విషయం ముందే మనవిచేశాను. ప్రాజెక్టులలో ఒక్కొక్కటి తీసుకొని చెప్పలేదు. కొన్ని కొన్ని ప్రాజెక్టులు ఇనిషియల్ స్టేజీలో ఉన్నాయి. కొన్ని ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి. ఏది ఏ దశలో వున్నదో రేపు ఆఫీసులో కల్సుకొంటే చెబుతాను.

శ్రీ టి. పాపారావు (నాగరికటకం) : శ్రీకాకుళం జిల్లాలో నారాయణపురం ఆనకట్ట ఎడమ కాలువ ఇంతవరకు ఎందుకు ఆగిపోయింది ? ఎప్పుడు పని ప్రారంభిస్తారు ?

శ్రీ జె. వి. నరసింగరావు: కారణాలు తెలుసుకొని, అకారణంగా ఆపితే వెంటనే కొనసాగిస్తాను.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ప్రాజెక్టులుకట్టుతున్నప్పుడు దుర్వ్యయాన్ని అరికట్టలేనందుకు,కట్టుతున్న ప్రాజెక్టుల నీటిని వెనువెంటనే వినియోగించడానికి కావలసిన చిన్న కాల్వలను, పంటకాల్వలను త్రవ్వనందుకు.)

The motion was negatived

*Sri P. Sundarayya*: I demand a division Sir.

The House then divided :

Ayes : 25. Noes : 70.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To criticise Government for the failure to integrate Minor and Major Irrigation in one demand.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To criticize Government's failure to avoid wastage in the construction of Major projects.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకా కుప్పూరుపాడు గ్రామ చెరువు మరమ్మతు జాప్యము జరుగుచున్నందుకు)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

( నెల్లూరు జిల్లా కోవూరు తాలూకాలో ఉపయోగములేని వేగూరు చెరువును ఎత్తివేయనందున )

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(లస్కర్లు ఎంతదూరమునుండియైనా వచ్చి ఆఫీసర్ల యిండ్లవద్ద పండుకొని పోవువారికి ప్రయాణ భత్యము యివ్వనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా రామన్నపాలెం, రెడ్డిపాలెం మాక గుండిపాయి, రైతుల ఉపయోగార్థం మలిదేవికి ఆనకట్ట కట్టుటలో జాప్యము జరుగుచున్నందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ముధోల్ తాలూకాలో కుచెర గ్రామములో ఉండబడిన మత్తది తయారు చేయనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ప్రభుత్వము ముధోల్ తాలూకాలో త్రాగేనీళ్ళ బావులు త్రవ్వించనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ముధోల్ తాలూకాలో ఉండబడిన పాతచెరువుల మరమ్మతు చేయించనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the Nandivada Project in Palakonda taluk, Srikakulam District.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the irrigable area under second crop in Palakonda taluk of Srikakulam District under the Thotapalli Regulator System of Nagavali River and also of irregular supply of water under the above mentioned system.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To know the details as was covered about the Ichampalle, Pochampadu Project on Godavari.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To discuss about the policy of repairs of Irrigation Tanks in the taken-over estates in Vizag, Chittoor; East Godavari, Nellore and Cuddapah.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To impress upon the Government to undertake some Irrigation works to tide over the immediate food crisis.)

The motion was negatived.

*Mr. Speaker* : The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(To impress upon the Government to undertake Seeleru Scheme mmediately as stores and skilled workers are available.)

The motion was negatived.

*Mr. Speaker* ; The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా బయ్యావరం చెరువుకు సక్రమంగా రిపేరు చేయనందుకు, దానిని ఇర్రిగేషన్ డిపార్టుమెంటుక్రిందికి తీసుకొని ప్రత్యేకంగా maintenance పర్పాటు చేయకపోవడం గురించి.)

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా చేతంపూడి గ్రామంలోని రాళ్లపాడుగండి చెరువు నిర్మాణమును ఇప్పటికిని జరుపకపోవడంగురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా చల్లసముద్రం గ్రామంలోని పెద్ద చెరువు, మరియు రేలకాయాలపల్లి గ్రామంలోని పెద్దమ చెరువుల మరమ్మత్తు నేటికి పూర్తిచేయలేకపోవడంగురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందు తాలూకా కొండాయిగూడెం (పండితాపురం) గ్రామంలో కొండారెడ్డిచెర్వు తప్పుడు సర్వేనాధారం చేసుకుని ఆయకట్టును తగ్గిస్తూ చేస్తున్న మరమ్మత్తును గురించి ప్రజలు ఆందోళనను పెడచెవిని పెట్టుచున్న నిరంకుశ విధానమును గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(ఇల్లెందుతాలూకా బయ్యావరంచెరువునుండి గార్ల గ్రామంలోని చెరువుకు వచ్చు ఎర్రకాల్వకు మధ్యన గండ్లుపెట్టి నీటిని అపహరించుకొనిపోతున్నవారిని అరికట్టలేని ప్రభుత్వ అసమర్ధతను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నాగార్జునసాగరు ప్రాజెక్టు నిర్మాణమునకు తగినంత ధనము మంజూరు చేయలేదు గాన.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for
Irrigation by Rs. 100

(నాగార్జునసాగరు కుడికాలువను సాధ్యమైనంతవరకు పైగానులో మెట్ట ప్రాంతాలకు సౌకర్యము కల్పించుటకుగాను.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(భద్రాచలం తాలూకాలోని వల్లచెల్లి చెరువును మరమ్మత్తుచేసి గట్టును 1 అడుగు ఎత్తు పెంచనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the failure of the Government to improve the Paleru Channel Scheme in Jaggayapet taluq, Krishna District.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ఉప్పుటేరు స్కీమును అమలు జరుపుటలో జరుగుచున్న జాప్యంను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ఎగువ బుడమేరుకు వరద కట్టలను గురించి చర్యలు తీసుకోకపోవటం గురించి— నందిగామనుండి కౌలూరు వరకు, విజయవాడ తాలూకా.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(విజయవాడ తాలూకా దాములూరు, జూపూడి గ్రామాలను కృష్ణా నదిలో విరిగి పడిపోకుండా రక్షించుటకు అవసరమైన చర్యలు తీసుకోవటంలో జరిగే జాగును గురించి.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నాగార్జున సాగరు నిర్మాణంలో పాల్గొను కూలీలకు తగు సౌకర్యములు కలుగచేయకపోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(విజయవాడ తాలూకాలోనున్న కోనాయిగండి, చింతలచెర్వులను 2 వ పంచవర్ష ప్రణాళికలో చేర్చకపోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(బుడమేరు ప్రాజెక్టు స్థలనిర్ణయం చేయకపోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(బుడమేరు లోయర్ రీచస్‌లో కరకట్టలు పోయుటకు వెంటనే చర్యలు తీసుకోకపోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(తిరువూరు తాలూకాలో యున్న ముత్తగూడెం రాకట్టును గురించి సత్వర చర్యలు తీసుకోకపోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(విజయవాడ తాలూకా నందిగామ దగ్గర బుడమేరు కరకట్టలు బల పర్చుటకు, గండ్లను పూడ్చుటకు సత్వర చర్యలు తీసుకోకపోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(తిరువూరు తాలూకా తుమ్మగూడెం, కూనపరాజు పర్వ విజయవాడ తాలూకా నందిగామ పెద్దచెరువు మరమ్మతులను వెంటనే కొనసాగించక పోవుటను గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(కృష్ణాబ్యారేజి స్కీముక్రింద అదనంగా సాగులోకివచ్చే భూమికి నీటి సౌకర్యం కలుగచేయుటకు అవసరమైన చర్యలు తీసుకోనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(తమ్మిలేరు రిజర్వాయరు నిర్మాణమునకు పూనుకోకపోవటం గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(ధవళేశ్వరం ఆనకట్టపై 3 అడుగుల తలుపులస్థానే 6 అడుగుల తలుపులు ఏర్పాటుచేయుటకు సత్వర చర్యలు తీసుకోకపోవటం గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో 4 సం. లక్రితమే ఎస్టిమేట్లు వేయబడిన దాదాపు 25 స్కీములలో, కొన్నిటిని కూడా ఇంతవరకు తీసుకోకపోవటాన్ని గురించి చర్చించుటకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(గత సంవత్సరం అతివృష్టివల్ల పొదిలి, దర్శి తాలూకాలలో తెగిపోయిన చెరువులను పెక్కింటిని యింతవరకు పూర్తిచేయనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా పొదిలి తాలూకాలో మూసి స్కీమును (వద్దిమడుగుదగ్గర) అమలుజరుపుటకు జరుగుతున్న జాప్యమును గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో మేకలేరు ప్రాజెక్టును గురించి చర్యలు తీసుకోక పోవటాన్ని గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో ముక్కుపాపయ్య చెరువు నిర్మాణాన్ని గురించి చర్యలు తీసుకోనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(పొదిలి తాలూకాలో నాగులకుంట చెరువు నిర్మాణాన్ని గురించి చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is :

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా మెట్ట తాలూకాలలో కొలతలు వేయబడిన అనేక చెరువుల విషయంలో యింతవరకు చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(పొదిలి పెద్ద చెరువుకు కావలసిన కనీస రిపేర్లను గురించి చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నాగార్జునసాగరు కుడికాలవను ఒకేదశలో నిర్మించుటకు కేంద్రప్రభుత్వం చేత వప్పించుటకు తగిన చర్యలు తీసుకోకపోవటాన్ని గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకా చేజర్ల గ్రామ కొత్త కాల్వను 1949 నుండి పూర్తి చేయించనందులకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs: 100

(నెల్లూరుజిల్లా అల్లూరువాడలో 5000 ఎకరముల భూమికి మురుగు నీటి కాల్వను మంజూరు చేయనందుకు.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(నల్లగొండజిల్లాలో రామన్నపేట తాలూకాలో మాసాంపల్లిలో తెగిన చెరువు మరమ్మతు, ఎన్నారం చెరువు మరమ్మతుచేయుటలో జాగును గురించి.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the possibility of including the Anantaram Project in the mediumsized irrigation projects, Anantaram Project being situated in Sircilla taluk, Karimnagar District.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the possibility of constructing the Moola Vagu Project situated in Sircilla taluq, Karimnagar District.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the problem of undertaking an immediate census of all breached tanks in Karimnagar district and take up the repairs and restoration works of a good number of them immediately with a view to promote more agricultural production.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the undue delay in granting and to the Mannwada canal repairs despite the fact that the people have long back deposited their share of expenditure in Sircilla taluq, Karimnagar district.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(గోదావరి సెంట్రల్ డెల్టాలో రెండవపంట కాలములో తెరవబడకుండా వున్న మూతకాలువలను - పైపులను తెరిచే సమస్యను పరిష్కరించుటకు ప్రభుత్వం యింతవరకు పూనుకోకపోవడం గురించి.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss Government's failure to construct a dam across river Champavathi in Vijayanagaram taluq near Ballavametta to provide water supply to Anandapuram alias Kothapet village.)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment or Rs. 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss Government's failure to construct Gantikonda Project on Gostani river near vIllage in order to increase the irrigation facilities in Vijayanagaram division.)

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs 1,95,39,100 for Irrigation by Rs. 100

(To discuss the Government's failure to construct a Reservoir on the Budameru near Nandigama village in Krishna District (Bezwada Taluk).

The motion was negatived.

*Sri B. Sreeramamurty:* I demand a division Sir.

The House then divided.

Ayes 25-Noes 69.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

"That Government be granted a sum not exceeding Rs. 1,95,39,100 under Demand No. VIII—Irrigation."

The motion was adopted.

*DEMAND No. XXXVII — Capital Outlay on Irrigation*

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 4,40,40,000 for Capital Outlay on Irrigation by Rs 100

(To discuss the failure of Government in constructing the Musi Project in time.

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

To reduce the allotment of Rs. 4,40,40,000 for Capital Outlay on Irrigation by Rs. 100

(To know the fuller details of the items of construction of rrigation etc., works (non-commercial 68-A)

The motion was negatived.

*Mr. Speaker*: The question is:

"That Government be granted a sum not exceeding Rs. 4,40,40,000 under Demand No. XXXVII — Capital Outlay on Irrigation."

The motion was adopted.

*DEMAND No. XLI — Capital outlay on Multipurpose River Schemes.*

*Mr. Speaker:* The question is:

To reduce the allotment of Rs. 7,78,25,00 for Capital Outlay on Multipurpose River schemes by Rs. 100

(To impress upon the Government to request the Government of India to allot at least 10 crores for the Nagarjuna Sagar Project to be spent in this year without any interruption of work for want of money.)

The motion was negatived.

*Sri Vavilala Gopalakrishnayya*: I demand a division Sir.

The House then divided.

Ayes 25; Noes 71.

The motion was negatived.

*Mr. Speaker:* The question is:

"That the Government be granted a sum not exceeding Rs. 7,78,25,000 under Demand No. XLI — Capital Outlay on Multipurpose River Schemes."

The motion was adopted.

*Mr. Speaker:* The House now stands adjourned till 8-30 A.M. tomorrow.

*The House then adjourned till Half Past Eight of the Clock on Wednesday, the 24th July 1957.*